# భారతి - ద్వాదశ సంపుటము - భా. ౨.

## వ్యాసముల అకారాది సూచి

3

---

# భారతి - ద్వాదశ సంపుటము - భా. ౨.

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి



---

# శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారి షష్టిపూర్తి

[౨౮-౧౧-౧౯౩౪, విశాఖపట్టణము]

కవి పండిత సమక్షమున, శ్రీ విశ్వదాత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి ఆధిపత్యమున శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవము మహా వైభవముతో జరిగినది. శాస్త్రిగారు పండితుడు, కవి; వారి పాండిత్యమును, వారి కవితాశక్తిని అసంఖ్యాకములగు వారి రచనములు చాటుచున్నవి. వారికి దేశి తెనుగు పయి ప్రీతి మెండుగ గలదు. వారు సంస్కృత సాహచర్యము లేని తెనుగుభాష వ్యక్తిత్వమును నిలుపుకొనగలదని విశ్వసించినవారు. కావుననే తెనుగుయొక్క తెనుగుదనమును, వ్యక్తిత్వమును తెనుగువారికి తెలియజేయుటకయి వారు చేయుచున్న పరిశోధన అపారమయినది. దానికి ఫలముగ నపూర్వమగు తెనుగు నిఘంటు వొకటి సిద్ధముకానుండు టాంధ్రలోకము భాగ్యము. ఆ నిఘంటువు నిక్కముగ తెనుగు తల్లికి క్రొత్త యలంకారము కాగలదు.

శాస్త్రిగారు దేశసేవా పరాయణుడు; సంఘసంస్కారి; మతముకోసము మనుగడను బలియిచ్చిన త్యాగమూర్తి. వారిజీవితము పవిత్రమయినది; ఆదర్శప్రాయ మయినది.

శాస్త్రిగారిని, ఈ 'షష్టిపూర్తి' నెపమున పూజించి తెనుగువారు ధన్యులయినారు; పూజ్యులు నయినారు.

ఈ కార్యము ఆదినుండియు భారమును వహించి యిట్లు ఫలవంతముగ జేయగలిగిన 'కవితాసమితి' మిక్కిలి అభినందనార్హమయినది.

ఉత్సవసమయమున పలువురు శాస్త్రిగారిని యథాశక్తిగ ధనాదులచే సత్కరించి తమకు వారియెడగల భక్తిని ప్రకటించుకొన్నారు. అది సంతోషింపవలసిన విషయమెంతయును. కాని, వారెల్లరు సంతటితో నూరుకొనక శాస్త్రిగారు తలపెట్టిన నిఘంటు నిర్మాణ కార్యము సంపూర్ణమయి ఆంధ్రలోకమున కానిఘంటువు అందునట్లు చేయుటకు కావలసిన సౌకర్యముల నన్నిటిని సమకూర్పవలసియున్నారు. అది యవశ్యమగు కర్తవ్యము. అందువలన శాస్త్రిగారి కీర్తి చిరస్థాయి కాగలదు.

---




సంపు. ౧౨ యువసంవత్సరము, మార్గశీర్షమాసము (డిసెంబరు ౧౯౩౫) సంఖ్య ౧౨

# పంజరమునుండి బయటపడ్డ కోకిల

త్రిపురాన సత్యానందరావు

బందాలు తెగిపోయె నేడు తెగిపోయె నెల్లబందాలు
పని బూని రేవగల్ నేనే దృఢముగా నిర్మించుకొన్న
ఆ కనత్కనకపంజరము నేటితో ధ్వంస మైపోయె
చివురు చిక్కిసింది దినము చీకాకుపెట్టింది సతము
సంకెళ్లు గూర్చింది కాళ్ల వాకట్టు కట్టింది బలిమి
మింటికి గాలికి మఱియు నీటికి కూటికి చాల
ఇబ్బందిపెట్టింది మతికి రోగంబు చింత తెచ్చింది
ఆకనత్కనకపంజరము
నేటితో ధ్వంస మైపోయె!



12- 1 ౮౬౫

నే డెంతసుదినమో స్వేచ్ఛ గన్న నే డెంత సుదినమో!
వాడిన నా ప్రాణజవము పోయిన ఉత్సాహగరిమ
నా రక్తనాడులు మరల నేడుబ్బి పారజొచ్చాయి;
పుష్యమాసారంభ వేళ ఇదె యయ్యె చైత్రమయ్యింది—
నా భాగ్యలేశాన భళిరా చొక్కంపుచైత్ర మయ్యింది!
వలపుల చైత్ర మయ్యింది
తీయని చైత్ర మయ్యింది!!

ఎన్నడో యేజన్మమందో ఎక్కడో యేలోకమందో
వేడ్కమై నే పాడుకొన్న కమ్మని ప్రేమగీతాలు—
నేటికి నాదుచిత్తాన సూక్ష్మమై లీనమైయున్న
ఆ ప్రేమగీతాలు మరల వడివడి నుబుకుచున్నాయి!
నవనవభావాలతోడ నూతనరాగాలతోడ
కలకలశబ్దాలతోడ వింతైన పోకళ్లతోడ
ఆ ప్రేమగీతాలు నేడు
ఇంపుగా నుబుకుచున్నాయి!!

మాలతీకేతకుల్ మరియు చంపకాల్ పూతకొచ్చాయి—
షడృతుకుసుమాలు నేడు వింతగా పూతకొచ్చాయి!
బాపురే ఈపూలతావి వీచికల్ నిండుకొన్నట్లు
నే నింక పాడుకుంటాను—ఎలుగెత్తి పాడుకుంటాను;
పీయూషరసధార లలర గొంతెత్తి పాడుకుంటాను;
నన్నెవ్వ రాపలే రిపుడు నాధాటి కోర్వలే రిపుడు
నన్నెతిచూడలే రిపుడు స్వేచ్ఛావిహారాన నేను
మాటికి ప్రేమగీతాల
గొంతెత్తి పాడుకుంటాను.

---

ప్రథమ ద్వితీయ సంపుటములు,

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.

ప్రథమసంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్యు" వరకును గల విషయము గలదు. త్రివర్ణ పటములు ౮, ఇతర పటములు ౧౨౫, వివిధ విషయములు ౪౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦లకు మించిన పుటలు కలవు. "అన్" మొదలుకొని "అశ్విని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౨ అమరావతీస్తూపమునకును ౨ అనాహతమునకును చెందినవియు ౬ దేశచిత్ర పటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదా దేశపటములుకలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీస్తూపమునుగురించినగొప్ప వ్యాసమునందు అమరావతీశిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయమను వ్యాసమున భరత శాస్త్రమునందలి వేఱువేఱుహస్తములను సూచించు బొమ్మలు ౫౭ ను, 'అనాహతము' నందు షట్చక్రాదులచిత్రములును గలవు. ఇట్లు ఆయావ్యాసములకు చెందిన చిత్రములు మొత్తమువిూద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధవిషయముల సంఖ్య ౪౦౦ వరకు నుండును. సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. ప్రతిసంపుటమున ౬౦౦ పుట లుండును. ప్రతి సంపుటము వెల రూ. ౧౦. ప్రవేశరుసుము రూ. ౧. మొత్తము రూ. ౧౧. పోస్టుద్వారా: రూ. ౧-౮-౦ రైలుద్వారా: దగ్గరచోట్లకు ఖర్చులు అ. ౧౨.

☞ పోస్టు - రైలుఖర్చులు ప్రత్యేకము. చందాదారులు అడ్వాన్సు రూ. ౫ లు పంప ప్రార్థితులు.

మూడవ సంపుటము ముద్రణమున నున్నది. అందు ఆంధ్రదేశచరిత్రము, వాఙ్మయము, భాష మొదలైనవిషయములకు సంబంధించిన వ్యాసము లనేకములుకలవు. పండితసాహాయ్యమునను, అపారసాధనసంపదల మూలమునను, సాధ్యము గాదగిన ఈ కార్యమును తలపెట్టుట సాహసమును, అనాలోచితమును ఐనను ఆంధ్రమహాజనుల సాహాయ్యమున నీప్రయత్నము సఫలముగాగల దని నమ్మిచు యథాశక్తిని సహాయముచేయుటకు వేడుచున్నాము.

మేనేజరు, ఆంధ్ర విజ్ఞానసర్వస్వ కార్యాలయము, నెం 7, తంబుశెట్టివీధి, మదరాసు.

# చెలిమికానికల చెల్లుబడి

మున్నంగి శర్మ

## కృష్ణరాయ - బాపిరాజు కవులు

సామాజికాది ప్రజాజీవనసంబంధిశాఖలందు వలె, సారస్వతవీథియందును వ్యక్తి ఉచ్ఛృంఖల వృత్తితో యథేష్టముగ విహరింపదొడగెను. నేడు తెలుగున వెలువడు పొత్తములు చిత్రవిత్తులు. ఈ ప్రోవునుండి వెనుకగలవానికి గావ్యము లనజెల్లినవి కడు కొలదిగ దొరకగలవు. వెదకుచో సుఱిగలచూపు, తఱచవు లెఱుగు నేర్పు, తడబాటులేని యోపిక, తలపక్షు మెఱుగని తలపు, పలుకుబడిమీఱి వలపుపొనుపడవలయును.

“నేడు వెలువడు గద్య-పద్యాత్మకములలో సంఖ్యయందును, ఘటితియందును మాత్రమేగాని నిజముగా భావనాక్రమమున భేదమునునది లేదు.” అనిన ‘పోప్ వ్యాసము’నందలి వాక్యము ఈనాయూహ కూతమిచ్చుచున్నది. ఔను-మన తెలుగుబాసకు క్రమముగ బలుపు తగ్గినది; వాపెక్కుచున్నది. నేటి మన తెలుగువ్రాయసకాండ్రలో పెక్కుర విశృంఖలతకు తొట్టతొలిగ జెప్పవలయు గారణములు మూడు: రచయిత తన్నుదా మఱచుట మొదటిది; తప్పు దిద్దుటకుమాఱు’ దగనొని, ఎవడేదివ్రాసినను ‘మహాప్రసాద’ మని కలములు నించుకొనుచుండు పత్త్రికానామములుగూడ బ్రదికియుండుట రెండవది. ఇక మూడవది-తమ తెగవారు వ్రాసినదెల్ల ‘అపూర్వరచన’ యని అగపడినపత్రికలలో అవకాశము దొరకపుచ్చుకొని పొగడితలు గుప్పించు తెగులెగ బ్రట్టుటయు ఇపుడిపుడు తలసూపుచున్న “భారతి” విమర్శనలయందలి చిఱుచఱపులును, “ప్రజామిత్ర” ‘చణుకులం’ దోచు ములుకులును, “ప్రబుద్ధాంధ్ర” ‘వ్యాఖ్యానము’ లందలి బాడిసచెక్కులును మొదలుగా నిట్టి నిష్పాక్షికపరామర్శలు తగిన చికిత్సలై తెలుగుబాసకు దాపురించిన వాపు తగ్గించి, చేవ దక్కించునని యాస వొడముచున్నది.

అల్లసాని పెద్దన, పింగళిసూరన మొదలుగా కవిలోకగణ్యులు కావ్యకళాస్వరూపము సమగ్రముగ, తేటతెల్లముగ తెలుగున దెలిపిరి. అంతకన్న తేలికగ సూటిగ దెలిపిన “వివేచనమును వ్యక్తీకరించుటయ కవిత్వము”౧ అను వాక్యమును, పూర్వోక్తమునూది ఈ నా ప్రకృతాంశము సాగింతును.

రచనలు రెండురకములుగ విడదీయ వచ్చును: ఒకటి - ప్రయోజనప్రాధాన్యము; రెండు - కళాప్రాధాన్యము. అనగా ప్రయోజనము ప్రాధాన్యమయ్యు కళకు జోటిచ్చు రచన లొకరకము; ఇట్టివి ప్రథమగణ్యములు. కళయే ప్రయోజనముగా గల రచనలు మఱొకరకము; ఇది ద్వితీయగణ్యము. కళాసమన్వితములుగాక కేవలము ప్రయోజనము వెలువరించు రచనలు ఇట ప్రసక్తములుగావు. ప్రయోజన ప్రాధాన్యమయిన కావ్యాదిచిత్రకళలు సమాజమున నభిరుచితో గూడిన యాదృతికి భాజనములగుటయకాదు - అట్టిరచనలు సంఘజీవనమును వికసింపజేయ నుపకరింపగలవు. ఇట్టిప్రయోజనప్రాధాన్యముతో కళాకలితములైన కబ్బములు కొలది. వానిలో జాలవఱకు అచ్చుకెక్కినవే. ఈ అచ్చుకెక్కిన వానియందును నేస్తుల మెచ్చుముద్రలంబడినవి కొన్ని; మఱికొన్ని అసూయా

---

౧. “In truth, the only difference between poetry and prose, in this age, consisted in numbers and in rhymes and not in the order of ideas presented.”
—‘Pope’s essay on man’ edited by Mark pettison.

౧. “Poetry only as an expression of common sense.” —Pope’s essay.

గ్రస్తుల బాఁటెనిబడి అదవదలైనవి. ఇగ గడమువడినవి కొన్ని ఉదారవిమర్శలకు బాత్రములైనవి.

కావ్యాది కళాప్రపంచమునకు దరతరములుగా వెలివాడనుండిన వైశ్యసంఘముగన్న సంతానమునుండి తొలకరించిన కృతులను, గుణాలంకృతములను ఇతః పురావిస్మృష్టములను గొన్నింటిని ఈనాముచ్చటకు ఆధరువులుగా గొంటినని మనవి.

తెలుగుసీమయందు నెళవునెప్పలు గడించుట లో నను మిగిలిన సహృదయుని నాళము కృష్ణరాయుని, వరిష్ఠుని చిరంజీవి బొడ్డు బాపిరాజును అగ్గించుట కన్న, వారిరచనలను నుగ్గడించుటయ ప్రకృతము నా యుద్యోగము.

### కానిక - కజ్జాయము :

కృష్ణరాయడు అన్నిట నాకు బెద్ద. నలువదేండ్లనాడె తెలుగుతల్లికొలువునకై మనుగడ మీదుగట్టిన యనుంగుకొడుకు. తెలుగుపలుకుపాలు తనివారద్రావి త్రేచిన వలతిపిండు. ఈతని యుడివోని తెలుగుబాసయూడిగమునకును, కావ్యకళాప్రవణతకును, అన్నిట మేలిమెఱుగులిచ్చు చరిత్రకును, ప్రేమడికిని, పెద్దతికమునకునుగా నాకట్టిన చెలిమిముడుపున దొలికానిక ఈముచ్చటరూపున జెల్లింతును. పదంపడి చిరంజీవి బాపిరాజకవికి పసవనముకానిక దీవనలతో నందింతును. నెయ్యుర యెడగల కూర్మియు, తదీయరచనలయందలి గుణవిశేషమును నన్నీ తగనిపనికి బురికొల్పినవి. అలతినయ్యు నీ వలతిచేతకు దెగించితిని. నేస్తములచెలిమి కనుగప్పుట ప్రక్కపాటులకు, ఇచ్చకములకు నెడమిచ్చునేమో! పఠితలు హెచ్చరింతురు గాక!

> "గుణాః పూజాస్థానమ్ గుణిషు
> న చ లిఙ్గమ్ న చ వయః."

అనిన పెద్దలసుద్ది నెంచి నేస్తములజోలి మఱచి వస్తువుపై జూపు గుఱిసేయ గడంగుదును.

### కృష్ణరాయకవికృతములు :

కృష్ణరాయని రచనలలో ఇంతకు అచ్చునబడిన గీతికలు పరస్సహస్రములు. అందు పాత్రముల రూపుదాల్చినవి సగటున పది. వీనిలో ఆదరువులుగ నాకొనినవి మూడుమాత్రము : 'ముద్దు', 'పాలతరగలు', 'తేనెచినుకులు' అనునవి.

కృష్ణరాయని కవితాకుమారికి నలువదేండ్లయీడు వచ్చినను నవక మెడలదు - నడకసడలదు. తలపున ముడి బడదు - పలుకున దడబడదు. కన్నెతికము గాచుకొను చు కన్నతండ్రిచాటున మెలగుచున్న బిడ్డ. పిన్నటనుండి పెద్దపోకిళ్లమాటి. శైశవక్రీడావినోదము తెలిగియు మరగదు. విభ్రమవిలాసములం దలుగువడదు - విఱ్ఱవీగి తిరుగదు. కలికితనపు చెలువమునకు వన్నెబెట్టు తలపు నెఱవు, తలపునెఱవుం గులికించు పలుకుపరువు పుట్టువుతో బుట్టినవి. తలపుటూటకు పలుకుతేట జతవడినది. పలుచవులూరించి పండువుచేయజాలినది. ప్రయోజనమున కనువగు వస్తువరణము, వస్తువున కొప్పిదమగు పతకము, పతకము నడపగల పలుకుబడియు, పలుకుబడి కుసురువోయు నెత్తుగడయు ఈతనిరచనయందలి మేలిగొనములు. ఏరికోరి పుడికి పుచ్చుకొనిన వస్తువును నిజభావసంస్కారమున దిద్దితీర్చి ముద్దుగ గూర్పగల నేర్పరి. తలపున బలుకు నెలయించినాడు. పలుకున దలపు మొలిపించినాడు. సామెతలపుట్ట, చతురచాటూక్తులలోదిట్ట. అవనెఱిగి పరియాచకములం బచరించుటలో అందెవేసినచేయి. మాటనాణెము వట్టుటలో మేటిజాణ. మాటమాటకు గిం కీఁబేరగాడు. ప్రొద్దువిలువకన్న సుద్దివిలువ హెచ్చు. మాటదు బరాహార్కాన్ పనికిరాదు. పలుకుబడి కందిన ప్రాతసరకును క్రొమ్మెఱుగులతో సరిక్రొత్తగమార్చి ధర పెంచు గడుసరి వర్తకుడు. తనరచనల నన్నిట తనవైలక్షణ్యమును ముద్రించుకొన్నాడు. వృత్తముల నన్నిటిని దడవి కడకు గీతికను వలచినాడు. తనగీతికలో గొననిభావము లేదు. తనకలము గురియని రసములేదు. పదలుబ్ధుడయ్యు భావసామ్రాజ్యముల నిర్మించినాడు. వస్తుసృష్టియందు స్వతంత్రత జూపినాడు. పుష్పాడితిప్పల బయనించు పూలరథముమీద తనకవితాకన్నెను తనవలెనే మెఱవడిచేసినాడు. వంకరలు, వడిముడుకులు, కదుపులు, కుదుపులు లేని తిన్నని తెరువున నడిపినాడు.

పల్లవముంబోని పదజాలమున పదనైన భావ తీవ్రత గోచరించినది. ఉత్ప్రేక్షాదిశ్లేషలకు బహిష్కృతి. సమాసనమ్మర్దములకు స్వస్తి. భావమునకు రూపమిచ్చి పలికింపజాలిన ప్రతిభ. వస్తువుమీద జూపు - రసముమీద మనసు - ధ్వనిమీద మోజు - నానుడియందు తీపి- పలుకునాణెముమీద మరులు - భావమేలివలపులు విరజిమ్మినది. ఈకవికృతములలో 'గోగీతము', 'నంద' మొదలుగా 'పైడిలేడి', 'అపవాదము' వఱకు దాదాపు ౭, ౮ పాత్రములు, ఒక్కొకటి ఒక్కొక ధర్మబోధకమగు నితివృత్తము నండగాగొని తనరచనాకౌశలము జూపబడినవి. ఒకొక్కటి ఒకొక్క ప్రయోజనము బాటించి రచింపబడినవి. ఈతని



నాళం కృష్ణరావుగారు

ప్రసాదనమున మెలకువ - వృత్తియెడ స్వాధీనత - ప్రకృతిమీద ప్రభుత్వము - ఇట్లు ప్రశంసాభాజనమయిన కళాచిత్రణము- కవిత్వము-కృష్ణరాయనిహస్తము నందలి భాగ్యరేఖయైనది. ఈకవికృతములు రసావేశమున వ్యాకరణాదిమర్యాదల నొత్తిగించినవి. వాడుకమాటలకు దగుపట్టుల తావులిచ్చి భావమునకు జీవమిచ్చినవి. ఈతని కవితాలత ననలుకొనలుసాగి తెలుగుతోటలమున కవితాశిల్పముగూర్చి పై నావ్రాసినపంక్తులకు మచ్చుటగ నావరించిన యాతనిపాత్రములను డిజాంమాత్రసూచికగ బరామర్శింతును.

## తేనెచినుకులు :

ఇందు ౧౬ విషయములు గీతికలలో చిత్రితములైనవి. 'కేసబియాంక' మొదలుగా 'ప్రణయమహిమ'

వఱకు ఐతిహ్యముల నాశ్రయించినవి. కొన్ని ఆంగ్లము నుండి అనుకరింపబడినవి. మఱికొన్ని సొంతములు.

**పాలతరగలు :**

ఇందును ౧౯ విషయములు చమత్కారములగు కతలు- పాడుకలోనివి- శిల్పకళలం దాపినవి.

ఈ రెండురచనలలోని వృత్తములు ఆబాలవృద్ధముగ జవులూర జదువదగినవి. వీనియందు ముఖ్యముగ బాలబాలికల భావిజీవనమునకు సంస్కారపథములు చక్కగ జూపబడినవి. ఈరచనల మూలమున కవి తనప్రతిభావిశేషముం జాటుకొన దలపెట్టడు. తనకైతలను లోకమేగించుటయు దలపుగాదు. తెలుగుబిడ్డలకు తల్లినుడిమీద తీపు గలిగించుటకు, తెలుగుకైతయెడ వలపుగొలుపుటకు, దేశసేవాపరాయణతం దెలియజెప్పుటకు, స్వధర్మము నప్పుటకు ఉద్దేశించినాడు; కృతకృత్యుడైనాడు. కవినని మఱచి, కన్నతల్లిననుకొని బిడ్డలకు వినోదముగ సుద్దులలో బుద్ధులు గఱపినాడు. 'మధురకవి' నామము చరితార్థమైనది.

ఇవిగో నా మాటలు దక్కింపగల మచ్చులు:-

శైలి:

"పువ్వుఁదేనెయు తావియు పుప్పొడియును
చిందకున్నను చెడకున్న చెదరకున్న
ముద్దుబిడ్డల నవ్వుతోఁ బోల్పవచ్చు
క్రొత్తఁగా విచ్చు పున్నాగగుచ్ఛకంబు"
"కన్నె వెన్నెలకన్నను, వెన్నకన్న,
మంచుబిందులకన్న, క్రొమ్మించుకన్న,
కుసుమమకరందమునకన్న కోమలంబు
చిఱుతపాపల చిన్నారి చిన్నినగవు"
(తేనెచినుకులు)—పసిపాప

ఇందు శైలిమార్దవమే కాక, పొత్తిటినుండి తప్పటడుగులిడునందాక పసినిసుగునందలి పరిణామక్రమమును చిత్రింపబడినది.

రసానుగుణమగు రచన:

"భీకరకరాళసర్పజిహ్వాకల భాతి
బుస్సుబుస్సని చిచ్చులు బుగులుగొనియె
విలయకాలము శాసించు విభునిఁబోలె
నిర్భయంబుగ నిలుచుండె నర్భకుండు"
"కడలి కడుపునవడగెనో! గాలిలోన
లీనమయ్యెనో! బాలుండు కానరాఁడు
మిణుగురులఁ బోలె ధగధగ మింట మెఱయు
నగ్నికణముల నడుగుఁడీ యతనిజాడ"
తే. కేసబియాంక

పదునైదు గీతికలు : కతయెల్ల పట్టుకత్తిరించినట్లు తెలిపినవి. కత భయానకము నొఱసి కరుణముం గ్కసినది.

తెలుగునుడి వలపు :

"మూడుజాములరాతిరి ముగిసె నిపుడు
ఎట్టియలికిడి వినఁబడ దింతవుక
జరిగె నారేయి, సిద్ధము జయ మటంచు
మోదమందుచు నాతఁడు మురియుచుండె."
"అడుగు సడిగాదు, పెనుగాలి యగ్గలించి
గుమురులై యున్న యాకుజొంపముల వీవ
ఆటమటించెడు రెమ్మల తటపట లవి;
గుసగుసలుగావు, పాముల బుసబుస లవి"
తే—బాలవీరుడు.

వస్తువర్ణనము :

"ఏమియనుచుంటి? వీవు పాణేశ్వరివియ?
రాజ్ఞులము మేము మేవాడురాజ్యరమకు,
ఉసురు లీదేహమున నిల్చియుండుదాఁక
పాటిగొందుమె నీ సార్వభౌమపదవి?"
"తల్లి! భారతమహిళామతల్లు లిట్టి
దివ్యరణతంత్రకోవిదల్ దేశభక్తి
నిరతలంచును మున్నె నేనెఱిఁగియున్న
పొలువడుదునె యకట! యీ పాడుపనికి?"
తే—అక్బరు నిర్వేదము.
"ఓఁడు తోడనె యావైపు దృష్టిబఱపె,
మబ్బుమాటున చంద్రబింబమువోలె
మేలిముసుఁగున నెమ్మోము మెఱుఁగులీన
తరుణి యొక్కతె నిలుచుండె శిరమువంచి."

"చారుసుకుమార సుందరాకారమైన
యీ మెకడుపున నే నుదయించియున్న,
అహహా! నే నెంతధన్యుండ నగుదునో కద,
యనుచు గద్గదరవమున ననియె ఓఁడు"

తే—శివాజీ శీలము.

పై 'అక్బరునిర్వేదము' న పడతులయందలి ప్రతాపము, 'శివాజీశీలము' న ధీరపురుషుల చిత్తనిగ్రహము నిసుగులకు దెలుపుట కుద్దిష్టములైనవి. వస్తువరణమునందలి ఔచిత్యముం జూపుట కింతవట్టు జాలును.

పలుకు పొందిక:

"పృథివిలోఁ గలయట్టి వృత్తులలోన
బిచ్చంపువృత్తియే హెచ్చైన వృత్తి;
చెట్టునీడలె నాకు పట్టెమంచములు,
చినుఁగుబట్టలె నాకు చీనాంబరములు
పుట్టగోచియె నాకు పట్టుపుట్టంబు
భిక్షాన్నమే నాకు పిండివంటకము
బూదిపూఁతయె నాకు పునుఁగుజవ్వాది
పూరికొంపయె నాకు భూరిసౌధంబు;
రాజ్య మెవ్వరిదైన, రా జెవ్వరైన,
నాకేమిలక్ష్యంబు? నాకేమికొదువ?
రాజశాసనములు, రాజ్యాంగవిధులు
ఎన్ని మాఱినయేని నన్నేమిసేయు?
కఱవుపై కఱవులు కలుగఁ గాకేమి,
పెట్టరే యెవరైన పట్టె డోగిరము?
సంతత మీశ్వరస్మరణమే కాని,
ఇతరచింతలు నాకు నెవ్వియు లేవు.

అన్యులపదవుల నాసింపఁబోవ
పరులు నాపదవికి వాంఛింపఁబోరు."

పాలతరగలు—బిచ్చగాడు.

ఇందు పలుకుపొందికలో భావసంస్కృతి ప్రతిఫలింపదా?

నుడుల వేర్పాటు:

"అమ్మ! భైరవి కెంతటియాగడంబె?
బావిలోనున్న ముద్దుపాపాయితోడ
ఆడుకొనఁబోవ నన్నది యదిమిపట్టి
చిన్ని యొకమాట చొక్కాయి చించివైచె."

పా—విశ్వాసము.

వయసుంబట్టి నుడులవేర్పాటులు చూపిన పట్టులు పెక్కులు.

సామెతలు:

"సమ్ముఖమ్మున రాయబారమ్మేల?"
"మూసలోఁబడ్డ బంగారుపూసభంగి"

పా—సందేశము.

ఇట్టి సామెతలు తఱచు ఈతని వ్రాతయం దగపడెడి.

పొదుపు:

"కుడువ, కట్టఁగ, వస్తువుల్ ముడిచిపట్ట,
చదువ, వ్రాయఁగ, కార్యముల్ చక్కఁబెట్ట,
సంతతంబును తోడయి సాకుచుండు
నాదు మేలైన కుడిచేయి నాకుదిక్కు."

పా—నాదు మేలైన కుడిచేయి.

"గడ్డిమేయుచునున్నది' 'గడ్డిమేయు'
'పాల నిచ్చుచునున్నది' 'పాలనిచ్చు'
'పేఁడవేయుచునున్నది' పేఁడవేయు'
'దూడలీనుచునున్నది' 'దూడలీను"

"తూనికతూఁచితి సరియైన తూనికతూఁగ;
గీటు పెట్టితి, మేలిమిగీటువచ్చె;
నాణెమరసితి చక్కని నాణెమమరె;
సంతసించితి పనిజిగి సంతనకును".

పా—లక్కగేదె.

చాటూక్తులు:

"పడగ, తోఁకయు, నొక్కింత వాయుబలము
నమరినంతన, పెనుబాముపై తినంచు
ఇనుని మ్రింగఁగ నింగిపై కెగసె దొర!
కాలికూలనె మసియౌచు గాలిపడగ?"
"కొంటెఁ బోరలాడు గోచుల నంటఁగట్టి
తోఁకయొక్కటి తగిలింప త్రుళ్లిపడుచు

అల్ల హనుమంతుతో సాటిసైతి ననుచు
గంతులిడియెదవే భానుమంతు మ్రింగ"
పా—గాలిపడగ.

భావమునను, పదప్రయోగమునను సమానధర్మ మూలం బోషించి, వ్యక్తులను ప్రక్కపోట్లుపొడుచు నిట్టి చాటూక్తులు - అన్యాపదేశములు రచించుటలో గడు మెలకువగలవాడు.

ఒక్కమాట 'ముద్దు'పాత్తమున:
"ముద్దు సకలరాగరసైకమూర్తి తలంప
మలయమారుతమున చల్వ లలరినట్లు-

అనువాక్యము మొదలుగా ౭౫ పంక్తులు రాగ ముల పేళ్లు ఇమిడ్చిననేర్పు చూపుట కక్కఱవచ్చు నేమోకాని, వట్టికొఱమాలినపనియని చెప్పకుండరాదు. రసలుబ్ధుడను కవికలమున కొప్పినదికాదు. పరిపాకము నకు వచ్చిన పదార్థము పసచెడినది. చతురత మితిమిగిలి ఛాందసమునబడినది. రాగములపేళ్లి నిరికించుటకు వెం పరలాడుటచే రసము మోము మలచినది!

## 'ముద్దు':

ఇది పలుకున మొలిచిన తలపుతంపర. ఏతి హ్యముకాదు, అనుకరణముకాదు. నిరవకాశము, నిరా లంబము నగు నంతరాళవిహారము. మొత్తముపంక్తులు మూడువందలకు మిగిలినవి. పల్లవిపంక్తులును, చివర నొక డెబ్బదిపంక్తులును తీసివేసినను నికరముగ రెండు వందలకు మించియుండును. ఈకృతియందు రచయిత తన తలపుకలిమిని, పలుకుసిరిని నెఱచూఱ లిచ్చినాడు. భావశుద్ధికి పదసిద్ధి ఎదుర్కొలిచ్చినది. గమనస్వతంత్ర తతో కళాకౌశలము కొసరికొసరి కొనుగోలు సాగించి నది. సామెతలతో నానుడు లామెత లందుకొన్నవి. చదువరులకు సరాగములు చవులందిచ్చినవి. ఇదియొక వింతసృష్టి! ఎల్లెడ క్రొత్తదనము వెల్లివిరియుచున్నది.

సజీవమగు నారోహణముం బోషించు సంచార శీలము, సంచారశీలముం భూషించు నవరోహణము— సృష్టిస్థితిసంహారక్రమమున సమాహారము చేయబడినది. ఈరచనయందలి శబ్దసామ్యవాది భావనా పరంపరలం దడవ మొదలిడిన దీర్ఘమగును. ఇంతట ఈ వివరణము ముగించి పాత్తమునందలి పంక్తులం గొన్నింటిని మూద లింతును.

"ముద్దు బోలిన ముచ్చట పుడమిఁగలదె?
ఒకరి కది వమ్మ, తగ నిర్వుర కది సొమ్మ.

* * * * *

శిశు వయాచితముగ దాని సేకరించు
పడుచువాఁ డది నేర్పున గడననేయు
ముసలివాఁ డది బలిమిమై పులిమికొనును
పాలబుగ్గల పసిపాప షాలిసొమ్ము
వలచి వలపించు ప్రియునకు తలఁపుపంట
కుచ్చితపువేసగానికి తెచ్చికోలు
లేతపాయంపు జవరాలి కూతకోల
ప్రౌఢయువతులపాలిటి పట్టుకొమ్మ
వృద్ధసతికి దయాధర్మభిక్ష; మకట!
లంజ కెప్పుడు విడని వేలంపుసెట్టి!"

* * * * *

"కామశాస్త్రంబునకు నుపోద్ఘాతరచన
సూనశరుకావ్యమునకు వ్యాఖ్యానకర్త
అతనుతంత్రంబునకును బీజాంకురంబు
ప్రణయమంత్రము బోధించు పరమగురువు
అంగజుని పూజకై చేయు నాచమనము
మరునిసంకీర్తనముచేయు మురళిరవళి
కంతువిజయంబుప్రకటించు కంచుఢక్క
అతనుసామ్రాజ్యమందు సింహాసనంబు
కుసుమశరు హజారమ్మునకు మొగసాల
మదనయాత్రకు విడిసెడి మొదటిమజిలి
అలరువిలుకాని సమ్మోహనాస్త్రమరయ
వలపుటోగిరమందలి తొలికబళము
వలపుచేనిలో తొలుకారు పండుపంట
వలపుముత్యాలదండకు కొలికిపూస"

* * * * *

"మగనియంగడి కొట్టులో మచ్చుదినుసు
మారుబేరమునందలి మంచికొసరు
చెఱకువిలుకాడొసంగెడి సెలగచేయి
అసలుకంటెను పప్రయైన సిసలువడ్డి
మాటమికి నాణెమును జూచు గీటురాయి
సోలివాలు దంపతులకు జోలపాట
అలయికలు వాపికొనగ గొను సెలవుచీటి"

*     *     *     *     *

"ఎద్దులేకుండ బండియు నేసగాని
ముద్దులేకుండ సంసారములు నడుచునె?
చద్దిలేకుండ నొకపూట జరుపవచ్చు
ముద్దులేకుండ నొకప్రొద్దు పుచ్చ నగునె?"

*     *     *     *     *

"'ముద్దు'నను శబ్దమై చిత్రి పొగడవశమె?
అందు మూకుదకారంబు లమరవలసి
యుండ, రెండుమాత్రమె యేల యుండెనొక్క
ఒకటికొనువారి, దిసువారి దొకటికాన
రెండుమాత్రమె యంగున నుండెఁ బోలు
అహహా! మఱచితి, మూడవ దతనువశము"

—ముద్దు

ఇట్లు సంక్షిప్తంక్తియు, పదముపదమును రస ప్రసన్నములైనవి. ఎన్ని చూపను? చదివి యానందింప వలయునుగాని విప్పిచెప్పకొలది విషయము చప్పబడును.

చిరంజీవి బాపిరాజకవికృతములు :

పత్రికలంబడిన పద్దెములు పెక్కులు; ప్రాత్తముగ రూపొందినవానిలో కళామూర్తికి మీదుకట్టినది ఒక్కటి; అది యువ-వసంతములోని 'విపంచి'. అమ్మ మాటున నలవోకగ దాసురమూతలాడుచుండిన ఈకవి కుమారుని కవితాశిశువు ఐదేండ్లనాడే కావ్యవీథి నల్లారు ముద్దుగ నాడజొచ్చినది. 'భారతి'కి తొలిముద్దిచ్చినది. పదంపడి ఆటలమ్మోజునబడి పలుపత్రికలవెంట పరువు లెత్తినది. ఈయైదేండ్లయీడునకే పదుముపాయపు కలికిపలుకులు, పలుకులు నెన్నేని నేర్చినది. వలపు గొలుపు ప్రక్క చూపులు, వగలమారి నైయారిపోకలుం జేర్చినది. క్రమవచోరచన కనువగు గతిసారళ్య మేర్పడినది. రసజ్ఞులమన్ననలకు బాత్రమయినది.

కృషి :

పున్నెముకొలది పుట్టువుతో బుట్టిన కవితాధార, పటికపురాలపై జలజల జాల్కొను సెలయేళ్లవలె, పలు తెరగుల పొంగిపొరలజొచ్చినది. తిన్నని తెన్నుల నొక్క మొగాళమునకు మలిపి రసాళయముం జేర్పగల సురత్వము వచ్చినది- దారియేర్పడినది - చవిదొరకినది - కృషియు దొరకొన్నది. తెలుగునుడి చెలువము మురిపించి మరులు గొల్పినది. సంస్కృతముపోడుముల జాడ లగపడినవి. హిందీ మెలుగులతో ఇంగ్లీషు మెలుగులును చూపడినవి. చిత్తారిపనితనముమీదను చిత్రము గంతువేసినది. చేసినకృషి మోసులెత్తినది. మోసు చిగిర్చి మొగ్గ దొడిగినది. పూచి కాచినది. కలవుపంట కళ్లమునుండి గాదెల నిండినది. ఆపంటసరుకు నాణెమునకు 'విపంచి' పేరి ఈకృతిమంజరి ఒకనమూనా.

ఇది ఆఖ్యాయికకాదు - సంవిధానాదికౌశలముం జూపుటకు; ప్రబంధముకాదు - ప్రకరణానుకూలవర్ణనలయందలి వృత్తులమార్పులమార్పును, నేర్పును జడవుటకు; నాటకముకాదు- ప్రణాళికమొదలుగా రసాభ్యుచితపాత్రపోషణాచాతుర్యముంబరామర్శించుటకు. భాణమేనికాదు - వస్తుసృష్టిమొదలుగా వాదనైశద్యమును విచారించుటకు. అనువాదముగాదు - మాతృకతో బోల్చి పరికించి తరతమముల నేర్పరించుటకు. తుదకొక కథ కాదు - వస్తుసాంగత్యము లేదు. ఒక వరుసలేదు - ఒక వర్ణనాంశము కాదు. అంతరాళమున క్షణప్రభలంబోలి అప్పటికప్పుడు పుటమరించిన పలుకుమలుపులతో వెలికుబికిన తలపుతరగలముత్తమే ఈపాత్రము.

ఒక్కొక్క తీగనుమీటి, నాదము సరిపఱచుకొని, తీగలనన్నిటిమొత్తముగ శ్రుతి మేళగించి ఒకస్థాయి శ్రుతికి దెచ్చునట్లు రసజ్ఞులు ఈపాత్రమునందలి వివిధ విషయములను దేనికి దానినే వేర్వేఱుగ విచారించి సగ

ఱని కవితాశిల్పనైపుణిం గనిపట్టుదురేని తన కళాతపస్సు ఫలించుటసరికదా తనకబ్బుచుపేరుగూడ సారకమగునని కాబోలు ఈగడుసరిపడుచుకవి 'విపంచి' యని ఏరి



బొడ్డు బాపిరాజుగారు

కోరి పేరుపెట్టుకొన్నాడు. కాదామఱి, రసజ్ఞతకిది యొక్క పరీక్షయ!

'విపంచి':

ఈ 'విపంచి' 'ఆవాహనము' మొదలై 'సాక్షాత్కృతి' వఱకు విశంతి (౨౦) విషయములం గూడినది. వీనిని స్థాలీపులాకన్యాయమున నింత పట్టి చూతును. కళాకౌశలముం దడవ గడంగితి నగుట పొరపాటునసేని, బుద్ధిపూర్వకముగనేని ఇందు పొరలిన కించిద్వ్యాకరణాదిదోషములజోలి మానితిని.

ధారాశుద్ధికి:

"అట్టనటం జిక్కువడ్డ తుహినాంబువు
ల్లన జాటి మోవి చెం
గటం దరితీపి వెన్నెలల కాంతులం
దావులు ప్రోవుసేయం, జె
క్కిటం జెమరించు కోరికలు క్రేంగను
లం దగుపింప, మాటి కా

సాగుచునుంటి క్రొత్త యభి
సారికయు, ట్లదికాదపోని, ప్రే
మాగమవేత్త వేఱొక మ
హారసికుం డెవండేని పంపంగా
నేగుచునుంటి నేము హృద
యేశ్వరికిం గుశలమ్ము దెల్పంగా!"
—తుంపరలు.

భావగతులను బలికింపజాలిన శబ్దసంపత్తియు, వృత్తిని యథేష్టముగ నులకింపజాలిన స్వాధీనతయు దెలుపుటకై పై పద్యములు దిఙ్మాత్రసూచిక నుద్ధరించితిని; చాలవా?

వరుసమీఁది మెలకువ:

"రమణి వ్రాలుకుఁ గుల్కెనో ప్రణయమధుర
హృదయులకుఁ జిక్కె? ఆ పరమేశ్వరాంతి
కమును బడయుదో భక్తుల కరముపట్టి?
ఇహపరమ్ములయందు నీ కేది గలదొ!"
—రేరాణి.

"తొలిమిఁ బట్టుఁదప్పి, పర
దాలయి కప్పిన నీలిమబ్బు బం
దాలను ద్రోచివచ్చి, యొడ
లం బెనవైచిన రాగదీప్తులం
గ్రోలిన నీ కటాక్షముల
...ఁ బఱుపుల్ సరిపింతు వీ యనం
తాలయవీథి; వ్యర్థమిది
యాతఁడు లేని యమాసచీకటిన్."
—చుక్క.

క్రమము (Order) పై గన్నుగలిగి చివరంట నిర్వహించుటలో ఈకవి కొఱవడడని, పొఱవడడని చూపుటకు నాకు ... పద్యములు చాలును.

జానునుడిమీఁది మోజు:

"తెలియవుగాని, నీవు పలు
కెన్నుల నాతనిఁ గాచియున్నఁ గ
ల్వలపయి మోజు మిక్కుటము
వానికి; చక్కనివాఁడె, మైనమున్
నెలనెలగండ, మట్టి మగ
నిం బడి మాటికి దేవురించినన్
గలదె ఫలమ్ము? నీమనసు
గల్గినవాని వరింపు మన్ననిన్."
—చుక్క.

"కల మనసిచ్చినట్టి జతగాఁడని
యెంచి, శశాంకమూర్తి రా
కలకయి చిన్నికల్వపువు కన్నులు
కాయలుగాయఁ జూచి యా
ర్వుల నిసిఁ ద్రోసిపుచ్చె; నెనరుం
గలవాఁడె హితుండుకాని, లో
కులతరహా తెలుంగనిది గోల;
అమాస స్మరింపదయ్యొఁగా!"
—తుంపరలు.

"చుక్కలచందమామ, సొగసుల్
దిగవోసెడి నవ్వుక్రొవ్విరుల్
రెక్కలు విచ్చి చల్వ లలరింప
వసుంధరఁ జూడలేని య
మ్మక్కలు ఆ శిఖాసిరాని రక్కటు!
వారల దృష్టిదోషముల్
దక్కనఁ జిక్కుదే నెలనెలన్?
జగతిన్ నహిరాకృతజ్ఞతల్!"
—చందమామ

ఇట్టి వెన్నో ని ఈ 'విపంచి' యందు మొలచియున్నవి. వాడిన నానుడులెల్ల పిలువనిపేరటము వచ్చినట్లున్నవికాని, తెచ్చికోల్లుఁ, బుచ్చికోల్లుం గావని ఆ పొందికబడి తోఁచుచున్నవి.

ప్రకృతిలాలసత్వము:

"కలువపువ్వులకు జక్కిలిగింత బొసగించి
కొసరి మాటికి నవ్వుకొనుచు మురిసి,
వలగొన్న మబ్బుపిల్లలఁగూడి వేడుక
తోడ దాఁగురుమూఁత లాడి యలసి
తళుకుఁజుక్కల కన్నుగిలుపులఁ గడగంట
విడిసిన చిఱునవ్వుపొడల కవిరి,

పరువెత్తు మున్నీటితరఁగగుత్తాల స
    వారీయొనర్చు బింబమునకుబ్బి,
చలువవెన్నెలరేకపిసాళివలపు
నవ్వుకెరటాల తియ్యందనమ్ములోన
ఈసమస్తజగమ్ము ముంచెత్తివిడిచి
చదలఁ గొలువుండె నెఱజోదు చందమామ,"

—చందమామ.

"పుష్పాళ్లఁదేనెలోఁ బొరలించి వాయుకి
    శోరమ్ములందిచ్చు సూడిదలును,
చిగురుమేఁతలగొంతు వగరెక్కఁ గలకంఠ
    మాలపించెడి ప్రాఁత మేలపాట,
తెలినీట నోలాడి తేలాడు తొగకన్నెఁ
    బిలువఁగాఁ జుక్కలతళుకుసైగ
వలపులగుప్పి పచ్చలమేడరేరాణి
    పోఁతబోయుచునున్న లేఁతనవ్వు.
జిలుఁగురంగుల చీరలఁ గులుకు లొలుక
నాకుచిలుకలు నెఱపు లాస్యమ్ముగలసి
అతనియందు నిబద్ధమూ నఖిలదృష్టి
దోఁచుకొనఁజూచు పోలికఁ దోఁచు నబల."

—పూలమాల.

"చెలువారఁగ సురలెల్ల రాగడప
    కుర్చీలందుఁ గొల్వుండ, బల్
మెలపుల్ మైజిగిసొంపుఁ జూపి సభ
    వారిన్ రక్తిగట్టింతు; మ
ద్దిలకాఁ డెవ్వఁ డపస్వరమ్ములను '
    బృథ్వీగోళ మూఁగించు? నే
ర్పులకుందగ్గ మఱొక్కసిన్ వెదకి
    కీర్తుల్ వ్రాయు దిగ్భిత్తులన్"

—మెఱపు.

ప్రకృతివిలాసినిని కళాహర్మ్యములం ద్రిప్పిన నెప్పరితనము పైపద్దెములు విప్పిచెప్పినవి గావా! ఇలువాడి ముచ్చట్లు :

"ఎక్కడివాఁడె! యింతబులిపింపులఁ
    బుచ్చెడి మాయకాఁడు; ప్రా
ద్దెక్కకమున్నె లేచి పనియేమొ
    మునింగినతీవిఁ బూవుట
మ్మక్కులఁ జేరి యిచ్చకము లాడుచుఁ
    గాలముఁ ద్రోసిపుచ్చు నీ
టక్కరిమాయదారుల తుటారిని
    నీ వెటుగట్టికొంటివే!"

"అవ్వ! వచింపసిగ్గు; అదియా
    మరియాద? ఫలాని కంతకున్
రవ్వనుదెచ్చు పోకిళులె? రాతిరియుం
    బవలంచు లేదె! యి
ట్లివ్విధి రామరామ!! చరియించుట
    యించునె నీకుగూడ? ఆ
పువ్వులు రాలిపోను! తలఁపుం
    గొనఁడేమి రవంతనీయెడన్!"

"తూరుపు తెల్లవాఱినది దొట్టి,
    చెలీ, మునిమాపుదన్క సం
చారము, లింటియాబిడ విచారము
    దూరము; వాడవాడ సిం
గారపుటుత్సవమ్ములు! బికారి
    మగం డికచాలు! ఏల క
న్నీరొలికింతు వింతయు గణింపని
    యా వెడచెల్మి నేఁతకున్?"

"ఓపిక యేది కాల్ నిలిపియుంచి
    సుఖింపఁగ నింటిపట్టునం?
దీ పరువంపు నీవయసు కేది
    సమానము? రేపువిచ్చి యీ
మాపున వాడిపోవుచు దుమారము
    దోఁగెడి రాలుపూవు తే
తీపులుగూర్చు వానికి; సతీ,
    అతఁ డీవలపే యెఱుంగడే!"

—తేఁటి బోటి.

అచ్చము ఇలువాడి ముచ్చట్లు! యతిప్రాసముల బందుకట్లను పరికింపక; ఒప్పరికింపక అలవోకగ తన తలఁపును అమ్మలక్కల ఇలువాడి ముచ్చట్లలో తలపో

తలు, వలపోతలు - ఊర్పులు, తార్పులు - పచరించుట ఈకవి చిరంజీవికి రాసక్రీడ. ఇట్లు పద్దెములలో సుద్దుల విరజిమ్మనేర్పు తొల్లి తిక్కనకును, పిమ్మట పింగళి సూరకవి కొక్కనికిని సొమ్మయినది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ('ప్రబుద్ధాంధ్ర' వైతాళికుని) రచనలలో నొకప్పు డెప్పుడో చూచాయగ జూపడిన నేర్పు పదంపడి బాపిరాజుకలముదిద్దుబాట్లంబడి పరిపాకము చెందినది.

క్రొత్తందనపు టెత్తికోలు:

"మారుకులేని జవ్వనపుఁగోరిక లే
యవతారమెత్తి శ్రీం
గారముగన్న వో యన ముఖమ్మున
మూగెసలాడు ముంగురుల్
దేరగ మాటిమాటికి నదేపనిగా
స్పృశియించి మన్మనో
హారిణి కింపునింపు మలయానిల,
నీది యదృష్టమన్న చో!"

—తుంపరలు.

"కలదొకవార్తనిన్న డుగఁగాఁగమకింతు,
నెఱింగియున్న చోఁ
బలుకుమునిల్చి, మావలపుపంటకుఁ
దెచ్చినబిడ్డలిద్దఱా
త్మలనువగల్ రగుల్కొలిపిమబ్బుల
మాటయినారు"

— మెఱపు.

పై అధోరేఖాంకితవాక్యముల కూర్పున, భావమునను, రచనయందును క్రొత్తందనపుటెత్తికోలు సేనున్నా ననుచున్నది.

వాక్యశిల్పము:

"పడఁతుక, నీకు భాగ్యములుపండిన,
వాతఁడు చక్రవర్తులం
గడనకుఁదేకు నిన్వలచి గాటపు
కూరిమి నింతదనక్క న
క్కడనిలుచుండి నీసొగసుఁ, గన్నులఁ
దూఁచెడిఁ, జాలుఁజాలు! నీ
ముడివిడినట్టి క్రొవ్వలపుఁ బోఁడిమికిన్
సఫలత్వ మబ్బెఁబో!"

—సాఫల్యము.

"కాటుకఁబుక్కిలించి మసకల్
ముసుగుల్ గొనియున్న యీనభో
వాటికఁ బ్రాణముల్ కనులఁబట్టె
నిరీక్షణలోన, ఆతఁ డే
పాటునదగ్గఱించి చలువల్
విదిలించెడి మొల్కనవ్వు ప
న్నీటఁ గరంచునంచు గమనించెద
నెంతటి ముద్దరాలవే!

—చుక్క.

శిల్పకౌశలముం బ్రకటించు పై యట్టివాక్యములు ఈకబ్బమునన కాదు, ఈతని రచించినవానిలోఁ దఱచు మెఱయుచుండును.

రసప్రసాదనము:

"ఎక్కడి దీ విరాగము? నరేంద్ర
కుమారక, ప్రాణమెందుగా
మక్కువఁ బెంచుకొన్న జనమాన్యులు
నీ తలిదండ్రులు; లీనె నా
దిక్కని చెట్టఁబట్టిన సతీమణి;
మొన్నటివాఁడు బిడ్డ; మూఁ
పెక్కఁగనున్న రాజ్యభర మేమి
యొనర్పఁ దలంపుపుట్టెరా?"

"ఈ సన్యాసము చాలు! చెల్లినది
నీకే; కోడెప్రాయమ్మునం
దా; సౌఖ్యమ్ములు కట్టిపెట్టఁగల
పంతమ్ముల్? సెబాసయ్య రా
జా! సాధించెదవే మహార్థములు
కాషాయమ్ముతోఁ? బోని వి
శ్వాసమ్మంచి వచించి పోవఁదగు
నీ వామాంగితో సర్వమున్."

— జినదేవుఁడు.

గాటూక్తులు :

"ఒడలువంచి పనిసవరించెడి వలంతి
కాఁపు పడుచవీవు; పనిలేక సమయమ్ము
వితయొనర్చు సోమరి, కవివీఁడు; వీని
సొద లవేటికి ? నీపనిఁ జూచుకొనుము !"

—కాఁపు పడుచు.

"ఎవ్వ రేమాడుకొన్న నీకేమికొదవ ?
కువలయ మలర్చు చలువలఁ గొఱఁతపొరయ
దేమిగాకున్న సతుల నెమ్మోములకును
సాటిచెప్పెడి కవుల నేస్తములు గలవు !"

—చందమామ.

ఆవేశము :

తెనుఁగుం దేశము పుట్టినిల్లు, గురులుం
దిద్దించినా రోనమాల్
దెనుఁగుంబాసను; ఈశరీర మిది
తల్లీ, పుష్టిఁజేకొన్న దీ
తెనుఁగుంబంటలఁ: జుట్టుప్రక్కములు
నీ తెన్గుల్ ; సమస్తంబు నీ
తెనుఁగేయంచు నెఱింగితిన్ గత
పరాధీనప్రసన్నాత్మలో.

—సాక్షాత్కృతి.

ఇంకను 'కవిరాజు', 'మూగనోము', 'ఇంద్ర ధనుస్సు' లోనుగా విషయములున్నవి. వానియందును సరసములగు పద్యములు కలవు. కళావిషయక ప్రసంగము సాగదీసి విసువెత్తించుటకన్న సంగ్రహించి కుతూహలము బెంచుట లెస్సయని ఇంతట నీప్రకరణము గట్టిపెట్టితిని.

సమన్వయము:

ఈరచయిత లిరువురు వట్టి కవిత్వపుపిచ్చివారు. ప్రాయముతోఁగూడ పెద్దాతని పిచ్చి యుడుగుచున్నది. వయసువెంట పిన్నాతనిపిచ్చి పిచ్చలించుచున్నది. నా పిచ్చికొలది ఇట్టిపిచ్చివాండ్రచేతలకు మురిసి ముచ్చటపడుచుందును.

కృష్ణరాయ, బాపిరాజకవుల కృతులంగూర్చి నా తెలివుకొలది నాయోపినంత అటునటుతడవితిని. ఉభయుల కవితాశిల్పముం బోల్చి తరమములు నిర్ణయింపఁగాదుగాని, ఉభయములోని వైలక్షణ్యముం దెలియుటకేని ఈసమన్వయము ఉపకరింపవచ్చును.

ఈయిరువుర రచనలయందలి నడకలోను, నాణెమునందును క్రొత్తపోడుములకు క్రొంగ్రొత్తజాడలేర్పడినవి. రెంటను తలపుతో పలుకు వలపులాడిన పట్టులును, పలుకుతోఁతలపు కులుకులాడినపట్టులును జూపట్టును. రెంటను పలుకునుడికారము పంటకు వచ్చినది. రెంటను వాచ్యమున వ్యంగ్యము, వ్యంగ్యమున వాచ్యము పడుగుపేకలుగనేసిననేత లున్నవి. ప్రకృతిసాలోక్యమునకు పయనముగట్టినవి రెండును. రెంటను పచేతనమను నెత్తుగడలున్నవి; చక్కని ముగింపులున్నవి. గతియందును, శ్రుతియందును, పదసమీకరణమునను, పాకమునను రెండును వేరుకాపురములుపెట్టినవి. విశిష్టలక్షణాదిక వైలక్షణ్యములయందు రెంటను అల్లెగిరల వెంట హద్దులేర్పఱచుకొన్నవి.

రాజహంసిగతికి లయనేర్పినది రాయనిపలుకుబడి. పారావతము పల్లటీల నుల్లసమాడినది రాజు నుడికారము. రాయఁడు స్రష్ట; రాజు శిల్పి. కళాయోగమున రాజు రాయని వెన్నాడి మున్నాడినాడు. రాయనిది పోగరపని; రాజుది నగిషీపని. రాయనిరచన గుండెకు చక్కిలింత; రాజురచన తలపునకు పుక్కిలింత. ఆతని శైలియందు బాల్యతారుణ్యాది వయఃపరిపాకముల ననుసరించిన గమనపరిణతు లున్నవి. ఈతని శైలియందు నెఱజవ్వనపు నీటుగోటులున్నవి. ఆతనిరచనయందు అనుకంపాయత్తమైన ఐక్యానుభూతి కృతపడినది. ఈతని రచనయందు విలాసలాలసత శ్రుతిగలిపినది. ఆయనకవిత్వము పడమటివసారానుండి పడకటింటివఱకు నడచుగుంపెడుపిల్లల ఇల్లాలిం దలపించినది. ఈయన కవిత్వము పడకటింటినుండి బగీచాకుపఱచువగలమాఱివలపుటిల్లాలిం దలపించినది. ఇరువురును పూర్వకవిసంప్రదాయముల యెడ పూజ్యభావము గలవారు. ఇరువురును క్రొత్తమోజునకు కొంగుపట్టినవారే.

కృష్ణరాయని కవితాలతాంగి సహజలావణ్యముతో సంసారము సాగించెడిది. బాపిరాజు కవితా

విలాసిని నవనవాలంకారములతో నైసర్గికరామణీయకతం జెంచి భోగించెడిది. కావ్యయోగి యతడు; కళాభోగి యితడు. ఆతడు భాషాసక్తుడు; ఈతడు భాషానురక్తుడు. ఇరువుర రచనలును కవితారసము జుట్టి చూఱలిచ్చుచున్నవి.

ప్రయోజనప్రాధాన్యముం బాటించి కావ్యశిల్పమునకు గడంగిన రాయనిరచన ప్రథమగణ్యము; కళాప్రాధాన్యముం బాటించి కవితావినోదముం బచరించు రాజురచన ద్వితీయగణ్యము.

వలపుబరిణను దాచిన చెలిమిముడుపు
విచ్చి, తొలిమలికానిక లిచ్చినాడ:
నాయనుగు నెచ్చెలికి కృష్ణరాయకవికి
ప్రణయపాత్రమ్మనకు బాపిరాజకవికి.

---



"సలాం" K. M. R.

# ఎసగు–ఒసగు

టి. రామచంద్రాచార్యులు

'ఎసగు' 'ఒసగులు' అరసున్నలతోనే నేటి పండితుల మెలుకలలో నున్నవి. నడిమి కాలపు లాక్షణికులును వానిని సబిందుకము లనియే తలఁచిరి. శబ్దరత్నాకర కారులుగూడ నట్లే తమ నిఘంటువునందు గ్రహించిరి. శ్రీ ప్రభాకర శాస్త్రిగారును తమ బసవపురాణ పీఠికయందు ౧౯౨౬ సంవత్సరమున

'జగతి పద్మపురాణసంహితలం దె
సఁగె శంభురాఘవ సంవాదముననుఁ.'

అను ద్విపదను సోమనాథుని సార్ధబిందు నిర్బిందు ప్రాసమున కుదాహరణముగాఁ జూపిరి. నేఁడు వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిలుగారును తమ 'వీరసింహుఁడ'ను నవ్య కావ్యమునం దట్టి ప్రాసయతులఁ బ్రయోగించి 'ఖండాఖండప్రాసము మహాకవిసమ్మతము. ఉదా: భారత. ఆశ్రమవాస, ౨ ఆ. ౧౨౧ ప.

క. తగునాకురువృద్ధునకు నొ
సఁగెనాటికి దివ్యదృష్టి."

అని ప్రమాణముఁ జూపిరి. *

సార్ధబిందు నిర్బిందుప్రాసము మహాకవి సమ్మతమగుట సరియా యని నేను శ్రీ ప్రభాకర శాస్త్రిగారి నడిగితిని.

"బసవపురాణపీఠికయందు పై ప్రాసము సోమనాథుఁడు ప్రయోగించె ననుటకు సాధనములలో నొకదానినిగాఁ బూర్వోదాహృత ద్విపదను నేను జూపితిని. అప్పటికి నాకది సందేహమును గొల్పుచు నేయుండెను. తర్వాత భారతమునుఁ బరిశీలించుటలో నీ క్రింది ప్రయోగములు దొరకినవి.

క. బిగు వెడలక నిలిచిపర్వ
నగమయి వేతసచయంబు నమ్రంబై పె
ల్లగు మావేగము గడపియొ
సఁగుపూర్వస్థితిన బ్రదుకు సమకూరంగన్.
భా. శాంతి. 3 ఆ. ౮౯.

క. తగునా కురువృద్ధునకు నొ
సఁగె నాటికి దివ్యదృష్టి సాత్యవతేయుం
డగణిత తపః ప్రభావం [మున్.
బు గని యధికవిస్మయంబు బొందగ జన
ఆశ్రమ. ౨ ఆ. ౧౨౧ ప.

తిక్కనగూడ నిట్లు 'ఎసగును' దానివంటిదే యగు 'ఒసగును' సార్ధబిందుక నిర్బిందుక ప్రాసమునఁ బ్రయోగించుట నాకు మరింత వింతను గొల్పినది. ప్రాచీన తాళపత్ర ప్రతులలోఁ బెక్కింట నీపదములు సబిందుకములుగనే యుండుట గమనించితిని. కాని నేను శాసనపద్యములు సేకరించుచు శాసనబింబ

* వీరసింహుఁడు, 3౮ వ పుట.

ములఁ జూచునపు డీ శబ్దము లరసున్న లేనివి గనే పెక్కుచోట్ల నగపడెను. అట్లు నిర్బంధకముగా పైశబ్దములఁ జూపు శాసనములఁ గొన్నింటి నొసగుదును చూడుము" అని వారు వ్రాసియుంచుకొన్న పద్యశాసనములఁ గొన్నింటిఁ జూపిరి. వానినే క్రింద పొందు పఱచుచున్నాను.

* ౧. పెరవలి శాసనము

(South Indian Inscriptions No. 664 of 1920)

సీ. వననిధివేష్టితావనిలోనంగల యగ్ర
హారంబులకు మణిహార లీల
మానైన పెరువలి మాధవ దేవర
కెత్తించె గుడిభక్తి యెసగం గొమ్మ
మాంబిక తత్సూనుండగు చోడ దండేశుం
డద్దేవునకు నివేద్యమునకర్తి

* ౨. ద్రాక్షారామభీమేశ్వరాలయశాసనము

(S. I. I. Vol. IV, No. 1061)

శకము ౧౦౭౧,

ఉ. అంబుజగర్భ వంశమణి
యై దయం బట్టపుమెట్ట యగ్రహా
రంబుగనిచ్చి యంద్దయుడు
రాజశిఖామణికిన్మరున్నివా
సంబెసగంగ నిల్పి పిల
సన్మతి నొప్పిన దండనాథర
త్నంబగు నాగదేవ విబు
ధస్తుతుతముణ్డు ప్రోలణ్డున్నతిని.

3. నాదిండ్ల శాసనము

(No. 330 of 1919. శకము ౧౦౭౮)

చ. అనుపమ కీర్తి మూలఘటి
కాంబరుహాంబుజ మిత్రుణ్డుంబుజా
సనకులుండన్వయార్ణవ వి
శాల సుధాఘృణి యట్టివానికిని
మనుమం డమాత్యవేముని కు
మా[రరికివాజ్ని]భసూరమాంబ్బకుం
బెనుపెసగను జనించె రిపు
బేక ఫణీంద్రుండహార్యధీరుండు.

౪. ఏలూరుశాసనము (శకం ౧౧౦3)

క. సరసిపురి మంత్రి మాదను
వరభూమిని నాచమాంబ వనజాక్షునకున్
ధరంబెట్టె సంధ్యదీపము
హరయనక భేందు శశిశకాబ్దము లెసగ.

౫. కొమ్మూరిశాసనము (శకము ౧౧౬౬)

(No. 826 of 1922)

సీ. శ్రీ(ర?)యుతమైన కొమ్మూరి యగస్తేశ
విభునకు జీవంబు విస్తరిల్ల
నెసగు దీపావలి వసుధలోం బంచన
గస్తీశ్వరస్వామి కర్థితోడ

౬. తాళ్ల ప్రొద్దుటూరి శాసనము

సీ. ఏనుకతలలలో నెసగిన ముత్తియం
బులుం గుంకుమాక్షతంబులుగం బోసి

౭. ఉప్పరపల్లె శాసనము (శకము ౧౧౫౭)

క. చరణ సరోరుహారాగ [సంధ్యా
స్ఫురణ మహిషునిశిరంబు వాలుపుగ

* ౧, ౨, ౭, ౮, ౯ శాసనపద్యములు శాసనపద్యమంజరిలోఁగూడ గలవు.



శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

(24-11-1935 నాడు విశాఖపట్టణమున వీరి షష్టిపూర్తి మహోత్సవము జరిగినది.)



శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారి శిలావిగ్రహము
(24-11-1935 నాడు రాజమహేంద్రవరమున ప్రతిష్ఠింపబడినది.)

ప్రభరుచి నెనయ మెట్టిన స
త్కారుణాన్విత దుర్గిఁ వరము గాట
[య కొసగుఁ. *

౮. గణపేశ్వర గ్రామ శాసనము (శకం౧౧౩౫)
(S. I. I. Vol. IV No. 952)

సీ. "స్వస్తిసమస్త రాజన్యచూడామణి
కిరణరంజిత పాదసరసి జాతుం
డగు కాకతియ్య ధరాధీశు శ్రీవాకి
లికి సంగరదక్షుఁడై ప్రకట శౌర్యుఁ
ధనుండనంబరగి యమ్మనుజేంద్రుం
[డొసగిన"

౯. పైశాసనముననే మరొకచోట
"యింటినొసగి పెయ్యలేంభది వెరసినూ"

క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దపు ప్రారంభమునుండి పదమూఁడవ శతాబ్దము తుదిదాఁకఁ గలపైశాసనములయందుపయిశబ్దములు నిర్బిందుకములుగనే కలవు. కాని, శ్రీనాథుఁడు తన హరవిలాసమున,

ఉ. ఇంటికిదెచ్చి యోగి పర
మేశునకుఁ వణిజుండు తాను వా
ల్గంటియు భక్తియుఁ భయము
గౌరవము న్వినయంబు నాత్మలో
నంటుకొనంగ నప్డు మున
లమ్మకు సైతము కమ్మనూనె మై
నంటి నలుంగుతో జలక
మార్చియొసంగిరి ధౌతవస్త్రముల్.

అని 'ఒసగు' నుసబిందుకముగానే ప్రయోగించినాఁడు. ఈ పాఠము వ్రాయసకాండ్రప్రమాదమున వచ్చినదేమో యని కొట్టివేయుదమన్న శ్రీనాథుఁడు స్వయముగ చెక్కించినదని తలఁపబడుచున్న పద్యశాసనమందుఁ గూడ నిట్లే యున్నది.

"ఈగ్రామములు మూఁటికెల్ల కాలంబు భో
గైశ్వర్య సర్వ మాన్యతలనొసంగ"*

పయిప్రయోగములనన్నింటిని బరిశీలింపఁగా నీశబ్దములలో శ్రీనాథుని కాలమువఱకు కరసున్న లేమియు, శ్రీనాథాదులకాలమునఁ గలిమియు తోఁచుచున్నది.

కాని యాఱవ శతాబ్దమువాఁడగు పింగళిసూరనగూడ 'ఎసగు'నందు బిందువు ప్రాచీనప్రయోగములందు లేకుండుట గమనించియే రాఘవపాండవీయమున శ్లేషయందు

మ. స్వనిదేశోన్నతి నంతటన్ నెఱయుచున్
శక్తిం జతుర్దిఙ్నరేం
ద్రనికాయంబును గెల్చి తమ్ముల సమా
న ప్రాప్త విత్తార్పణం
బునదర్పన్ వశులైన బ్రాహ్మణులతో
పూర్ణాధ్వరారంభుఁడై
యనఘుశ్రీపృథివీశుఁ డొప్పె సగరూ
డా పూర్వసత్కీర్తితోన్.

అని నిరనుస్వారముగనే ప్రయోగించెను. తరువాతి వ్యాఖ్యాతలు 'ఎసగు' నందు బింద

* ఇచట శ్రీజయంతి రామయ్యపంతులుగారు (శాసనపద్యమంజరి యందు) శాసన ప్రతిబింబములో లేకున్నను దాము పండలీకరణమున సున్న (చేర్చినారు.

* శాసనపద్యమంజరి ౯౦ వ పుట.

వున్నదను భ్రాంతితో " రామాయణార్థమున "ఒప్పెసగున్" అనుచో సకారోత్తరార్ధాను స్వార విశిష్ట రూపంబును, భారతార్థమున 'ఒప్పెన్ + సగురూఢాపూర్వసత్కీర్తితోన్' అనుచో నర్ధానుస్వార రహిత రూపంబును గూర్చునెడ సమాధానంబు గల్పనీయం "బని వ్యాఖ్యయొనర్చుచు "శ్లేషే సఖండనిర్బిందోర్వ ర్శ్మేళనం కుత్రచి న్మత"మ్మని లక్షణ వాక్య మును ముడిపెట్టిరి. ఇట్లే " ఒప్పెసగు రుచిర యశోమహోదయతను" యను చోటను.

ఎసగు ఒసగులతో ననుస్వారము నర్వా చీను లుంచుటకు వీనితో సారూప్యము గల పొసఁగు ఆదినుండియు సానుస్వార మగుట కారణము కావచ్చును.

" సంధికి నేగి కార్యము పొసంగగ కృష్ణుని రాకయున్."

భారత. ఉద్యో. ౨ ఆ.

ఎసగు ఒసగులకుం బోలె చీఁటి, తీగ, డాగు, దాచు, వీపు మొదలగువానియం దరసున్న యిటీవల వచ్చినది. వీనియం దన్నిట నరసున్న గలదని యప్పఁవి తప్ప నుదాహరించినాఁడు.

మరియు నిట్లే 'ఏగు' మొదలగువాని యం దున్న సున్న యిటీవల లోపించినది. ప్రాచీన ప్రయోగముల 'నేఁగు'నం దరసున్న యుండుట గమనించియే సూరన రాఘవ పాండవీయమున,

క. వినియతనిం దనపై నిడు
కొని యేఁగి నియమికిందగని ఘోరార్తి
చ్చినవాఁడ మీకు దండ్యుఁడ [యొన
నని తనుఁ దెలుపుచును వారి కప్పన జేసెన్.

అని ప్రయోగించెను. 'ఏఁగు'నం దరసున్న లేదన్న తలఁపున వ్యాఖ్యాతలు రామాయ ణార్థమున 'ఏగి + నియమికిన్ అనియు, భారతార్థమున ఏన్ + కినియమికిన్ అని భేదము సరిపడుటకై 'శ్లేషేసఖండే'త్యాది లక్షణము నకుఁ దావొసగిరి.

కవిలోకచింతామణిలో తాతంభట్టు

క. 'వాఁగుదరి కేఁగి యుయ్యెల
లూఁగెడు గోపికలగుబ్బలొగిబిగియరతిన్
దోఁగుచు దొంగతనంబున
నేఁగితి వన నర్ధబిందు లిల నివి కృష్ణా.'

అనెను.

కాన పయిశాసన ప్రమాణములవలన 'ఎసగు ఒసగు' లందు సున్న లేకుండుటయు, సార్ధబిందు నిర్బిందుప్రాసము భారతకవిసమ్మ తము గాకుండుటయు రాద్ధాంతిత మగు చున్నది గదా!

---

# ఉత్తరాభిమన్యుల వివాహవర్ణన

అవసరాల వెంకటనర్సు

మానవజీవితమందు కల్యాణ మొక చక్కని ఘట్టము. పెండ్లినాడు సంతోషమున మునుం గనివా రెవ్వరును నుండబోరు. పూటకుగతిలేని కూలి వాడుమొదలు సామ్రాజ్యమేలు చక్రవర్తివరకు నెల్ల వారును వివాహవేళ అపూర్వమగు హర్షామృతమును చవిచూతురు. సామాన్యుల వివాహములే అత్యామోద కరములైయుండ, రాజవంశోద్భవులును, అనురాగ బద్ధులును,అతిలోకసుందరులును నైన దంపతుల కల్యాణ సమయమున జనించు సమ్మోదమునకు మేరయేయుండదు. మహావీరుడు దిగ్విజయయాత్రకు బైలుదేరునట్లు, తన మనస్సునకు వచ్చిన కన్యారత్నమును తోడుతీసుకొని ప్రణయసామ్రాజ్య చక్రవర్తిపదవి తప్పక పొందితీరుదు నన్న దృఢనిశ్చయముతో పురుషు డీసన్నివేశమున బైలుదేరును. ఇట్టి మనోహరమగు ఘట్టమును కవు లెట్లు వర్ణించిరో, సతీపతుల సమ్మోదానుభవమున నొకపా లైనను పాఠకుల కెట్లొనగూర్చిరో పరిశీలింతము. పోత నామాత్యుని భాగవతములోని రుక్మిణీకల్యాణవర్ణనయు, నన్నయభట్టు ఆదిపర్వములోని ద్రౌపదీవివాహవర్ణ నయు గైకొని వీనిని తిక్కనవిరాటపర్వమందలి ఉత్తరాభిమన్యుల వివాహవర్ణనతో పోల్చిచూచి, యీముగ్వురు కవుల కళాకౌశలమును పరిశీలించి యానందింతము. కైలాసశిఖరముకంటె ఎవరెస్టు శిఖర మధికోన్నత మనినమాత్రమున కైలాసప్రాశస్త్య మెట్లు కించవడదో, అట్లే ఒకకవీశ్వరుని రచన వేరొక కవిపుంగవుని రచనకంటె విశేష రసవంతముగ నున్న దని మేము వ్రాసినందున పైముగ్వురు కవులలో నెవరి పట్లను మాకు గౌరవ లోప మున్నదని చదువరులు భావింప తగదు.

పైనుదాహరించినవి స్వతంత్రగ్రంథములు కావే, సంస్కృతపురాణముల యాంధ్రీకరణములు మాత్రమే యైయున్నవే, వీనిలోని సన్నివేశముల నెట్లు పోల్చవ చ్చునని కొందరు సందేహపడవచ్చును. ఆంధ్రభాషలో మనకు లభించు పుస్తకములందలి భాగములనే మనము తీసికొందము; వీనిలోని గుణదోషములు మాతృకలోని వైన కావచ్చును, తెనుగుకవుల వైన కావచ్చును; అవి యెవ్వరివో నిర్ధారణచేయుట మన కప్రస్తుతము. తెనుగు పొత్తములందు లభించు విషయముల గ్రహించి కావ్య రసాస్వాదన మొనర్ప యత్నించుటకు నెట్టి యాక్షేప ణయు నుండరాదు.

వివాహవర్ణనకు రామణీయకత నొనగూర్చు ప్రధాన లక్షణములు మూడు: బాహ్యాలంకారవర్ణన, సతీపతుల రూపవర్ణన,వారిప్రణయవర్ణన. పుష్పమందు వర్ణసౌరభ్యమకరందములు సముహారి మోదమాపాదించు నట్లు, పైమూడులక్షణములును మేళవించిననే కాని కల్యాణచిత్తరువు ప్రేక్షకమనంబుల చూరగొనసేరదు. బాహ్యాలంకారవర్ణన యీ చిత్తరువునకు బ్యాకు గ్రౌండు (Back ground) వంటిది. బంగారుదిమ్మ వజ్రకాంతి నినుమడింపజేయునట్లు, ఈ అలంకార వర్ణనవల్ల తక్కుంగల విషయవర్ణన కధిక సౌంద ర్యము చేకూరును. పెండ్లికొడుకు లేక పెండ్లి యా యన్నట్లు కవి అతని రూపగుణంబుల పొగడియే తీర వలెను; పెండ్లికుమార్తెవిషయము మొదటనే అశ్రద్ధ చేయుటకు వీలులేదు! రూపగుణముల శ్లాఘించిన పిమ్మ ట కవి వీరి ప్రణయాభివర్ణన తప్పక చేసితీరవలెను. పుష్పములందు మకరంద మగ్రగణ్యమైనట్లు వివాహ వర్ణనయందు ప్రణయవర్ణన రసనిష్పత్తికి ప్రధాన హేతువు.

రుక్మిణీకల్యాణసందర్భమున పోతనామాత్యుడు మధురాపురాలంకారములను వర్ణించెను:

“అంత నయ్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహకృత్యంబును, ప్రవర్తమాన గీతవాద్య నృత్యంబును, ప్రతిగృహాలంకృత విలసితాశేష నరనారీ

వర్గంబును, బరిణయ మహోత్సవ సమాహూయమాన మహీపాల గజఘటా గండ మండలదాన సలిల ధారాసిక్తంబును, బ్రతిద్వార మంగళాచార సంఘటిత క్రముక కదళికా కర్పూర కుంకుమాగరు ధూపదీప పరిపూర్ణ కుంభంబును విచిత్రకుసుమాంబర రత్నతోరణ విరాజితంబును, సముద్ధూత కేతన విభ్రాజితంబును నై యుండె."

పై వర్ణన హృద్యమై ఆసన్నశుభోదయమునకు మార్గదర్శియై యొప్పుచున్నది.

నన్నయభట్టువర్ణనయు రమణీయమై యలరారుచున్నది. పరికింపుడు:

ద్రుపదేశ్వరు మందిరము "నిరంతర క్రముకకదళీస్తంభ కుంభత్సంభృత నవామ్రాశ్వత్థ పల్లవమాలాలంకృత ద్వారతోరణంబులను, చందనోదక సంసిక్త ప్రాంగణ రంగవల్లీకృత కర్పూర మౌక్తిక ప్రకరంబులను, కౌతుకోత్సవ మంగళ శృంగార వరాంగనా ప్రవర్త్యమాన స్వనియోగ కృత్యంబులను, నుత్సవదర్శనాగతానేక రాజన్యసుహృద్బాంధవ బ్రాహ్మణ సంకులంబునం జేసి" యొప్పుచుండెను. ఆ మందిర పూర్వోత్తర దిగ్భాగంబున "విచిత్రనేత్ర వితత వితానముక్త మౌక్తిక కుసుమ మాలాలంబనాభిరామంబును, సమీచీన చీనాంశుక విరచిత స్తంభవేష్టనంబును, బక్ష్యాగ్రపల్లవ శాల్యక్షతాంచిత కాంచన పూర్ణ కలశోపశోభితంబును ...... ...... సమిద్ధాగ్నికుండమండితంబును, సర్వాలంకారసుందరంబును నై" వివాహవేది యమర్పబడెను. ద్రుపదుని యాజ్ఞచే పుర మష్టశోభనము కావింపబడెను.

తిక్కన సోమయాజియు నుత్తరవివాహావసరమున మత్స్యనగరమును, రాజమందిరమును, కల్యాణవేదికయు వర్ణించెను. పోతన నన్నయలు తామొనర్చిన అలంకారవర్ణన గద్యాత్మక మొనర్చియుండ, లలితభావ ప్రదర్శనకు గద్యముకంటె పద్యమే విశేష సహకారి యని భావించి తిక్కన తనవర్ణన పద్యాత్మక మొనర్చినాడు. అదియుంగాక, ఒక చక్కని యుపమానము ప్రయోగించి సౌందర్యరసమును విపులీకరించుచున్నాడు.

వివిధాలంకరణంబుల
నవకాంతి వహించి పట్టణంబు వివాహో
త్సవమాధవ లక్ష్మికి లలి
తవనంబై యెలమి కలిమితావలమయ్యెన్.

వివాహవర్ణనకు ప్రాశస్త్య మిచ్చు లక్షణములలో రెండవలక్షణము సతీపతుల సౌందర్యాభివర్ణన. రుక్మిణీకల్యాణసందర్భమున రుక్మిణీదేవి రూపలావణ్యము కవి యిట్లు వర్ణించినాడు:

అళినీలాలక బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరం
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళం గంధేభకుంభస్తనిం
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ [మహో
త్పలగంధిన్ మృగరాజమధ్య గని విభ్రాంతాత్ములై [రందరున్.

శ్రీకృష్ణుని యీ క్రిందివిధముగా వర్ణించియున్నాడు:

కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావల
గ్ను నవాంభోజదళాక్షు జారుతరవక్షున్ మేఘసంకాశదే
హు నగారాతిగజేంద్రహస్తనిభబాహుం, జక్రి, బీతాం
బరున్,
ఘనభూషాన్వితు గంబుకంఠు విజయోత్కంఠున్ జగ
న్మోహనున్,

స్త్రీపురుష సౌందర్యనిరూపణమునం దేయేలక్షణములు కవి మహోత్కృష్టములని భావించెనో ఆలక్షణములన్నియు నతడు రుక్మిణీ కృష్ణుల మూర్తులయందు ప్రత్యక్ష మొనరించినాడు. కాని పైవర్ణనను పఠించినందున ఏతన్మూర్తులయాకారములు చదువరులమనోవీథిని స్ఫురింప జాలవు. రుక్మిణీ కృష్ణుల స్వరూపములంపలి అసామాన్యప్రతిభ కాని, లోకాతీత సౌందర్యము కాని మనకు గోచరింపదు. అష్టమ స్కంధములోని మోహినీరూపవర్ణనకును, ప్రస్తుత రుక్మిణీ సౌందర్య వర్ణనకును విశేష తారతమ్యము కానరాదు.

"అజినోత్తరీయుల, నతిసంభృత బ్రహ్మతేజుల, సముదితాదిత్యసముల, నాజానులంబి మహాబాహుపరిఘుల, నత్యున్నతాంసుల, నతివిశాల వక్షుల, నవిరళ

వ్యాయామ దృఢకఠినాంగుల, వృషభాక్షు లయినవారి" అని నన్నయభట్టు పంచపాండవులను వర్ణించినాడు.

"సుత్రామపుత్త్రు డభిజన
పాత్రుండు, విచిత్రవీర్య పౌత్త్రుడు, శుభచా
రిత్రుం డీ విజయుడు"

అని అర్జునుని ప్రత్యేకముగా పొగిడియున్నాడు.

"ధవళవిభూషణ దామానులేపనా
మలినాంగి సితపుష్పమాల సేత
గొని పుష్పసాయకు కుసుమేతరంబైన
యాలుగు సాయకంబనగ జనులు
ధవళాక్షి రంగమధ్యంబున దనుమధ్య
దా నొప్పె పాంచాలతనయ యున్న"

అని ద్రౌపదీదేవిని ప్రవేశపెట్టినాడు. నన్నయార్యునివర్ణన నిరాడంబరమై మనోహరముగనే యున్నను వర్ణనా విషయముల కన్నులకు కట్టినట్లు చూపులాఘవ మిందు కానరాకున్నది. నూత్న యౌవనోదయమున పాంచాలిసౌందర్యమున కలిగిన పరిణామములు కాని, మత్స్యయంత్రము తెగనేసి నవోన్మేష యౌవనప్రాగుర్భావమున నలరారు విజయుని వివాహసంపదకాని, పాండవుల ప్రత్యేక రూప లక్షణాదులు కాని కవి వర్ణించి యుండ లేదు. ఈవర్ణనలో పూర్తిగా పుష్టి కాన్పించుటలేదు. వివాహవర్ణనమందు సతీపతుల రూపగుణ ప్రశంస కీయవలసిన ప్రాధాన్యమును కవి యిచ్చియుండలేదు.

విరాటపర్వ నాటకమునకు నాయిక ఉత్తరాదేవియని తిక్కన మొదటినుండియు గ్రహించినాడు. అందుచే నామె ఏసన్నివేశమున నెంత స్వల్పకార్యార్థమైవచ్చినను నామెకు భావిదృష్టితో తగిన ప్రాధాన్యమిచ్చుచు వచ్చినాడు. ద్వితీయాశ్వాసమున విరాటరాజు కుమార్తెను గురువునకు నప్పజెప్పు సందర్భమున నామెను పూర్తిగా ముగ్ధయైనట్లుకాని, ప్రౌఢయైనట్లుగాకాని కవి ప్రదర్శింపక, అప్పుడప్పుడే బాల్యమువిడుచుచు యౌవనమంకురించుచున్న సుందరీరూపము మన కన్నుల యెదుట చూపినాడు. ఉత్తరునికి సారథిగా నేసుమని యామె బృహన్నలను వేడుకొన బోవునప్పటి యామె యాకారమును వీక్షింపుడు:

"అడుగుల నునుగాంతి నన్యోన్యడ పద్మరా
గంబుల నెలకట్టుకరణి నొప్ప,
బాలిండ్లు దను వెడ్రవాలింప జెన్నొందు
నసదుగౌదీగ యల్లాడుచుండ,
దటివేచి వెనువెంట దగులు కామాంధకా
రములీల గ్రొవ్వెద గొమరుమిగుల
గర్ణభూషణమౌక్తికప్రభాడోలన
మీక్షణదీప్తుల నినుమడింప
నందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోదిరాయంచ రయమున బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించుచందమున దోన
చనగ నుత్తర నర్తనశాల కరిగె."

పైవర్ణనలో కవి ప్రత్యేకావయవవర్ణన మొనర్పకయే ఆమెయాకారమును మన కన్నులయెదుట చూపినాడు. మరియు నీమెమూర్తి నొకపరి గాంచినవెనుక నీమూర్తి నితర స్త్రీరూపములతో తారుమారు చేయుటకు చదువరులకు లేశమైన నవకాశముండదు. "మెఱుగు మొగిలుసొచ్చు తెఱగున నాట్యమందిరము సొచ్చె" యని అంధకారబంధురమైన నృత్యగృహ మామె ప్రవేశించుట వర్ణించినాడు. ఈ యుపమానముచే కవి ఆమె స్వరూపసంపదను, తేజోవిశేషమును ద్విగుణీకృత మొనర్చినాడు. స్థూలదృష్టికి కాన్పించు విషయముల కాధిక్యమొసంగక, కవి సూక్ష్మవిషయముల గ్రహించి, వాని నగ్రస్థానమున ప్రతిష్ఠించి తన చిత్రరచన పూర్తి చేసినాడు.

"హరి మేనల్లుడు, బాహు
వీర్యపటు శౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరు, డాచార పవిత్రు, డంచిత
కళాదక్షుం, డుదారుండు, గా
తరసంరక్షకు, డార్యసమ్మతుడు,
విద్యావైభవోల్లాసి య
త్యురుతేజుండు వరించు గాక యభి
మన్యుం డీ సరోజాననన్."

అని అభిమన్యుని గుణశ్రవణము చేసినాడు. అందులో అభిమన్యుని యుత్తమలక్షణములలో 'హరి మేనల్లుడు' అయిన విషయమునకు కవి యగ్రస్థాన మిచ్చినాడు. రెండవ లక్షణము అసమాన బాహు సంపద. మూడవది ఉత్తరాదేవి సౌందర్యముతో సరితూగజాలు జగన్మోహనాకారము. ఈ వర్ణనలు చూచి యిట్టి పురుషోత్తముని భర్తగా బడయుట కుత్తర ఏ నోములు నోచెనో, యిట్టి కన్యాలలామను పత్నిగా జేకొనుట కభిమన్యు డెట్టి మహత్తపము నాచరించెనో యని చదువరులు హర్షాశ్చర్యమగ్నులు కాకపోరు.

సతీపతుల ప్రణయాభివర్ణన వివాహ వర్ణనకు తృతీయాంగము. రుక్మిణీకల్యాణమునందు ప్రణయాభివర్ణనకు చక్కని యవకాశ మున్నది. రుక్మిణి అన్న తలంపునకు వ్యతిరేకముగా శ్రీకృష్ణునకు హృదయార్పణ మొనర్చి తన్ను బలిమినైన గొంపొమ్మని యాతనికడకు సందేశ మంపినది. రుక్మిణిపై వలపుచే కృష్ణుడు నిద్రసహితములేక తపించి, ఆమెనిమిత్తమై శత్రురాజులతో ఘోరరణ మొనర్చి, ఆమెను బలాత్కారముగా తన రథముపై నెక్కించుకొని కొనివచ్చినాడు. పరస్పర గాఢానురాగబద్ధులైన యీ దంపతుల సమావేశమున పోరాడుకొన్న ప్రేమభాషలు కాని, వారి హృదయములందు జనించిన భావములుకాని కవి మన కెఱుకపరచియుండలేదు. హరివివాహవేళ పౌరులెల్ల ముదితాత్ములై రని వచించి కవి వివాహవర్ణన ముగించుచున్నాడు.

ఈ విషయమందు నన్నయభట్టారకుని వర్ణనలో కూడ పెద్దలోపము కాన్పించుచునే యున్నది. మహావీరులును, తేజోమూర్తులును నగు పాండవులు పతులై యుండ, జగదేకసుందరియగు ద్రౌపది పత్నియైయుండ, వారి యనురాగ గాంభీర్యమునుగూర్చి కవి వర్ణింపబూనలేదు. ఈవిషయము కవి పూర్తిగా పాఠకుల ఊహలకు విడిచిపెట్టినాడు. పుష్పవృష్టితో ద్రౌపదీవివాహవర్ణనయు పరిసమాప్తి బొందుచున్నది.

ఈ సందర్భమున తిక్కన సోమయాజి క్రొత్త ఫక్కి త్రొక్కినట్లు కానవచ్చుచున్నది. ఈతడు వివాహవర్ణనకు సతీపతుల ప్రణయాభివర్ణనమే ప్రధానాంగముగా భావించి, దానికే అగ్రస్థాన మిచ్చుచున్నాడు. దంపతుల మనోభావములును, వారి హృదయసంచలనమును, వారి ముఖములందు, ఇతరావయవములందు కలుగు తొట్రుపాటు మొదలగు సూక్ష్మవిషయములు గ్రహించి వానిని ౮, ౯ పద్యములందు విపులీకరించి, వివాహచిత్తరువునకు అత్యంత రామణీయకత నొనగూర్చినాడు.

ఉత్తరాభిమన్యులను పెద్దలు తెరవద్ద నిలువబెట్టినారు. అన్యోన్యరూపగుణ శ్రవణమున నీవరకే ప్రణయార్ద్రములగు వారిడెందములు ప్రథమావలోకనమునకు త్వరపడుచుండెను. ఈ అవలోకనమున కవరోధకారియగు నీ తెరయే వారి యనురాగమును పెంపొందించుచున్నది. లోకులు వాంఛించు పదార్థములు వారి కందీయందక యున్నప్పుడే వారికోర్కె వృద్ధిపొందునట్లు, వీరికి తెరయడ్డువచ్చుటచే ఆ తెర తీయులోపుగా కల్గిన స్వల్పవిలంబనమునకే వారియందు మారవికారము లంకురించినవి. తెర యెత్తిన పిమ్మట

"వరుచూడ్కి ముద్దియవదనంబుపై బాటి
తివుటమై నునుగాంతి తీపుగ్రోలు
సుందరీరత్నంబుచూపు మనోరము
నడుగుల యొప్పుపై నల్లనడరు
బతివిలోకనములు పడతుకమైదీవ
గలయంగ బలుమఱు మెలగుచుండు
వెలదికటాక్షముల్ విభునిపై గ్రమమున
నెగసి మోమున జొక్కి మగిడివచ్చు
నొండొరువుల లేజెమటల నూనిగ్రేసు
పడిన చాడ్పున కవయవ భంగులందు
తగిలి మఱపున దడయు నిద్దఱవిశాల
నయనదీప్తుల నెఱుకువ బయలుపడగ."

తెరయెత్తుట తరవాయిగా అభిమన్యుని దృష్టి యుత్తర సుందరముఖారవింద సందర్శనమునకు పోయినది. ఉత్తరపతి ననుగమించుట హిందుమానవతీలక్షణమునకు భిన్నముకాన ఆమె యట్లొనర్పక అందులకుమారు పతిపాదపద్మములపై చూడ్కులు నిల్పినది. ఆ జన్మాం

తను వానిని పూజించుభార మామెయం దున్నది కావున ఆమె వానిని ప్రప్రథమము సందర్శించుటయు సమంజసముగ నున్నది. 'పతివిలోకనములు పడతుక మైదీవ గలయంగఁ బలుమరు మెలగుచుండు' అనుటచే కవి రెండు ప్రయోజనములు సాధించినాడు. మొదటిది ప్రత్యేకావయవముల నరయుచున్నాడని వ్రాయుటలో కలుగు ననౌచిత్యదోషము రాకుండ జేసుకొనుట. రెండవది అభిమన్యుని కింకనుజంకు,సంశయము పూర్తిగా పోలేదనియు, ఎచ్చోటను తన దృష్టి నిల్పుట కాతనికి ధైర్యముకలుగ లేదనియు తెల్పుట. 'వెలదికటాక్షముల్' అని యొక్క మాటలో కవి ఉత్తరవీక్షణములలోని విలాససంపదను స్పష్టీకరించినాడు. పాదావలోకనమైన పిమ్మట ఆమెదృష్టి క్రమముగా పైకెగబ్రాకి పతిముఖము జోకినంతనే వెనుకకు మరలివచ్చుచున్నది. ఇంకను పతి చూపులతో తన చూపులు మేళవింపజేయుట కామె వద్ద సాహసములేదు. కాని క్రమముగా జంకు పోయి ధైర్యము వృద్ధిపొందగా, వధూవరులు తమ దృష్టుల నొండొరుల అవయవ భంగులందు నిలిపి సౌందర్యపిపాస తీర్చుకొనుచున్నారు. ఆత్రముచేతను, ప్రథమసంస్పర్శనమందలి తొట్రుపాటువల్లను వారి యవయవములందు లేజెమటలు పొడమినవి. అవయవ భంగులందు తడయు వీరిచూపులు యీ లేజెమటలయందు చిక్కుపడి బయటకు రాలేకుండుటచే తడయుచున్నట్లున్నవని కవి చమత్కారముగా వర్ణించినాడు.

సతీపతులు అన్యోన్యమస్తకములపై తలబ్రాలు పోసుకొనునప్పుడు "మందారకల్పలతలు విరులగమియ నొండొంటిపై గురియునట్లు"న్నదని కవి వచించినాడు. ఈయుపమానమందలి స్వారస్యము పాఠకులు గ్రహించి యానందింతురుగాక. లజ్జాభయములచే నిదివరకు తనివి తీర అన్యోన్య సౌందర్యావలోకనముచేయ నవకాశము లేక క్లేశపడుచుండగా, యీతలబ్రాలు పోయు నవకాశమున "యోరలువారు చూపులక్" "వధూవరులు ఒండొరుల మోహనమూర్తులపై పచరింతురు." ఎంతటి స్వల్ప విషయములైనను కవి గ్రహించి వానిని చదువరులకు మనోరంజకమగు రీతిని ప్రకటించుచున్నాడు.

వధూవరు లేకాసనమున నున్నప్పుడు "పెను గుదుట నిడిన చూతంబును నవమాలికయుబోలె పొలుపొందిరి" అని వ్రాసినాడు. యోధాగ్రేసరుని చూత వృక్షముతోను, లావణ్యరాశియగు కన్యాలలామను నవ మాలికతోను పోల్చుట మిక్కిలి సమంజసముగ నున్నది. అదియునుగాక యావజ్జీవము పతి కాలంబన మీయ వలసినవాడు భర్త కావున యుపమాన మెక్కుడు రక్తి కట్టుచున్నది.

హోమాది కృత్యములు జరుపునప్పుడు వారి హృదయపీఠులందు కోర్కెలు పుంఖానుపుంఖములుగ జనించుచున్నవి. తలతాకుడైనప్పుడు మేనెల్ల గగుర్పొడిచి యిర్వురకును అనిర్వాచ్య ప్రమోద మొనగూడుచున్నది. చందనాది సుగంధద్రవ్యములు మేన నలందుకొని యుండుటచే వారిచెమటల తావులు మిశ్రమై క్రొత్త సౌరభమును చిమ్ముచున్నవి. పరస్పరాలోకన కుతూహలములగు వారి చూపులు "దటివేచి, చనఁబోయి తడబడి మార్గతివడు" చున్నవట. ఈ చిన్నచిన్నమాటల వల్లను, విఱుపులవల్లను కవి మన కన్నులయెదుట దంపతుల హృదయ చిత్రములను ఫోటోతీసినట్లు ప్రదర్శించినాడు. ఒకవైపు సిగ్గు; యింకొకదెస భయము; వీని నన్నిటిని మించి, కూలములను భేదించియైన వెలికి వచ్చుటకు ప్రయత్నించు ప్రేమ ప్రవాహము. మంచి రోజు చూచుకొని బైలుదేరిన యాత్రికునివలె తగిన యవకాశమును కనిపెట్టి బైలుదేరిన చూపునకు దారిపొడుగునను నవరోధములే. రెండవవారుకాని, యితరులు గాని యిది గమనించినంతనే ఆ చూపు వెనుకకు పలాయనమగుటకాని, మారుద్రోవపట్టుటకాని సంభవించుచున్నది.

"గాఢసంస్పర్శభంగులు గల్గునట్టి
హోమసమయ కృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్టపారిబోరి గ్రమ్మదేర
సమ్మదాంబుధి దేలిరి సతియు బతియు"

పైవర్ణనను పఠించినమాత్రమున చదువరులు సమ్మదాంబుధి దేలుచుండగా సతీపతులు సమ్మదాంబుధి దేలుటయం దాశ్చర్యమేమియు నుండబోదు. తిక్కన

సోమయాజి యీ పెండ్లి సమయమున ప్రత్యక్షముగ నుండెనా యను సంశయము మనకు కలుగకపోదు. మాతృ చక్షువులతో కవి నాయికానాయకుల హృదయ మర్మములు గ్రహించి, వానిని చక్కని యుపమాన ములతో ధ్వని ప్రధాన మగు భాషాచమత్కృతితో విశదపరచి యున్నాడు. దంపతుల మనోదృశ్యము Xరే ఫోటో చేసినట్లు మనకన్నులయెదుట ప్రదర్శించి యున్నాడు. శృంగార రసపోషణ సమగ్రముగ నొప్పు చున్నది. అనౌచిత్యదోషము మచ్చునకైన కానరాదు. గంగానదిని భూలోకమునకు కొనివచ్చి భగీరథుడు సార్థక జన్ముడైనట్లు, తాజమహాల్ భవనరాజమును నిర్మించి షాజహాన్ చక్రవర్తి చరితార్థుడైనట్లు, తిక్కన సోమయాజి ఉత్తరాభిమన్యుల వివాహవర్ణనమందు తన అద్భుత కళావైదగ్ధ్యమును ప్రదర్శించి, చదువరుల నానందాంబుధి నోలలాడించి, తేజోరాశియగు తారకా మణివలె నాంధ్రగగన సీమయందు విరాజిల్లుచున్నాడు.



శ్రీమతి డబిల్యూ. డి. ఫెర్నాండో.

ఈమె బౌద్ధయువతి. సింహళమునుండి బుద్ధగయకేతెంచి వెనుకనొక అమావాస్యనాడచటిబుద్ధాలయ మున కొంకాయచమురుతో ౮౪,౦౦౦ దీపములను వెలిగించినది. అక్కడనుండి బోధివృక్షముపట్టముక్కను సింహళమునకు కొనిపోవుచు 'ఇంచంగ' నౌకమీద ప్రయాణము సాగించుకాలమున నౌకపయిన బోధివృక్షమును పూజించుచున్నది.

—E. N. P.



౧. ప్రథమసందర్శనము

# సవ్యాఖ్యానాంధ్ర వాల్మీకి రామాయణము *

బులుసు వెంకటరమణయ్య

## (బాల - అయోధ్యా కాండములు)

ఆంధ్ర వాఙ్మయప్రపంచమున గ్రంథ నిర్మాణమునకు భాషాంతరీకరణమే ప్రథమసాధన. ప్రాచీన కవు లొనరించినది భాషాంతరీకరణము. ఆధునికకవు లొనరించుచున్నదియు అనువాదమే. అనువాదమే ఆంధ్రులకు అవలంబనము.

ఆంధ్రమునగల యనువాదములలో భారతమునకు, తదంతర్గతభాగములకును కల యనువాదములే ఎక్కువ. వివిధపురాణానువాదములు ఆతరువాతివి. ఆదికావ్యమగు వాల్మీకిరామాయణమునకుగల ఆంధ్రీకరణములు మిక్కిలి తక్కువ. కవిత్రయమువా రనువదించినది మహాభారతము. కవులందరు (ఇంచుమించుగ) అనుసరించినది వారిమార్గము. ఆదికవి నన్నయ రామాయణమును విడిచి భారతమునే ఆంధ్రీకరింప ప్రారంభించుటకు కొందఱు

కొందఱు కొన్నికొన్ని కారణములను వాకొందురు; కాని యథార్థమగు కారణ మిదమిత్థమ్మని నిర్ణయింప నలవికాదు. అటులనే రామాయణము నాంధ్రీకరింపకుండుటకు గల కారణమును మృగ్యమే.

విపులముగనో, సంగ్రహముగనో సమగ్రముగ గల ప్రాచీనాంధ్ర రామాయణములు చాల తక్కువ. అందు భాస్కర రామాయణము, రంగనాథ రామాయణము, మొల్లరామాయణము ప్రసిద్ధములు. ఎఱ్ఱాప్రగడ నిర్వచనోత్తర రామాయణము, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము (వాల్మీకి) రామాయణైకదేశమగు ఉత్తరకాండకు ప్రతికలు. కాని ఇవి యేవియు మూలమునకు సరియగు నాంధ్రీకరణములు కావు. గతశతాబ్దిలో శ్రీ వేంకటగిరి సంస్థానాస్థాన విద్వాంసుడు శ్రీ చెదలువాడ గోపీనాథకవి మూలానుసారముగ రామాయణమును 'గోపీనాథరామాయణ' మనుపేర రచించెను. ఇది భాస్కర రామాయణము కంటె చాల విపులము. భాస్కర రామాయణమునకు బిదప ప్రసిద్ధి కెక్కినది.

వాల్మీకి రామాయణమునకు సరియగు నాంధ్రానువాదము నొనరింపగడంగి కృతకృత్యులయి 'ఆంధ్ర వాల్మీకి' బిరుదము ఆర్జించినవారు శ్రీ సుబ్బరావు గారు. బహుభాషా పాండిత్యమును, అనర్గళ కవితాధారను అలవరచుకొనిన శ్రీ పంతులుగారి రచనంగూర్చి ఎక్కువగ చెప్పబనిలేదు. వీరి ప్రతిభాపాండిత్యములు వీరికి 'కవిసార్వభౌమ' బిరుదమును సంపాదించి పెట్టినవి. ఇటీవల రామాయణమును పద్యకావ్యముగ రచించిన కావ్య, పురాణ, స్మృతి తీర్థ శ్రీ జనమంచి, శేషాద్రి శర్మగారికి లభించిన 'అభినవాంధ్ర వాల్మీకి' బిరుదమును శ్రీ వావిలికొలనువారి యశస్సు నుగ్గడింపజాలియున్నది.

### మూలము

సంస్కృతమును జదివి యర్థముచేసికొననేరని యాంధ్రులు శ్రీమద్రామాయణమునకు బదులు ఈ రామాయణమునే నిత్యపారాయణ గ్రంథముగ ఉపయోగించుచున్నారు. ఇది చాలకాలము క్రిందనే అట్టి ప్రఖ్యాతిని గడించినది. అట్టి దీని నిపుడు పాఠకలోకమునకు పరిచయము చేయుట హాస్యాస్పదమే

* మూలకర్త, వ్యాఖ్యాత: ఆంధ్రవాల్మీకి, కవిసార్వభౌమ, శ్రీవావిలికొలను సుబ్బరావుగారు. రాయల్ సైజు. బాలకాండము ౯౯౧ పుటలు. వెల రు ౬ లు. అయోధ్యాకాండము ౧౨౬౩ పుటలు. వెల రు ౭-౮-౦. క్యాలికోబైండు. గిల్టుపేరు. దొరకుచోటు:—శ్రీరామజయమందిరము, ౨౧ రాజా హనుమంతలాలా వీథి, తిరువల్లిక్కేణి, మదరాసు.

కావచ్చును. దిజ్మాత్రము విమర్శించుట అప్రస్తుతము కాదు.

ఆంధ్ర వాల్మీకిరామాయణము వాల్మీకిరామాయణమునకు యథామూలానువాద మని ప్రసిద్ధి. శ్రీ సుబ్బరావుగారు సందర్భోచితముగ అచ్చటచ్చట స్వచ్ఛందత నుపయోగించుటయు ఇందు కానవగును. ఆస్వేచ్ఛ చాలచోట్ల భాషాంతరీ కృతికి మెరుగు పెట్టజాలి యున్నది. 'యోగిజనపుంగవు లెల్లరు నెంటనంటగ' వచ్చి బ్రహ్మ వాల్మీకికి ప్రత్యక్షమయ్యె నని మూలములో లేని రీతిని చెప్పుటలో ప్రయోజనము లేకున్నను, కౌసల్యాగర్భధారణము, రాముని బాల్యక్రీడలు, పురస్త్రీల చేష్టితాలాపములు మొదలగువాని వర్ణన మెంతయు తత్తత్సందర్భోచితమయి, రసవ్యంజకమయి సప్రయోజన మగుచున్నది. ఇట్లే అయోధ్యాకాండమునందును కొన్ని కల్పితవర్ణనములు కలవు.

భాషాంతరీకరణమున దుర్నివారములగు నెరసులు ఇందును అచ్చటచ్చట గలవు.

క. నీ రామాయణ కావ్యము
ధారుణి నెందాక నిలుచుఁ దత్పర్యంతం
బార యశంబునుగని మని
మా రమ్యజగంబుబొందు మా యామీదన్. పు ౩౧౩

దీని మూలము ఇట్లున్నది:—

యావద్రామాయణకథా త్వత్కృతా ప్రచరిష్యతి,
తావ దూర్ధ్వ మధశ్చ త్వం మల్లోకేషు నివత్స్యతి."

"రామాయణకథ లోకమున వెలయునంతకాలము సత్యలోకమున, పరిసరముల నీవు వసింపగలవు"

అని మూలాభిప్రాయము. ఇది యనువాదమున కానరాదు. ౩౩౧-౩౩౩ పుటలలో గల రామాయణకథా సంగ్రహము మూలానుసారముగ లేక తారుమారయి పౌర్వాపర్యములు విపర్యస్తము లయినవి.

పుట ౬౫౯, ౬౩౦.

ఉ. ఓరీ! రాఘవసత్కులాపశద! లేరో పుత్రు లెవ్వారికిన్?
గారామారగ నీవొకండవె ధరన్ గన్గొంటివే నేటికే
వారంగూర్చెద నాదుకోర్కి యని మున్నట్లాడి యిప్డిట్లహం
కారంబొత్తగ నీను బొమ్మనెదవా కానీ క్రియల్ నిల్పునే

క. నిను మూర్ఖు విషయలోలు ని
నన్నృతపరున్ శఠుని మూఢు నవనీపతిగాఁ
గను, రాముజనకుఁ జేసిన
వనజాసను వలయుఁ బట్టి పాలార్పంగన్.

దీనికి మూలము లేదు మూలమున లేకున్నను విశ్వామిత్రునిచే దశరథుని తిట్టించుటలో ఔచిత్యమూహాతీతము.

అయోధ్యాకాండ ద్వితీయసర్గమున ౫౪ శ్లోకములు కలవు. అందు ౩౬ శ్లోకములే ఆంధ్రీకరింపబడినవి. ఇట్టివింకను కొన్నికలవు.

శ్రీ పంతులుగారి కవితాధార యనర్గళము. కాని ఛందోయతిప్రాసముల నెదురుబాటునకు అచ్చటచ్చట వ్యర్థపదములను, క్లిష్టపదములను వాడుట వారికిని తప్పనిసరియయినది. గుణదోషములు రెండింటికిని ఉదాహృత పద్యములు చాలును. ఇట్టివి గొప్పతప్పులని నా తలపు కాదు. కాని గ్రంథమున నచ్చటచ్చట ఇట్టివి కలవని చూపుటకే వీనిని ఉద్ఘాటింపవలసివచ్చినది.

## వ్యాఖ్య

గ్రంథకర్త తొలుత మూలమునకు పెట్టినపేరు 'ఆంధ్రవాల్మీకి రామాయణము.' వ్యాఖ్య రచించి, దానికి 'మందర' మను నామకరణ మొనరించి పిదప మూలము పేరు 'ఆంధ్ర వాల్మీకిరామాయణ క్షీరార్ణవము' గా మార్పబడినట్లు గోచరించును. మూలనామానుసారముగ వ్యాఖ్యాననామముండుట సామాన్యము. ఇయ్యది విశేషము.

శ్రీ సుబ్బరావు పంతులుగారి కవనము చాల సరళమయినది. సంస్కృత సమాసములు తక్కువ. ఒక్కొక్కయెడ నవి యున్నను సులభగ్రాహ్యములు. కావున ప్రతిపద్యమునకును టీకాతాత్పర్యము లావశ్యకములు కావు. విశేషార్థము లున్నచో, వానిని తప్పక వివరింప

వలసియేయున్నది. కాని యిందు ఇంచుమించుగ ప్రతి పద్యమునకును టీకా తాత్పర్యము లొసంగబడినవి. అట్లొనరించిన గ్రంథము పుటలు పెరుగును గాని గ్రంథ గౌరవమును సంపాదింప నవకాశము లేదు.

మచ్చున కొక ఉదాహరణము :

" క. అని ధర్మాత్ముఁడు వాల్మికి
ఘనధర్మయుతంబు రామ కథ సర్వంబున్
గనఁగ యథార్థము నాలో
చన సేయఁగ సాగె మిగుల శ్రద్ధాన్వితుఁడై. పు. 3౨౧

అని=ఈ ప్రకారము; ధర్మాత్ముఁడు=ధర్మమే స్వభావముగాఁ గలవాఁడు; వాల్మికి=వాల్మీకిమహర్షి; ఘనధర్మయుతంబు=గొప్ప ధర్మముతోఁ గూడినది. అన్ని ధర్మములలో గొప్పది మోక్షధర్మమే కావున మోక్షప్రదమైనది. రామకథ సర్వంబున్=రాముని జన్మము మొదలు నిర్యాణమువఱకుగల కథను. యథార్థము = ఎట్లెట్లు జరిగినదో యట్లట్లు ; కనఁగన్ = కన్నులారఁ జూచుటకు; శ్రద్ధాన్వితుఁడై=శ్రద్ధతోఁగూడినవాఁడై. ఆలోచన సేయ సాగెన్=ధ్యానింపఁ బ్రారంభించెను.

తాత్పర్యము:—ధర్మచింతమే గొప్ప స్వభావముగాఁ గల వాల్మీకి గొప్ప ధర్మముతోఁ గూడిన శ్రీరామచరిత్రమును నాదినుండి యంతమువఱకు వాస్తవముగ జరిగినది జరిగినట్టు కన్నులారఁ జూచుటకై శ్రద్ధతో నాలోచింపసాగెను."

గ్రంథమును తెరువగా యాదృచ్ఛికముగ నిది కనబడినది. ఇందలి తాత్పర్యము దండాన్వయమురీతి నున్నది.

మఱియు, ఏదోయొకసందర్భమునుగల్పించిముందు రాబోవు మూల పద్యములు సమగ్రముగ వ్యాఖ్యయందు వ్రాయబడి యున్నవి. మూలమువలెనే వ్యాఖ్యానము కూడ పెద్ద అక్షరములలోనే ( Great Primer ) ముద్రింపబడినది. ఇవియు గ్రంథము పెంపునకే యనుకూలించుచున్నవి. చిన్నపుస్తకములకు గూడ వ్యాఖ్య చిన్న అక్షరములలోనే (English Body) ముద్రింపబడుచుండుట సర్వసాధారణము. అట్లొనరించినచో గ్రంథముద్రణమున కగు వ్యయము తగ్గును. దానింబట్టి వెలనుకూడ తగ్గింప వీలగుటచే గ్రంథమును కొనువారి అసౌకర్యమును తగ్గును.

ఈవ్యాఖ్యానమున శ్రీపంతులుగారు చర్చనీయాంశములను సిద్ధాంతీకరించినారు. ఆసిద్ధాంతముల సాధుత్వాసాధుత్వనిర్ణయము పండితులపై ఆధారపడి యున్నది.

ఇందు వ్యాఖ్యాత అప్పకవిని కుకవులలోఁ జేర్చి నిందించెను. పోతన్నగారియెడ 'వాసుదాసు'లకు కల భక్తియే యట్లొనరింపజేసినది. పోతరాజుగారి భాగవతము ప్రమాణగ్రంథముకాదని చెప్పుటచేతనే అప్పకవి కుకవులపద్దునకు ఎక్కవలసివచ్చినది !

పోతరాజుగారి నివాసస్థానము 'వరంగల్లు' అని యిప్పటికి నిశ్చయింపబడినది. శ్రీ పంతులుగారు మాత్రము తమ నివాసస్థలమగు 'ఒంటిమెట్ట'యే అతని నివాసస్థలమని యిందు నిరూపించిరి.

మొల్లరామాయణమును రచించినది 'మల్లమ్మ' కాని 'మొల్ల' కాదని వ్యాఖ్యాతలు వ్రాసిరి. అందులకు ప్రమాణము లావశ్యకములు.

ఈవ్యాఖ్యానమునందును అందందు కొన్ని చిన్న చిన్న నెరసులు గోచరించుచున్నవి.

పుట ౧౦. కావ్యప్రయోజనములను వివరించు నెడ "కాంతాసమ్మితతయోపదేశయుజే" అనుదాని కిందు "ఇది లోకులకు, ప్రియురాలు ప్రియునకు వలె దియ్యని మాటలచే హితముపదేశించునదై యుండవలయును" అని వ్రాయబడినది. ప్రియురాలు మాటలచే గాక చేష్టలచేతనే తన యభీష్టమును కాంతునికి దెలియజేయునట్లు కావ్యము వ్యంగ్యముగ హితాహితములను తెలియజేయుననియే మీది 'కాంతాసమ్మితతయోపదేశయుజే' అను దాని అర్థము.

పుట 3౧౬. "సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ దోషవర్జితౌ కావ్య'మ్మని కావ్యాదర్శమున గావ్యలక్షణము చెప్పబడిన" దని వ్యాఖ్య. ఇది అర్వాచీనులు చెప్పిన కావ్యలక్షణము. కావ్యాదర్శమున ఇది లేదు.

'శరీరం తావ దిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ' అను లక్షణమే అందు గలదు.

పుట ౧౩౧, వ్యాఖ్యానమున నీయబడిన 'దానం భోగవివర్జితం' మ్మనుదాని యాంధ్రీకరణము 'దానము భోగముకూడదు.' అని. ఇట్టివి చాల అరుదుగా నున్నవి.

వ్యాఖ్యానమున అచ్చటచ్చట సంస్కృత వ్యాఖ్యానములందు చర్చింపబడిన విశేషార్థములు వివరింపబడినవి. అవి చాల ఉపకరించునవి. అట్టివానినే పరిగ్రహించి, ప్రతిపద్య ప్రతిపద తాత్పర్యములను విడిచి కఠినపదములవివరించియు, సుబోధముకాని తాత్పర్యమును వివరించియు వ్యాఖ్యాన మొనరించిన, ఇప్పటికంటెను పాఠకులకు ఎక్కువ లాభము కలిగెడిది.

శ్రీ పంతులుగారు తమ గ్రంథమునకు తామే వ్యాఖ్య రచించుట యొక్క విశేషము; ప్రశంసనీయము. వారు ఇప్పటికి మొదటి రెండుకాండలనే సవ్యాఖ్యానముగ ప్రకటించినారు. తక్కినవానిం గూడ త్వరితముగ ప్రకటించి భాషాసేవకయి పాటుపడుదురుగాక!

---

# మనుచరిత్రములో నొకపద్యము—పాఠపరిశీలనము

కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులు

"ఎందేడెందము" అను పద్యములోని 'కందళించు' అను సిద్ధపాఠమును 'కందళించి' అని సవరించుకొనుడని శ్రీ కురుగంటి సీతారామయ్యగారు భారతిలో వ్రాసిరి. ఎప్పటినుండియో కుదురని యీ పద్యము తంజావురమున సరస్వతీమహాలులోని గ్రంథాలయమున నొకప్రతిలో పైనిచెప్పబడినట్లే వ్రాయబడి ప్రక్కన 'చి' యని వ్రాయబడుట యీపాఠమును 'కందళించి' గా మార్పుచేసి కుదుర్చుకొనుటకు సహకారియయ్యెనని యీపక్షమునభిప్రాయము.

ఇప్పటికి చిరకాలమునుండి పండితులదృష్టిలో నటించిన 'కందళించు' అను ప్రసిద్ధపాఠమును మార్చు నవసరము లేదని విన్నవించుట నేకూర్చుకొన్న హేతువుల నిట నివేదించుచున్నాను.

పాఠము మార్చవలెననుపక్షమున ముందీపద్యమున కన్వయవిభాగ మిట్లున్నది.

౧. ఎందేన్ డెందము రహిచేన్ కందళించున్.

౨. (ఎందేన్) (డెందము) ఏకాగ్రతన్ కుంభగతప్రదీపకళికా శ్రీబోఁపన్ నిర్వృతిన్ చెందున్.

౩. ఎందేన్ ఇంద్రియముల్ సుఖంబు గనున్.

ఆ యింపే పరబ్రహ్మము—అని.

ఈపద్ధతిలో 'కందళించున్' అనునది సమాపకక్రియ. దానితో మొదటివాక్యము సమాప్తము. రెండవ వాక్యములో 'ఎందేన్' 'డెందము' అనురెండుపదములు నధ్యాహార్యములు. 'చెందున్' అనునది యిచట సమాపకక్రియ. మూడవవాక్యము స్పష్టము. ఇట్లు మూడన్వయములుగా నైనప్పుడు తృతీయార్థమని చెప్పబడుదానికి 'ఎందేన్' అనిప్రయోగించిన పెద్దనగారు మఱియొక 'ఎందేన్' ప్రయోగింపలేకపోయెనా? అన్నయాశంకపై, ఈభాగము రెండన్వయములుగా విందుటే కవియభిప్రాయమని, యందులకు 'కందళించి' యనిక్త్వార్థకక్రియారూపముగా పాఠము సవరించుట సరసమని యీపక్షము సిద్ధాంతము.

ఇట నాయభిప్రాయము: ఈపాఠసవరణమునకు కేవలము 'ఎందున్' అనునది మఱొక్కమారు లేకపోవుటయే కారణమనుట పొసగదు. అపుడు వాక్యములు రెండుగానున్నను కర్తృపదము (డెందము) ఒక్కటియే. కనుక మఱల 'ఎందేన్' లేకపోవుటచే స్వారస్యమునకు భంగమురాదు. మీదుమిక్కిలి యీశైలి రసోపస్కారకారణమే యగును.

మఱియు 'ఎందున్' అనునది యుండియే తీరవలెననుచో 'ఎందెందున్' అనుదానిలోని యొక 'ఎందున్' అనుదానిని వెనుకవాక్యమున కన్వయింపవచ్చును. అట్లు సర్తించియు 'ఎందున్' అనునది సంధిలో చేర్పడిన సముష్టిపదముగావున సముష్టిపదముగానే గ్రహింపవలెను" అని యీపద్ధతినిద్రోసిరాజనిరి. అదియు సరికాదు. అవసరమగుచో సంధిలోనిపద మచ్చోటి కన్వయించుట దోసముకాదు. వీలులేదనుటెట్లు? కనుక 'కందళించున్' అనునది సమాపకక్రియగా నుండవచ్చును.

సిద్ధపాఠమునుబరిష్కరించునుద్యమమమూలక మనుటకే పైరెండుపద్ధతులను సూచించితిని. కాని నాకీరెండు రీతులలోను నాదరములేదు. మొదటిరీతిలో డెందము—ఎందున్, అనునవిరెండును దఱువాతివాక్యమున కధ్యాహార్యములుగా గొనవలసిన యిరుకుపాటును, రెండవరీతిలో 'ఎందెందున్' అను జాతీయప్రయోగమును భంగపఱచి సమన్వయించుట క్లిష్టమగుటయు నిందులకు గారణము. కాక ఆంధ్రకవితాపితామహు డీపద్య

ఫలకమున జిత్రింపనెంచిన రసమూర్తి నీపద్ధతియేదియు ప్రత్యక్షము నేయజాలకపోవుటయే కాక దోషానుమితి కిగూడ తావిచ్చుట సహృదయోద్వేజకమగు విషయము.

అందుల కీపద్యసమన్వయపద్ధతి యిట్లుండవలెను.

౧. ఎందేన్ డెందము కందళించురహిచేన్ (కందళించు = వికసించు (చిగిరించు) రహి = రక్తి (రాగము) అని యీయర్థము.) ఏకాగ్రతన్ సంభృతప్రదీపకళికాశ్రీదోపన్ నిర్వృతిన్ చెందున్.

౨. ఎందెందున్ పోక ఎందేన్ ఇంద్రియముల్ సుఖంబు గనున్ ఆయింపే పరబ్రహ్మము—అని.

ఇప్పుడు 'కందళించు' అనునది సమాపకక్రియ కాదు. అది తద్ధర్మార్థక్రియావిశేషణము. 'రహిచేన్' అనుదానితో సమసించునది. అప్పుడు 'చెందున్' అనునదియే సమాపకక్రియ. అయ్యెడ నీభాగము రెండువాక్యములేయగును. అందుచే మఱియొక 'ఎందేన్' ప్రయోగింపలేకపోయెనా ? అన్నశంకయే తలయెత్తదు. ఇంకేపదము నధ్యాహార్యముగా దేనక్కఱలేదు.

సిద్ధరూపమును మార్చుపనియు నుండదు. అన్ని విధముల సరిపడినది. కాని యర్థగౌరవమున కీయన్వయ మెంతదనుక నుచితము ? అను ముఖ్యవిషయ మొకటి చర్చకు మిగిలియున్నది. దిఙ్మాత్రముగా నాయంశమును వివరించెదను.

వరూథిని ప్రవరుని చెట్టవట్టికొని తన యగాధహృదయమున నువ్వెత్తుగ నుల్లసించు ప్రేమతరంగమాలికల జల్లులాడవలెనని, సపర్యలిచ్చి, సరసమాడి, సైగలుచేసి, తుదకు బిగువుదప్పిన ప్రసంగముల బురికొనుటయు, నానైష్ఠికశిరోమణి తా నుపాస్యముగా నమ్మిన శాంతరసదేవతామూర్తియారాధనమునుండి మరల నని ఘంటాపథముగ వాదించుటయు నింతవఱకు నడచినగాథ. అటుపై జేయునదిలేక యావన్నెలాడి కుహనాశాంతరస సమారాధనాపారవశ్యమున నేని వానితోడి భావైక్యము పొందవచ్చునని, తన శృంగారరసమూర్తికి శాంతరసపు మలాముపెట్టి, యాతఁడుపలకుపలకు పలి కించి వాని నాకర్షింప మాయపన్నుగడ పన్నినది. ఆ మాయకు ప్రవరుడు లొంగెనా ? లేదు. అతడు నమ్మికొలిచినదేవుడు హవ్యవాహనుడు కాడా, ఆతని యనుగ్రహమున వరూథిని పూసినపైపూత కరగిపోయినది. నిజము బయటబడెను. 'చెప్పకు మిట్టి తుచ్ఛసుఖము లీమ్మోసాలపై డేనియల్' అనియు, 'ఈ పాండిత్యము నీకుదక్క మఱియొందేగంటిమే ?' యనియు నిట్టి యధిక్షేపములకు వరూథిని గురియయ్యెను. ప్రవరుని వంటి నైష్ఠికవిజ్ఞానియెడ బన్నిన మాయకు ఫలితముగా మాయాప్రవరునితోడి మాయారసానుభవము తుదకామెకు దప్పినదియు కాదు.

అదియట్లుండె; ఆమెపెట్టినపైపూతలో జూపిన పనితనమున కీపద్యము స్థానమగుట మనకు ప్రసక్తము. ఇందు 'రతి' యనుస్థాయిభావమునే 'రహి' యనుదానిచే సూచించుచు, దానివికాసమునే 'కందళించు' అనుపదముచే జెప్పి—

"విభావై రనుభావైశ్చ
సాత్త్వికై ర్వ్యభిచారిభిః,
ఆనీయమాన స్స్వాదుత్వం
రతి శ్శృంగార ఇష్యతే"

అనుశృంగారరసలక్షణమునే మాటుపెట్టి, "ఆయింపే పరబ్రహ్మము" అనుచో 'ఇంపు' అనుపదముచే జక్కగ విభావాదిసామగ్రీపరిపోషితస్థాయిభావరూపమగు రసమునే సూచించుచు, దీనినిగొంపోయి 'ఆనందో బ్రహ్మ' అనుశ్రుతికి సమన్వయపఱచి నేబా సనిపించినది. 'రసో వై సః' ఇత్యాదిశ్రుతిసమన్వయపద్ధతి జ్ఞప్తికిం దెచ్చుట కిదియెత్తు. ఈపని మంచిమెళుకువతోనే నడచినది. 'రహి' 'ఇంపు' అనుటకు మారుగ 'రతి' 'రసము' - అనుపదములే పెదవిదాకిన శాంతరసమూర్తియగు నాబ్రాహ్మణు డప్పుడే చెవులుమూసికొని 'హా శ్రీహరీ' యనుట జరిగిపోగా నామె ప్రాంచద్భూషణ......శృంగారగవుంగలించుటయు, అధరంబానించుటయు, నాతడోరమోమిడి.........పొమ్మంచుం ద్రోయుటయు నను విచిత్రసంవిధానమునకు దావే లేకపోయెడిది.

ఆయంశము నెఱిగియెఱింగి పెద్దన వరూథినికి మున్నె వెన్నతో దినిపించిన 'నవవిల్తుశాస్త్రంపు మినుకుల పస' కేవలానుకరణమాత్ర పాండిత్యముగాగాక, పరస్పరవిరుద్ధములగు రెండురసములసిద్ధాంతముల దారుమారుచేయుపాటి స్వతంత్రపాండిత్యముగా నీపాట వరూథినియందు వ్యక్తీకరించుటకును, ఆప్రతిభ నెఱుంగగల పరేంగితావగాహియగు బుద్ధిగల మహాపండితునిగా బ్రవరుని జిత్రించి, వానినోట 'ఈపాండిత్యము నీకుదక్క మఱియెందేఁగంటిమే? కామశాస్త్రోపాధ్యాయినివా వచించెదవు' అని దానిశృంగారరస తిరోధానమైపుణ్యమును గనిపెట్టి, దాని యుపాధ్యాయినీత్వము నధిక్షేపింపజేసి, ప్రవరునిరసికత్వమును, అచంచలశాంతరసనిష్ఠకును మెఱుగుపెట్టుటకును, ఒక చక్కనిసన్నివేశము నీపద్యరూపమున గల్పించుకొన్నాడు. మఱియు వరూథినీవాక్యమున 'రహి' చే మున్నుగప్పవడిన 'రతి' నే 'ఓహో త్రయీధర్మముల్ పాపంబుల్ రతిపుణ్యమంచునిఁక నేలాతర్కముల్' అని ప్రవరునిచే నడివీథి బెట్టి బుద్ధిచెప్పించెనా యన్నట్లు బహువిధప్రయోజనాపేక్షితముగా 'రతి' యనుశబ్దము నట నాశ్రితినాడు.

అనగా వరూథినీకామశాస్త్రోపాధ్యాయినీత్వము గాని, దానినిగుర్తించి తొట్రుపడని, "వానిచక్కఁదనము వైరాగ్యమునఁజేసి" ఇత్యాదిపద్యప్రతిపాదితమగు ప్రవరుని శాంతరసప్రతిష్ఠావర్ణనము గాని, గాలికిబోవునవిగాగాక యుచితములగుతావుల రాణింపజేయనే చేసితినని, తనరచనయొక్క సార్థకతను నిరూపింప భావపుష్టిని దాండవింపజేయుట కనుకూలరంగముగా నీ పద్యమును పెద్దన పాడినాడనుటలెస్స. అల్లసానివారి యల్లికజిగిబిగి కిదిగుర్తు.

ఈయర్థగాంభీర్యమెల్ల "కందళించునది రహిగాని డెందముకాదు" అనుకొన్నప్పుడే గోచరించినది. కనుక 'కందళించురహిచేఁ' అని కలిపికూర్చుకొని, యప్పటి యద్భుతభావసంపత్తికి సహృదయులు తలయూచెదరుగాక యని నమ్ముచున్నాను.

ఎన్నోమారు లీపద్యము దృక్పథమునబడినది. కాని యింతగాబరిశీలించి కవీంద్రునగాధహృదయరంగమున జాలువారిన రసస్వరూపము నింతటగుర్తించి వివరింపగలుగుటకు శ్రీసీతారామయ్యగారి విమర్శనమే మూలము. కనుక వారియెడ గృతజ్ఞుడను.



బమ్మెరవారి భాగవతములోని

# "పుట్టంబుట్ట" పద్యార్థము

(శ్రీ) న. చ. వరదాచార్యులు

కడచిననెల భారతిలో పై శీర్షికను "కుమారదేవ" అనే సాంకేతికనామంతో ఎవరో ఆ పద్యానికి అర్థం వారికి తోచినట్టు పాఠంమార్చి రాశారు. దాన్ని చూసి పోతనమహాకవినిశ్శరీరాత్మ కొంచెం బాధపడి ఉంటుందని నే నెంతో కటకటపడ్డాను. ఉన్నదాన్ని మార్చకుండా తెలుసుకోగలిగితే మంచిది. లేదా, యెవరివల్లనైనా తెలుసుకోవాలి. అంతేగాని పాఠంమార్చడం చాలా అన్యాయం దాన్నే పెద్దలు—

"సుకవివచసి పాఠా నన్యథాకృత్య మోహాత్
రసగతిమవధూయ ప్రౌఢమర్థం విహాయ,
విబుధవరసమాజే వ్యాక్రియా కాముకానాం
కవికులవిముఖానాం ధృష్టతాయై నమోస్తు."

అని కోప్పడ్డారు.

అంచేత మనం పాఠంమార్చకుండా అర్థం చెప్పకోవాలి. కాబట్టి, నాకు తోచినవిధానాన్నిబట్టి దానికి "మనలో నించుమిం చండఋం జెప్పకొనెడి యర్థము "ను సమర్థిస్తున్నాను. "శరంబున నోమ్ములవ = శరవణభవుం డనుగాను" అని 'కుమారదేవ' గారు మొదట సూచించిన పైయర్థమే చెప్పవలె. ఇప్పుడు "శరవణ భవుండు కవియనికాని, పురాణకర్తయనికాని ప్రసిద్ధి యెచ్చటను గనపడక" అనే సంశయం యెదుర్కొంటూంది. దానికి సమాధానం మనవిచేస్తున్నా.

రాజశేఖరకవికావ్యమీమాంసలో కావ్యపురుషోత్పత్తిని తెల్పేతృతీయాధ్యాయంలో "పిమ్మట ఆకావ్యపురుషుడు రోషముతో వెనుకకు మఱలి వచ్చెను. ఇతనికి (కావ్యపురుషునికి) ప్రియమిత్రమగు కుమారస్వామి కావ్యపురుషుని యీస్థితిని జూచి సహింపజాలక పెద్దపెట్టున నేడ్చుచుండ నతనితల్లియగు గౌరిచే నిట్లని చెప్పబడినాడు "బాబూ, నీవూరకుండుము. ఇదిగో నేను నీమిత్రునిమఱల్చి రప్పించెదను." అనిచెప్పి ......"అని కావ్యపురుషునకునూ, కుమారస్వామికిన్నీ గాఢమైనమైత్రివున్నట్టు వ్రాసియున్నాడు. కావ్యపురుషుని యెడబాయజాలనంత మైత్రికలవాడంటే అతడు గొప్పకావ్యరసికు డని అర్థం. ఎంచేత అలాగంటెఅర్థం చెప్పకోవాలనంటే—ఆ ప్రకరణంలో వర్ణించినసందర్భం అంతా విచిత్రమైన అంతరార్థం కలదిగా కనిపిస్తూంది. కావ్యపురుషుడూ, సాహిత్యవిద్యావధువున్నూ యేయేదేశాలలో యేయేవేషాలతో యేయేవిధాలైన గీతవాద్యాదులతో విహరించారో ఆయాదేశాలవాళ్లకు అటువంటివేషభాషలూ, కవిత్వమూ అబ్బినట్లుగా వర్ణించడంవల్ల ఆయాదేశాల 'రీతులు' వర్ణించబడినట్లు తేలుతూంది. వైదర్భి, గౌడి, పాంచాలి అనేవి అవే. కాగా, ఈమిథునము విహరించినదేశాలవాళ్లకే యింత గొప్పతనం రాగా, కావ్యపురుషుని ప్రియమిత్రమని వర్ణించబడిన కుమారస్వామి యెంతటికావ్యరసికుడై వుంటాడో ఊహించండి.

ఇంతేకాకుండా షణ్ముఖుని గొప్పపండితునిగాకూడా ఉదాహరిస్తున్నారు. రత్నఖేట దీక్షితుణ్ణి గూర్చి చెప్పేచాటువులో

"విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చితే

.................................

.................................

అసమ్ముఖశ్చ షణ్ముఖ శ్చతుర్ముఖశ్చ దుర్ముఖః"

అని షణ్ముఖునికి బ్రహ్మతోపాటు స్థానం యిచ్చారు.అతణ్ని పండితుడనండి,కవియనండి మీయిష్టం.

ఆత్రేయవెంకటాధ్వరి తనలక్ష్మీసహస్రం ప్రారంభస్తబకంలో మనపోతనమహాకవి చెప్పకున్నలాంటి సందర్భంలోనే

"చక్షుష్మాన్ శ్చరణకమలే
చక్షుషా శ్రోత్రవన్తః
శ్రోత్రే భూమే ర్జనని
జగతాం జన్మవన్తోపి నస్మః,
వక్త్రాణ్యాసన్ భగవతి! న
షట్పంచ చత్వారి వా నః
కస్మా దస్మాన్నహసతు
జనస్త్వేన్యత స్త్వద్గుణౌఘమే!"

అనిరాశాడు. ఇందులో వాల్మీకిని, షణ్ముఖుణ్ని కూడా స్మరించాడు. అంచేత కుమారస్వామి యేగ్రంథాన్నీ రచించకపోయినా (కుమారస్వామియేమైనారచించాడో లేదో నేను వెతికిచూడలేదు) కవులమర్యాదనుబట్టి అతణ్ని యీవర్గంలో వర్ణించడానికి యేమీ అభ్యంతరం లేదు.



౨. సత్యవంతుని మృతి

## చీనా విశ్వవిద్యాలయము

హాంకో చేరువ వుచంగునందు వూహాను నూతనవిద్యాలయపు గ్రంథాలయ ప్రవేశ మందిరము. చీనాలో ప్రభుత్వమువారు ప్రారంభించిన విద్యాభివృద్ధి కార్యక్రమముయొక్క నిర్మాణమిది.



# పురుషార్థములు*

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

56

శ్రీ గోపాల కృష్ణుడు ౧౯౧౮ లో బందరుఆంధ్ర జాతీయకళాశాలయందు ఆచార్యుడై ఉన్నపుడు ఇచ్చిన ఉపన్యాసములలోని అంతర్భాగములు ఇట్లచ్చొత్తింపబడినవి.

గ్రంథము చిన్నది యయ్యు, శ్రీ గోపాల కృష్ణుడు చక్కనివిజ్ఞానియని రూఢిచేయుట కిది ఒక్కటియు చాలును. అర్థశాస్త్రమునే కాక తత్త్వశాస్త్రమునుకూడ అతడు పిడికిటబట్టెననుట కిది తార్కాణము. పాశ్చాత్యవసుంధరయందు మసలి, పాశ్చాత్యవిద్యయందాటితేటి, అంతటితో సంతృప్తినంది ఊరకొనక పూర్వవిజ్ఞానాంశములను హృదయంగమము చేసికొని మానవుని సర్వతోముఖాభివృద్ధికి అక్కరగునవి ఇవి యని జలదగంభీరస్వరమునపలికి, వాని నాత్మజీవనమున ననుష్ఠింప దొరకొనిన మహాత్ముడు గోపాలకృష్ణుడు. మానవునిదృష్టిసమక్షమున ఉత్తమాశయములను నిలిపి, వాని నాతడు చేరుటకై ప్రాచీనులు సముచితమైన శిక్షణా వ్యవస్థను నిర్దిష్టమొనరించిరి. వివిధపురుషార్థములను చేబట్టుటకై వివిధాశ్రమములందు నియమబద్ధమైన జీవనమును కడపుటెట్లో గ్రంథకర్త ఇందు వివరించినాడు. వివిధవిజ్ఞాన విషయములందు ప్రాచీ ప్రతీచీ ఖండముల విభిన్న దృక్పథము లెట్టివో ఈతడిందు విశదీకరించినాడు. అధునాతనవిద్యావిధానమందలి లోపముల నీత డెట్లు తెలిపినాడో తిలకింపుడు! ప్రస్తుతకాలమందలి విద్యాపద్ధతులలోసమన్వయ మేమాత్రమును లేకయుండుటచే నిట్టి కుశాస్త్రములకు, కుతర్కములకు ప్రాధాన్య మొసంగును. అందువలననే మన దేశమందును విద్యావంతులమని విఱ్ఱవీగువారు 'భుక్తి కుదిరినగాని ముక్తికుదర' దను మిథ్యాన్యాయములలో వ్యవహారము నడపుచుందురు. ఈ పాశ్చాత్యశాస్త్రములందు ముఖ్యముగ నర్థశాస్త్రముననున్న యీలోపము సర్వప్రపంచమును ప్రస్తుతము కలవరపరచుచున్నది. ముక్తియే జీవితాశయ మని యెన్నబడు నీదేశమున పాశ్చాత్యశాస్త్రవిజృంభణ పిశాచమును విమర్శనా కృపాణముచే ఖండింపవలసిన యావశ్యకత మనకు తటస్థించినది. మానవాభ్యుదయమునకు అక్కరైనవిద్య యెట్లుండవలెనో ఈత డిట్లు తెలిపినాడు! విద్యావిధానములలో ప్రప్రథమమున సాధకునిచిత్తవృత్తులను బాహ్యవిషయములనుండి మరల్చుట ముఖ్యము...(పుట ౪౪) మనకు సహాయమును జ్ఞానమును కావలెను. మనకు జనన కాలమందు కొరవడినట్టియు యుక్తవయసున నవసరములు నగు శక్తిసామర్థ్యముల నిచ్చునది విద్య. ఈ విద్య మనకు ప్రకృతివలన అనగా వ్యక్తులవలనగాని వస్తువుల వలనగాని కలుగును (పుట ౪౫). విద్యావిధానమందు పఠనీయగ్రంథములకంటె సరియగు గురువు లభించుట చాలముఖ్యము. గురువు ప్రత్యక్షదైవము. గురువును చేరుట యనగా మనస్వభావమును (nature) జేరుటయే. ఇదే మన నిజమైనవిద్య. గురువే మన సృష్టికర్త. కావున గురుశిక్షయు నియమమునుసాధన కత్యంతావశ్యకములు. (పుట ౪౬). సాధకుని వ్యక్తిత్వము ననుసరించి శిక్షను గరపవలెను. పాశ్చాత్యవిద్య వ్యక్తిత్వమును నశింపజేయును. (పుట ౪౭). మన సంప్రదాయమున విద్య గురుకులవాసముతో సంపూర్తికాదు. జీవితమంతయు యథార్థముగా మనకు విద్యాలయమే. (పుట ౪౮). మానవమాత్రులచే నిర్మింపబడు విధానము లన్నియు లోపభూయిష్ఠములుగనే యుండును. కాని యట్టిలోపములను చాలవరకు తగ్గించుటయు ప్రజలను ఆధ్యాత్మికమనస్కులజేయుటయు విద్యాపద్ధతులందు వర్తకసరళి లేకుండుటయు మనమార్గముయొక్క వైలక్షణ్యమై యున్నది (పుట ౪౯). జాతియొక్క శిక్షావిధానమంతయు కొలదిమంది వేదజ్ఞులకే వదలివేయుట యత్యావశ్యకము. ఇట్టి గురువులే జనసామాన్యమునకు కావలసిన ఉపాధ్యాయులను, ఆచార్యులను నియమింతురు.

---

*కర్త: ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు. శ్రీమదాంధ్రవిద్యాపీఠగోష్ఠి, బెజవాడ. పుటలు ౧౨౨; వెల ఎనిమిది అణాలు.

మన విద్యావిధానమునకంతకును వేదజ్ఞులగు గురువులే సూత్రకారులై యుండవలెను (పుట ౫౦). విద్యాను ష్ఠానము సాధనచతుష్టయము ననుసరించి క్రమశః నాలుగు ఆశ్రమములు విద్యావిధానమునందు ఏర్పరుప వలసివచ్చెను.

ఆశ్రమ జీవనమునందలి మహత్త్వ మెట్టిదో "Brain of India" అను తనగ్రంథమందు శ్రీ అరవిందయోగి వివరించినాడు. ఈ యాశ్రమములనుగూర్చి శ్రీ గోపాలకృష్ణుడు తెలిపిన అంశములు గమనార్హములు. "జీవితము విద్యాలయము. ఇందు నేర్చుకొనవలసినవి ధర్మార్థకామమోక్షములు. ఈనాలుగు విద్యలలో నాలుగుతరగతులు (Faculties) బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము. ప్రతిక్లాసునకు నాలుగు డివిజనులు. ఇందు బ్రహ్మచర్యము విశేష కాలము నియమింపబడినది. ౫—౭ సంవత్సరములకు చిత్తవృత్తి విజృంభణము ప్రారంభమగును. దీనిని నిరోధింపవలెను. అందులకే అదియంత విశేషకాలము నియమింపబడినవి. సాక్షిత్వస్థితియనగా భరింపగల భర్తృత్వము సిద్ధించినగాని, గార్హస్థ్యమున కర్హులముగాము. బ్రహ్మచర్యమువలన సాక్షిత్వము సిద్ధించును. ధర్మార్థములు గృహస్థాశ్రమమున సాధనచేయవలెను. మోక్షమున ధర్మశాసనుడగుచున్నాడు. వానప్రస్థమున, రససిద్ధ-కామపురుషార్థసిద్ధి రూపకల్పనచేయుట (పుట ౩౮). ఈరీతిగ బ్రహ్మచర్యాశ్రమమందు సాధ్యమగునంతవరకు యోగాంగరూపముగ జితేంద్రియత్వము నభ్యసించినచో నహంకారము సంపూర్ణముగ దొలగి కామక్రోధాదిశత్రువులు దాసులై జీవయాత్రకు సహకారులై యుండును (పుట ౫౮). జితేంద్రియుడైన విద్యార్థి తాను పఠించిన ధర్మముల ననుష్ఠించి, తద్ద్వారా లోకానుభవము సంపాదించి సంపూర్ణవివేకజ్ఞానమును సంపాదించుటకై ద్వితీయాశ్రమ మేర్పడినది, (పుట ౫౫).

హిందూమతమందును, తత్త్వశాస్త్రమునందును విశేషప్రాముఖ్యమునందిన సంచిత, ఆగామి, ప్రారబ్ధకర్మ లెట్టివో వీనినుండి విడివడుటకై మానవుడు చేయవలయు సాధనమేమో ఈతడు స్పష్టపఱచినాడు. "ప్రారబ్ధకర్మ, బ్రహ్మచర్యమం దభ్యసించు యమనియమాదులచే నిర్జింపబడును. సంచితాగామి కర్మలు సంయమాభ్యాసముచేత నశించును (పుట ౫౭). భోగదారిద్ర్యముల యభావము వైరాగ్యము......వైరాగ్యమనగా కర్మలను విడుచుట కాదు, కర్మబద్ధుడు కాకుండుట. వైరాగ్యముజీవునకుధర్మమందుగలపరిపక్వస్థితి సంపూర్ణత్వమును సూచించును (పుట ౬౦).

ఈగ్రంథమందు ఉల్లేఖింపబడిన విద్యావిధానమును శ్రీ గోపాలకృష్ణుడు బందరులోను, ౧౯౨౦ లో క్షీరపురిప్రాంతమున శ్రీమదాంధ్ర విద్యా పీఠమందును నెలకొలుప నడుముగట్టినాడు.

స్త్రీనిగుఱించి ఇందు బహుళాంశములు వివరింపబడినవి. అనునాతనవాతావరణమున నివి యన్నియు శిరసావహింపబడవు. వీనితో నేకీభవింపనివారిసంఖ్య అధికముగా నుండును.

విజ్ఞానమునకు తోడు కార్యదీక్షయందు అసమానప్రజ్ఞగల ఈమహనీయుడు సజీవుడై యుండినచో నేడాంధ్రావనియు, భారతభూమియు నూతనసంచలనము నందియుండును. గోపాలకృష్ణుడు మతావేశముగల ధీరుడు. ఈ యావేశమున కసాధ్య మేదియులేదు. ఆంధ్రులు నేడు గోపాలకృష్ణు నంతగా తలపకుండుట దురదృష్టము. పురోభివృద్ధిని కాంక్షించువారికి ఈగ్రంథమును, "రామదండు"ను అనవరతము చేతియం దుండవలెను. ఎట్టి ఆచార్యుడైనను చిరకాలము మనియుండడు. అతని అంతేవాసులే అతని ఉద్దేశములను దశదిశల వెదచల్లెదరు. గోపాలకృష్ణుని అనుచరులు ఇకనైన ముందంజవేసి, ఆతని మహదుద్దేశములను ప్రజలకు దెలుపుటకై నడుముగట్టవలెను. ఒకవ్యక్తికి మహాబిరుదులిచ్చి ఊరకొనినయెడల, అతడు సంతసింపడు. అతడు చేసి దిగవిడిచిన కర్తవ్యమును నెరవేర్చిననాడే అతడు ఆనందించును. శ్రీ గోపాలకృష్ణుని ఉద్దేశములు సిద్ధించుటకై పలువురు ముందంజ వేసిననాడు ఆ మహాపురుషుని పవిత్రాత్మ దివినుండి వారియుత్కృష్టయత్నముపై పూలవాన కురిపింపగలదు.

---

# కుంకుమ పూవు

వేటూరి శంకరశాస్త్రి

కుంకుమపైరు ఉల్లిపైరువంటిది. దీని మొక్కయు ఉల్లిమొక్కను బోలియుండును. 1½ అడుగుయెత్తువరకు మొక్క పెరుగును. విత్తులను నారుగా పోసి మొక్కలు మొలచిన పిదప విడివిడిగా మడులలో నాటుటవల్లను, దుంపలకు గలిగిన పిలకలను వేరుపరచి విడిగా నాటుటవల్లను సీ పైరు నభివృద్ధిపరుపవచ్చును. దీనిని పైరుచేయుటయందును, పుష్పములను సేకరించి విక్రయమునకై 'కుంకుమపూవు'ను తయారుచేయుటయందును మిగుల శ్రద్ధయు, కష్టమును అవసరమగుచున్నది. ఈ మొక్క అన్ని ఋతువులలోను పెరుగును. తొలకరిని, అనగా జూన్, జూలై నెలలలో నాటినపిలకలు, ఆగస్టు, సెప్టెంబరు నెలలలో పూత ప్రారంభమగును. పైకికనుపడు మొక్కను తెగగొట్టినప్పటికి, భూమిలోపల దుంప నిలువయున్నచో తిరిగి పిలకెత్తును. కుదుళ్లు విస్తరించినకొలదియు పిలకలను తీసి, విడివిడిగా నాటుచుండినచో దీని సంతానము అభివృద్ధి నొందుచుండును.

జన్మతః యిది ఏష్యామైనరులోనిది. హిందూదేశమునందు కాశ్మీరమునను, క్వెట్టా పరిసరప్రాంతములలోను నేడు విరివిగా పైరు చేయుచున్నారు. కాశ్మీరములో నీపంట నింకను అభివృద్ధిపరుచుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. సముద్రమునకంటె ౫౨.౧౦ అడుగుల యెత్తుగల కాశ్మీరదేశపు కొండకనుమలలో, చెట్లుచేమలులేని సమప్రదేశములందు దీనిపంటభూములు గలవు. ఈ పంటకొరకయి ప్రత్యేకమైన భూసార మక్కరలేదందురు. ఒండుమట్టిగాని, బంకమట్టిగానిగల భూభాగమైన చాలును. కాశ్మీరదేశపు పుష్పవాటికలలోకూడ దీనిని చక్కగా పైరు చేయుచున్నట్లు తెలియుచున్నది. కలుపు తీయుచు, అపుడపుడు నీరు పెట్టుచుండినచో బాగా పెరుగును. చల్లని కాలమానముగల తేమభూములయినచో, కుంకుమపైరు శీఘ్రముగా పెరుగును. పుష్కలముగా పుష్పించును. కుంకుమమొక్క ఆకులు అంత వెడల్పులేక సన్నగను, కొంచెము పొడుగుగను ఉండును. ఆకు దుంపదగ్గరనుండియే ఆరంభమగుచు, రానురాను తేలిపోవును. మధ్యపల్లము, అంచులు కొంచెముయెత్తు ఈనె పొడుగునను యించుక తెలుపు గలిగియుండును. మొక్కబలము ననుసరించి పుష్పములు ఒకటిగాని, గుత్తిగాగాని పూయును. పుష్పములు సువాసనతో ఊదారంగుగలిగియుండును. అందు కాండాగ్రము ఎఱ్ఱగాను, కేసరములు పచ్చగాను ఉండును. చేనంతయు పుష్పించినపుడు చూచువారలకు మిగుల ఆనందమును గొల్పుచుండును. మనము ఈ పుష్పములలోని కేసరములనే కుంకుమపూవు

అనే పేరుతో వాడుచున్నాము. అయినప్పటికి పుష్పమంతటికిని అన్వయించు 'కుంకుమపూవు' అనుపేరు దీనికి రూఢిమైనది. ఇతర భాషలలో దీనిని 'కేసర్' అనియే వ్యవహరింతురు.

### పూవును సంగ్రహించేవిధము

ఉదయముననే కుంకుమమడులకు పోయి విచ్చీవిచ్చనిపూవులను సంగ్రహించి, పుష్పమందు అండాశయముచుట్టును, పత్రములకంటెయుండే గర్భకేసరములను కాండాగ్రములను, గోటితోగిల్లి విడతీయగా వచ్చిన పదార్థమును కొంచెము ఆరనిచ్చి జల్లెడలలో ఒక అంగుళము మందమున బోసి, నిప్పులకుంపటిమీద సన్నని సెగను వెచ్చపెట్టవలెను. ఎక్కువగా వెచ్చతగిలినయెడల కేసరములు మాడి నలుపురంగు వచ్చును. వస్తువుచెడును. గోరువెచ్చపెట్టబడిన కేసరములనే తేమలేని చోట, గాలితగులకుండా, దట్టమైన ఊలు సంచులలో నిలువజేయవలెను. ఇట్లు తయారయినదానినే 'కుంకుమపూవు' అని మనము వాడుచున్నాము. కొంచెము వెచ్చగనున్నపుడే, ఏదైన బరువు పెట్టినచో కేసరములు రొట్టెవలె అంటుకొనిపోవును. అట్టిదానిని (Cake Saffron) 'కేసర్ కీ రోటీ' అందురు. విడివిడిగా నున్నదానిని Hay Saffron అందురు. కుంకుమమళ్లు పుష్కలముగా పూచినయెడల ఎకరమునకు ౫౦ మొదలు ౫౫ పౌనుల వరకు పచ్చిసరుకు (పచ్చి కుంకుమపూవు) దొరకును. ఆరినపిదప ౧౦ మొదలు ౧౧ పౌనుల సరకు దిగుమతి యగును. వెచ్చబెట్టి తయారుచేయుసరికి విక్రయమునకుతయారగు సరకు ఒకటి రెండు పౌనులకంటె యెక్కువ యుండదు. కనుకనే ధర యెక్కువగా పలుకును. ఈ పైరుకు యెక్కువగా తెగుళ్లుగూడ తగులును. బూజు, చెవులపిల్లులు, కుందేళ్లు, అడవి ఎలుకలు ఈ పైరుకు ఎక్కువ హానిచేయును.

### రాసాయనికసంయోగము

కుంకుమపూవునందు, ఈక్రింది పదార్థము లున్నట్లు రాసాయనికపరిశోధనవల్ల తెలియుచున్నది :

౧. క్రోసిటిన్ (Crocetin) అనురంగు నిచ్చు పదార్థము.

౨. తిక్తరస విశిష్టమగు నొక పదార్థము. (Bitter substance.)

3. కొవ్వు (Fatty oil).

౪. సారవంతమగు లఘుతైలము (Essential oil).

కుంకుమకేసరములు నీటిలో కొంతవరకే కలియును. సారాయిలోను, ఉప్పటి ద్రవములలోను బాగా కలిసిపోవును.

### గుణములు

పాచనము (Stomachic) ఆహారమును జీర్ణింపజేయును. కఫహారము (Antispasmodic). కఫమునుకరిగించి కండరముల పట్టును సడలించును. ఉత్తేజకము (Stimulant). నరములకు చురుకును బుట్టించును. వాజీకరణము

(Aphrodiasic). కామవికారమును హెచ్చించి, శుక్రవృద్ధిని కలిగించును. సువాసనతో కొంచెము కారు, చేదుగల రుచియుండును. చప్పరించిన నాలుక ఎఱ్ఱబడును. నోటిలోని ఉమ్మి (Saliva) కూడా ఎఱ్ఱబడును. ఉష్ణ వీర్యముగలది. శ్లేష్మమును, వాతమును హరించి, దుర్గంధమును బోగొట్టును. శరీరమునకు కాంతినిచ్చును. విషహారము.

ఉపయోగములు

దేశీయ వైద్యమునందు దీని ఉపయోగము ఎక్కువగాగలదు. ఆయుర్వేద వైద్యమునందుకంటె యూనానీవైద్యమునందు దీని ప్రయోగము విరివిగా నున్నది. పాశ్చాత్య వైద్యమునందు దీని ఉపయోగము లేదనియే చెప్పవచ్చును. ఉన్నను రంగు వచ్చుటకు, సువాసనగా నుండుటకు, ఔషధములలో కలుపుదురే కాని, ఇంతకుమించిన గుణము నపేక్షించిగాదు. మనదేశమున కొన్ని పిండి వంటలయందు దీనిని వేయుదురు. లడ్డు, జిలేబీ, హల్వా, కేసరీభాత్, పాయసము ఇత్యాదులలో ఇది కలియును. జీర్ణకారి యగుటచేతను, సువాసనతో రంగునిచ్చునది యగుటచేతను దీనిని కలుపుదురు. ప్రత్యేకము ఔషధముగా ౧ మొదలు 3 గ్రెయినులవరకు దీనిని వాడవచ్చును. గర్భాశయవ్యాధులలో దీనిని వాడిన, గర్భాశయమును శుభ్రపరిచి, దాని కండరములకు పుష్టిని గలిగించును. ప్రసవమైనవెంటనే మైల సరిగా నడుచుటకై, కుంకుమపూవును గ్రుక్కెడు వేడినీటిలో కలిపి త్రాగించు నాచారము కలదు. ఆర్తవము సరిగా ప్రవర్తించనపుడు దీనిని కణికెలుగా చేసి (Pessaries) యోనిద్వారమున గర్భాశయము నంటునటులగూడ నుంచెదరు. ఇందువల్ల ఆర్తవము సరిగా నడుచును. దీనిని నీటితో నరగతీసి తలనొప్పులకు పట్టుగా గూడ వేయుదురు. మానని పుండ్లకు పైపూతగాకూడ వాడుకలో నున్నది. జ్వరములు, యకృద్వ్యాధులు, తమకశ్వాస (Asthma), పసిపిల్లలకు గలుగు జలుబు, పాండురోగము, శుక్రక్షీణము వీనిలో ఇతర ఓషధ ద్రవ్యములతో కలిపి వైద్యులు ఉపయోగించుచున్నారు. కీళ్లనొప్పులకు, నరముల తీపులకు, పసిపిల్లలకు గలుగు అజీర్తి విరేచనములకు ఒకటిరెండు గ్రెయినులు నేతితో కలిపి యిచ్చిన గుణ మీయగలదు. పంజరములలో పెంచబడు పక్షులు, సుస్తీగానుండి, ఈకలు రాల్చుచున్నయెడల కుంకుమపూవును చెంచాడు నీళ్లలో కలిపి త్రాగించిన యెడల ఈకలురాలుట ఆగిపోయి, ఆరోగ్యవంతము లగును. కొందరు స్త్రీలు గర్భవతులుగానున్నప్పుడు, తమకు కలుగబోవు శిశువులు ఎఱ్ఱగానుండుటకై కుంకుమపూవును వెన్నపూసలో కలిపి తిందురు. ఇట్లు సేవించినయెడల తాము (తల్లితండ్రులు) నలుపువారైనప్పటికి పిల్లలు ఎఱ్ఱగా జన్మింతురని వారి భ్రమ. ఇం దేమైన నిజము కలదేమో పరీక్షించి చూడవలసియున్నది.

దీని సేవనమువల్ల మూత్రము ఎఱ్ఱగా వచ్చును. చరక, సుశ్రుతులు అశ్మరీ, మూత్రకృచ్ఛ్ర, మూత్రాఘాతములందు దీని ఉపయోగమును వివరించియున్నారు. మరియు శిరోరోగములందు నస్యముగాను, శరీరకాంతికరముగాను దుర్గంధహరముగాను తైల, లేపన రూపమున కొన్ని యోగములు గలవు. వాత్స్యాయన మహర్షి కామసూత్రములందును స్త్రీలకు ముఖాలేపములలో దీనిని ప్రయోగించియున్నాడు.

కఱ్ఱకు, పెట్టెలకు రంగు వేయుటకై ఉపయోగించు ఈ క్రిందియోగములో కుంకుమపూవు గలదు. ఈ రంగు చాలకాలమువరకు చెడక, నిగనిగ లాడుచుండును.

మెథిలేటెడ్ స్పిరిట్సు ౧౦ ఔన్సులు
రూమిమస్తకి ౨ తులములు
అటుకుల లక్క ౫ తులములు
సీమ గుగ్గిలము ౨ న్నర తులము
రోజను ౧ తులము
పటిక ౨ తులములు
కుంకుమపూవు సరక తులము

స్పిరిటులో మిగిలినవస్తువుల నన్నిటిని కలిపి ఎండలోనుంచిన క్రమముగా నన్నియు స్పిరిటులో కరిగిపోవును. తదుపరి శుభ్రమైన గుడ్డతో ఈ రంగును కావలసిన కఱ్ఱవస్తువులకు పూతలు పూయవలెను. హిందువులు దైవారాధనావిధులగు హోమాదులందును కుంకుమపూవును వాడుదురు. 'ముల్లా' లను మతగురువులు మంత్రములను వ్రాయుటకై కుంకుమపూవుసిరాను వాడుదురు. తాంబూలచర్వణమున గూడ కుంకుమపూవు వాడుక కలదు.

ధర

కుంకుమపూవుధర దాని జన్మదేశము, సువాసన, కేసరముల నిడివి, మందము మొ॥ టినిబట్టి యుండును. దానినుంచిచెడ్డల ననుసరించి పౌను ౧ కి రు. ౮౦ మొదలు రు. ౨౦౦ ల వరకు నేడు ధర పలుకుచున్నది. మన దేశమున పంజాబునుండియు, కాశ్మీరమునుండియు ఈ వర్తకము సాగుచున్నది. కాశ్మీరమునుండి ప్రతియేట ౧౫౦౦ ల పౌనుల కుంకుమపూవు తయారగుచున్నట్లు తెలియుచున్నది. ౧౯౨౨-౨౩ సం. లో రు. ౧౨, ౨౬, ౦౭౦ ఖరీదుగల ౪౦, ౬౮౧ పౌనుల కుంకుమపూవు విదేశములనుండి మన దేశమునకు దిగుమతి మైనది. నేటివరకు స్పెయిన్ (Spain) నుండియు, ఫ్రాన్సు (France) నుండియు కుంకుమపూవు అన్ని దేశములకు రవాణా చేయబడుచున్నది. మన దేశమున ఎక్కువగా స్పెయిన్ కుంకుమపూవే ఖర్చుపడుచున్నది. మనకు లభించు రకములలో దీనికే ధరయు ఎక్కువగా నున్నది. ఇటీవల క్వెట్టాపరిసరములలో పండింపబడు కుంకుమపూవు స్పెయిన్ దానితో సరిసమానముగా నున్నదని కొందరు చెప్పచున్నారు.

కల్తీపద్ధతులు

వర్తకులు అనేక విధముల కుంకుమ పూవును కల్తీ చేయుదురు. తేమగల ప్రదేశములలో నిల్వచేయుటవల్లను, పచ్చి ఆకులలో పొదిపియుంచుటవల్లను, మెత్తగా నూరిన ఎఱ్ఱమన్ను, నూనె కలిపి కేసరములకు పట్టించుటవల్లను రంగువచ్చి నిగనిగలాడుచు, తూకము హెచ్చుగాతూగును. కుసుంబాపూవుల (Carthamus tinctorious) మొగ్గలను యొండనిచ్చి, కుంకుమపూవులో కలిపిన కలిసిపోవును. ఎండిన గోరింటపూవులు, మొక్కజొన్న కంకులపైనుండు ఎఱ్ఱటిపీచులు, దేవదారుచెక్కలనుండి వచ్చు సన్నని చిత్రికపోట్లు వీటికి ఎరుపురంగు వేసి కుంకుమ పూవులో కలిపియు విక్రయింతురు.

ఆయుర్వేద గ్రంథములందు కుంకుమ పూవు కాశ్మీరజ, బాహ్లీకజ, పారశీకజము లని మూడువిధములుగా వర్ణింపబడియున్నది.

౧. కాశ్మీరదేశమున బుట్టినది మిక్కిలి మెరుపు, చిక్కన. పొడవుగల కేసరములు. తామరపూల వాసనగలిగి, ఇంచుక చమురుతో నుండును. ఇది ఉత్తమమైనది.

౨. బాహ్లీక (Central Asia) దేశమున బుట్టినది పాండువర్ణము, మొగిలిపూలవాసన, సన్నటి కేసరములు గలిగియుండును. ఇది మధ్యమము.

3. పారశీకదేశమున బుట్టినది తెలుపు వర్ణము, లావాటి కేసరములుగలిగి మధుగంధ యుతమై యుండును. ఇది అధమమైనది.

స్థిరమైన ఎరుపురంగు గలిగి, చేతికి రంగు అంటుకొనుచు, నోటిలో వేసుకొనినను, నీటిలో వేసినను క్రమముగ కరగునది మంచిది.

ఈ క్రింది వైద్యయోగములందు కుంకుమ పూవు కలియుచున్నది. కుంకుమాది లేపము, కుంకుమాది తైలము, దేవకుసుమరసాయనము, ఆకారకరభాదివటి, నాగవల్లభరసము ఇత్యాదులు

References:—

1. Indigenous drugs of India by Coopra. Lt. Col.

2. Commercial drugs of India by Dutt

వైద్యక శబ్దసింధు



యముడు సత్యవంతుని ప్రాణముల నొసగుట






# శ్రీయుత
# చిలుకూరి వీరభద్రరావుగారు

రాయసం వేంకటశివుడు

పుస్తకరచనా, పత్రికా సంపాదకత్వములు వృత్తిగఁ జేకొనినవారు ఆర్థిక కష్టములె యార్జించుకొనెద రను సూత్రమునకు ఆంధ్ర దేశమున శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు గారిని మంచి యుదాహరణముగఁ జేర్కొన వచ్చును. ఐనను ధనాభావము వారి నెన్నఁడును గ్రంథరచనముపట్ల విముఖునిఁజేయ లేదు. మీఁదుమిక్కిలి ధన మాడెడి చేతిలోఁ గలమాడుట కంతగ నవకాశము గలుగదని గుర్తెఱిఁగియె ఆయన భాషాసేవను జీవితనియమముగఁ జేసికొని పేదఱికమును సంతోషమున స్వీకరించియున్నారు !

## బాల్య దశ

పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాలోని రేలంగిగ్రామము పూర్వమందు నాకువలెనే వీరభద్రరావుగారికిని స్వస్థలము. ఇద్దఱమును సమాన వయో, మనోరథముల నొప్పిన యాబాల్యసఖులము. వీరభద్రరావు గారు ౧౭-౧౦-౧౮౭౨వ తేదీని పెనుమదమను గ్రామమున జన్మించిరి. ఆఱువేలనియోగి బ్రాహ్మణులు. జననీజనకు లిద్దఱును సాధు సజ్జనులు. తండ్రి వీరరాజుగారు తణుకు పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగ నుండి ౧౮౮౦ లో న్యాయవాదు లయిరి. వీరభద్రరావుగారికి మిక్కిలి చిన్నతనముననే యొక గొప్పగండము గడచిపోయెను. ఆతేండ్ల యక్క చేతినుండి యా యాఱునెలలబిడ్డఁ డొకనాఁడు చలిమంటలోఁబడి ప్రాణావశిష్టుఁడయ్యెను ! అంతట పదవయేఁటఁ బిల్లవానిని తండ్రి రాజమహేంద్రవరమునకుఁ గొని పోయి, కలసికొనిపోయిన వానిచేతి వ్రేళ్లు శస్త్రముచేయించి విడఁదీయించిరి. రచయిత చేతికిఁ జన్ననాఁడె యెట్టిశోధన !

౧౮౮౦-౮౬ ల మధ్య వీరభద్ర రావుగారు తణుకులో విద్యాభ్యాసము చేసిరి. ఒక గురువుసాయమున పదునాలుగేండ్లకె పురాణములసారము వీరు గ్రహింపఁగలిగిరి. ౧౮౮౬న వివాహము జరిగెను. ౧౮౮౮, ౮౯లలో నరసాపురముననుు, మఱుసటి వత్సరమున రాజమండ్రిలోను ప్రవేశపరీక్షకుఁ జదివిరి. ౧౮౮౮లో జనకుఁడు కీర్తిశేషుఁ డగుటచేత సంసారకష్టములు వీరిని వేధింప మొదలిడెను. పండ్రెండువేలరూపాయలవఱకును పూర్వఋణములు పెరిఁగిపోయెను. కుటుంబయాజమాన్యమున మామమేనమామల కిద్దఱికిని ద్వంద్వయుద్ధము సాగెను. కాని సంరక్షకులకుఁ బోరాటము జరుగుచుండెడి యీసంక్షోభకాలమె వీరభద్రరావుగారు హాయిగఁ బుస్తకపఠనముచేసి తమ భావిజీవిత ప్రణాళిక నేర్పఱుచుకొనుట కనుకూలసమయ మయ్యెను !

హృదయమునఁ దాను గురుతుల్యునిగ భావించిన కీ. శే. కందుకూరి వీరేశలింగకవిగ్రంథము లన్నియును ౧౮౮౮-౧౮౯౨ సంవత్సరముల మధ్య వీరభద్రరావుగారు పఠించి ఉన్నతాదర్శము లలవఱుచుకొనిరి. ౧౮౯౨ నం దాకవి సంగ్రహజీవితము వ్రాసి గ్రంథవిమర్శనముచేసి, "ఆంధ్రప్రకాశిక" యందొక వ్యాసమును బ్రచురించిరి. వీరభద్ర రావుగారు తీవ్రసంస్కరణాభిమాని యని గ్రహించియుండుటచేత నే నా మిత్రులు నేనును ౧౮౯౪ సంవత్సరమున రాజమండ్రిలో వీరేశలింగముపంతులుగారి సహాయమున నెలకొల్పఁబూనిన "ఆస్తికపాఠశాల" లోఁ బాల్గొన సంసిద్ధముగనుండుఁడని నేనాకాలమున వీరి నాహ్వానించి హెచ్చరించుచుండువాఁడను. ఆవిద్యాశాలాస్థాపన మప్పటి కాకాశకుసుమమైపోఁగా ౧౮౯౫లో వీరభద్రరావుగారు ఏలూరుపుర మేఁగి శ్రీసత్తిరాజు సీతారామయ్యగా రచట నడుపుచుండు "దేశోపకారి" పత్రికకు సహాయసంపాదకు లయిరి. కాని ౧౮౯౬ తుదిని ఇరువురకును సంస్కరణవిషయములం దభిప్రాయభేద మేర్పడుటవలన వీరభద్రరావుగారా పదవి విడిచి ఆపట్టణమందలి "సుబుధరంజనీ" పత్రికకు సంపాదకత్వము వహించిరి. ఐన నాలు నెలలలోనె, ఆయుద్యోగమును వీరు విరమించి వెనుకటి "దేశోపకారి" పత్రికను సీతారామయ్యగారియొద్దనుండి కైకొనిరి. ముద్రాలయ మొకటికొని దానికి సంఘసంస్కర్తల కాదర్శపురుషుఁడైన విద్యాసాగరుని పేరిడి అందు "దేశోపకారి" పత్రికను ౧౮౯౭-౯౮లలో సొంతముగఁ బ్రచురించిరి.

### బెజవాడ నివాసము

ఆకాలమున బెజవాడలో నుపాధ్యాయుఁడనై స్త్రీవిద్యాభివృద్ధికై "జనానాపత్రిక"ను సాగించుచు సంఘసంస్కరణవిషయము లాపత్రికలో విపులముగఁ జర్చింపవలనుపడక వేఱొక వారపత్రికను వెలయింప నేను గాంక్షించుచుంటిని. ఆశయములం దేకీభావముగల యీ ప్రాంతమిత్రునిమీఁద

నాకను లంతట పడెను. ౧౮౯౭ తుదను ఏలూరిలో వీరభద్రరావుగారిని గలసికొని, ఈ సంగతినిగుఱించి వారితో దీర్ఘసంభాషణము జరిపితిని. పూర్వాచారపరాయణులకుఁ బట్టు గొమ్మయగు నేలూరువిడిచి సంస్కరణానుకూలావరణమునఁ జెన్నొందు బెజవాడకు వీరభద్రరావుగారు విచ్చేసినచో, ఉభయుల మును మాయిచ్చవచ్చినచొప్పున సంస్కరణ కార్యక్రమమును కొనసాగింపఁగల మని విశ్వసించితిమి. కావున ౧౮౯౮ ఫిబ్రవరిలో వీరభద్రరావుగారు తమ ముద్రాలయముతో బెజవాడకు వచ్చిరి. కొత్తపేటలో వారి ముద్రాక్షరశాల నెలకొల్పఁబడెను. గవర్నరుపేటలో నేనుండు బంగాళాలో నొకభాగము కొలఁదికాలములోనె నా మిత్రునికి నివాసమయ్యెను నూతనాశయముల కనుగుణముగ నూతననామమున నొక వారపత్రికను మా యిరువుర సంపాదకత్వమునను వెలువరింప సమకట్టితిమి. ఆయాంధ్రాంగ్ల పత్రికకు "ఆంధ్రదేశాభిమాని" యని నామకరణము చేసితిమి. కాని నాయాంగ్లవ్యాసము, వార్తావ్యాఖ్యలును గల కాగితములుసరిచూడుఁడని మిత్రులు శ్రీరఘుపతి వెంకటరత్నము నాయఁడు గారికిఁ బంపి, నేనెన్నిదినములు వేచి యున్నను, బందరునుండి నా కవి తిరిగిరానే లేదు! మేమంతట పత్రికాప్రచురణమె విరమించుకొనుటకుఁ గారణ మిదియె కాదు. నూతనప్రదేశమున ప్రజామోద మందవలసిన ముద్రాలయమందు ముందుగనె సంస్కరణ ప్రబోధము సలుపు పత్రికను బ్రచురించుట యలౌకికకృత్యమేమోయని మాభయము! మా "దేశాభిమాని" పత్రిక యంతతోనె యంతరించినను, ఆపురమునను కొంతకాలము నుండి కీ. శే. దేవగుప్తాపు శేషాచలరావు పంతులుగారిచేఁ బ్రకటితమగు "కృష్ణావృత్తాంతినీ"పత్రిక కది నూతన నామధేయమై కొంతవఱకుఁ గృతార్థత నందెను!

క్రొత్తచోటికివచ్చి, క్రొత్తచెలికాండ్ర చెట్టపట్టినను వీరభద్రరావుగారు ప్రాంతవెతల బారినుండి తప్పించుకొనలేకపోయిరి! ఒక టొకటియె పిత్రార్జితభూము లమ్మివైచి ఋణవిముక్తుం డగుట కాశించిరి. కాని, యీ ప్రయత్నములలో తఱచుగ బెజవాడ విడిచి యీయన రేలంగి పోవలసి వచ్చుచుండెను. కావున క్రొత్తచోటఁ గుదురుపడని యీ ముద్రాలయమందలి పనులు సరిగా జరుగకుండెను. ౧౮౮౮ జనవరి మొదలు నా "జనానాపత్రిక" "విద్యాసాగర" ముద్రాలయమందె యచ్చుపడుచుండినను ఆచిన్న నెలపత్రికపనితోనే యచటి పనివారు తెమలలేకుండిరి! యజమానుఁడు దూరప్రదేశమున కేఁగుచుండుటయు, సొంతపనులందు మునిఁగియుండి ముద్రాలయ కార్యకలాపము తెలియని నాబోటివాఁ డచట నధ్వర్యము జరుపుటయు నూతనగాఁగొని ముద్రాక్షరశాలా సేవకులు రాతులేని గుఱ్ఱమైపోయిరి! ఆ ముద్రాలయ పరిపాలనమందలి నాఁటి యరాజకస్థితిని సూచించు నొకచిన్న

యుదంత మిచటఁ దెలిపెదను. మిత్రులగు శ్రీ వింజమూరి భావనాచార్యులుగారు తమ యాజమాన్యమున జరుగు మంగళగిరి దేవస్థానమునకుఁ గొన్ని "రశీదు" పుస్తకములచ్చువేయుఁడని "సమూనా" యిచ్చిరి. ముద్రితములయిన కాగితము లన్నియుఁ బుస్తకములుగఁ గట్టఁబడినపిమ్మట లోపలఁ జూడఁగ "కేశఖండనము" అను మాటకు బదులుగ "కేశవఖండన" మని యచ్చుపడి యుండెను! అచ్చుకూర్చువాని పాండిత్యప్రభావమునఁ గలిగిన యీ పొరపాటు ఆ వైష్ణవసంస్థమీఁదఁ బగతురు బుద్ధిపూర్వకముగ విసరిన రాయివలెఁ దోఁచెను!

ఐనను, బెజవాడలో మేమిరువురమును వ్యర్థకాలక్షేపము చేయలేదు. మాకుఁ బ్రియమగు భాషా సంసేవనమునుగూర్చియు, మత సంఘసంస్కరణములను గుఱించియును మేము ప్రాయికముగ సంభాషించుకొనుచుండువారము. నాపత్రిక కాయన వ్యాసములు వ్రాయుచుండువారు. "సుమిత్ర" యను కథ వారిటులాపత్రిక కాకాలమున వ్రాసినదియె. ఆయనమూలమున నాకును, నామూలమున వారికిని నూతనమిత్రు లేర్పడిరి. ఇట్టి క్రొత్తనేస్తులలో నొకరగు కీ. శే. వల్లూరి బాపిరాజుగారు రచించిన "సుగుణమణి" నాటక మపుడు "జనానాపత్రిక"లోఁ బ్రకటితమయ్యెను.

వీరేశలింగముగారితోడి సహకారము

ఐనను, బెజవాడనివాసము వీరభద్రరావుగారికి మొత్తముమీఁద లాభదాయకము గాకుండెను. కావున ౧౯౦౧-వ సంవత్సరమం దాయన ఏలూరునకు వెడలిపోయి, చేరువనుండు పెదపాడులోఁ గొంతభూమికొని యచట నివసించిరి. ఇచటనే వీరి యిద్దఱు కొమార్తెలలోఁ బెద్దపిల్లకుఁ బెండ్లియయ్యెను. పిమ్మట ౧౯౦౩లో వీరభద్రరావుగారు తిరిగి ఏలూరువచ్చిరి. అదివఱకు వీరు "హిందూ సంసారి" వంటి చిన్నచిన్న పుస్తకములె రచించిరి. ఇపుడు "జీర్ణకర్ణాటకరాజ్యచరిత్ర" మను పెద్దపుస్తకము నొకటి వ్రాసి ప్రచురించిరి.

వీరభద్రరావుగారి యున్నతాశయములకెల్ల నిదానమనఁదగు వీరేశలింగము పంతులుగా రాకాలమున నుద్యోగవిరామము చేసి, చెన్నపురినుండి రాజమండ్రికి సకుటుంబముగఁ దమ "చింతామణి" ముద్రాలయముతోఁ దరలివచ్చి ఆ పురమున ధర్మసంస్థ లొకకొన్ని నెలకొల్పిరి. వీనిలో నెల్ల వీరభద్రరావుగారి కధికముగ నాకర్షకమైనది "సత్యవాదినీ" పత్రిక. ఇపు డచటి కేఁగి, చిన్ననాఁటినుండియుఁ దన యాశయముల కాశ్రయమగు పంతులుగారి పవిత్రసాన్నిధ్యమున నధివసించి, ఆయనకుఁ జేయూఁతయై నిలిచి, చరితార్థతఁ గాంచవలె నని వీరభద్రరావుగారి యాకాంక్ష! ౧౯౦౫ నం దీ యువకుఁడు రాజమహేంద్రవరము చేరుటయె, అతఁడు పంతులుగారి ముద్రాలయమున కధికారి యగుటయు, "సత్యవాదినీ" పత్రికా కార్యనిర్వాహకులలో నొకఁడగుటయును!

అత్యుత్సాహమునఁ దనవిధుల నెఱవేర్ప నీతఁడు వేగిరపడెను.

కాని, దూరపుభక్తులకు హృదయ పారవశ్యము గలిగించు వీరేశలింగకల్పతరువు చేరువఁ జేరిన శిష్యగణమునకుఁ గంటకవృక్ష మగుచువచ్చెను! మొదటనే పత్రికా సంపాదకత్వమున సర్వస్వతంత్రత ననుభవించిన యాజవ్వనుని కంతకంతకుఁ దగిలింపఁబడిన సంకెలలు పెచ్చుపెరిఁగెను. అమితాశాభంగమందిన వీరభద్రరావుగారు పంతులకార్యాలయమున వీడ్కోలందిన స్వల్పకాలమునకె "చింతామణి" ముద్రాలయము కీ. శే. సత్యవోలు గున్నేశ్వరరావుగారి కమ్ముడువోవుటయు, అచట మరల వీరభద్రరావుగారు కార్యనిర్వాహకు లగుటయును దటస్థించెను. ౧౯౦౭-వ సంవత్సరమున గున్నేశ్వరరావుగారు స్థాపించిన "ఆంధ్రకేసరి" పత్రికకు వీరభద్రరావుగారు సంపాదకులయి కడుసమర్థతతోఁ దమపత్రికను నిర్వహించిరి.

ఆంధ్రులచరిత్ర

ఇంతవఱకును వీరభద్రరావుగారు జీవితమందలి తమ ముఖ్యకార్యమునకుఁ గడంగనేలేదు. ఐనను, పత్రికావ్యాసములు, స్వల్పగ్రంథములును లిఖించు సందర్భమందుఁ జేకూరిన యనుభవము, వారు జీవితపరమార్థముగఁ జేకొనిన చరిత్రరచనాసౌధమునకు సోపానముగ నుపకరించెను. చెన్నపురి కేఁగి, అచటి ప్రాచ్యలిఖితగ్రంథ భాండాగారమునఁ గొంతకాలము గడపినచో, ఆంధ్రదేశపుఁ బూర్వకథను దానామూలాగ్రముగ గ్రహించి వర్ణింపవచ్చునను మహదాశయముతో వీరభద్రరావుగారు ౧౯౦౯లో నచటి కేఁగి, నాలుగేండ్లు గడపిరి. దీని పర్యవసానము, ౧౯౧౦ లో "ఆంధ్రులచరిత్ర" ప్రథమ భాగమును, ౧౯౧౨ లో ద్వితీయ భాగమును చెన్నపురిలోఁ బ్రచురమయ్యెను. ఈ పుస్తక ప్రకటనసందర్భమున వీరభద్రరావుగా రెంతో ప్రయాసమునకు లోనయిరి. ఆంధ్రజనుల చరిత్రము ప్రత్యేకగ్రంథరూపము దాల్చుట కిదితొలిసారి యగుటచేత, దేశారాధకు లీపుస్తకమును జూచి సంతోషమున నుప్పొంగిపోయిరి. ప్రజలయుత్సాహము కార్యగతమగుటమాత్రమె కష్టతరమయ్యెను! గుంటూరునకుఁ గ్రొత్తగవచ్చిన నేను, నా మిత్రులగు శ్రీకొండ వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లయొద్దకు వీరభద్రరావుగారిని దోడ్కొనిపోయి, వారియుద్యమమును గూర్చి చెప్పితిని. ఒక్కొక్కర మేఁబదిరూపాయలు మాత్రమే పుస్తకప్రథమభాగ ప్రచురణసందర్భమున మే మాయనకు విరాళమీయఁగలిగితిమి. అంతట నేనొక లక్షాధికారిదర్శనముఁ జేసి, భాషాయోషకు నూతనాభరణమయిన యీ కృతిని బరిపోషించి, తమ కీర్తి నాచంద్రతారకముగఁ జేసికొనుఁ డని వేఁడితిని. నా ప్రార్థన మాలక్ష్మీపుత్రుని చెవుల కెక్కలేదు! నా కంతగఁ బరిచితులు గాకు

న్నను, ఈ మిత్రునిగూర్చి నేఁజేసిన విన్నప మాలకించి కీ. శే. మొక్కపాటి సుబ్బారాయఁడుగారు తోడనే తమసానుభూతిని దెలిపి, పీఠికాపుర సంస్థానమునుండి వీరభద్రరావుగారికి నూఱురూపాయలు విరాళ మిప్పించిరి.

ఈ గ్రంథప్రచురణవిషయమై వీరభద్రరావుగారికి సాహాయ్యము చేసినవారలలో కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగా రగ్రగణ్యులు. పుస్తకమును తమ "విజ్ఞానచంద్రికామండలి గ్రంథమాల" కొక కుసుమముగ గ్రహించి ప్రచురించుటయేకాక, మునగాల సంస్థానాధీశ్వరులగు శ్రీ రాజా నాయని రంగారావుబహద్దరుగారితోఁ జెప్పి, వారిచే ద్రవ్యసాహాయ్యముఁ జేయించిరి. "ఆంధ్రుల చరిత్ర" ప్రకటనభాగ్య మిటు లాంధ్రావనికిఁ గలుగుటకును, ఆంధ్రరచయితలలో వీరభద్రరావుగారిపేరు సుస్థిరముగఁ బ్రతిష్ఠితమగుటకును లక్ష్మణరావుగారే ముఖ్యకారకులు. ఆసుశీలుని యకాలమరణము వీరభద్రరావుగారి భావిపుస్తకరచనమునకేకాక, ఆంధ్ర సారస్వతాభ్యుదయమునకును గొప్ప వ్యాఘాతము గలిగించెను.

<u>ప్రస్తుత ప్రయత్నములు</u>

౧౯౧౩ లో మరల వీరభద్రరావుగారు రాజమండ్రిలోఁ బ్రవేశించిరి. ఇచటనే గున్నేశ్వరరావుగారికి "భారతవీరులచరిత్రములు"ను వ్రాసియిచ్చిరి. ఈ పుస్తకమందలి రెండుభాగము లిటీవల ప్రచురమయ్యెను. ౧౯౧౬లో "ఆంధ్రులచరిత్ర" తృతీయ భాగము ప్రకటింపఁబడెను.

ఈ లోపుగ వీరభద్రరావుగారి పెద్ద కొమార్తె యాకస్మికమరణ మందెను. ద్వితీయపుత్రికభర్త కొవ్వూరిలో న్యాయవాది యగు శ్రీయుత మామిడన్న వెంకటసుబ్బారావుగారు. ఒంటరిగ నుండనొల్లక, వీరభద్రరావుగా రంత ౧౯౧౭ సంవత్సరమున సకుటుంబముగఁ దమ యల్లునియింటికి వెడలిపోయిరి. నాఁటినుండి నేఁటివఱకును, కొవ్వూరిలోని వెంకటసుబ్బారావుగారి భవనము వీరభద్రరావుగారికి సకలోపచారములును జరుగు విడిదియై స్వగృహమునకంటె వేయిమడుంగులు శాంతిసౌఖ్యము లొసంగుచున్నది! అల్లుఁడు కూఁతురు మనుమలు మనుమరాండ్రును ప్రేమగౌరవములతోఁ దన్నుఁ బరివేష్టించియుండఁగా, సంపూర్ణచిత్తశాంతి ననుభవించుచు, వీరభద్రరావుగారు ఆంధ్ర సారస్వతాభ్యున్నతికై పాటుపడుచున్నారు.

౧౯౧౬ లోఁ బ్రచురమైన వీరి "నాయకురాలిదర్పము", "కర్ణసామ్రాజ్యము"ను చారిత్రకనవలలు. "మనోరమ" పత్రికలో ముద్రితమయిన "స్వయంసహాయము" ప్రథమభాగమును, ౧౯౧౭-౧౮ లలోఁ బ్రకటితమయిన "తిమ్మరుసు," "తిక్కన సోమయాజి," "శ్రీనాథకవి"యును, ౧౯౩౦లో వెలువడిన "అళియరామరాయలు"ను వీరి యిటీవలి పుస్తకములు. వీని యన్నిటియందును గ్రంథకర్త యపార

చారిత్రకపరిజ్ఞానము, సునిశిత విమర్శనా నైపుణ్యము, రమ్యరచనాచమత్కృతియును విస్పష్టమగుచున్నవి. ఆంధ్రజనులు వీరి భాషా సేవను గ్రహించిరనుట స్పష్టము. వీరి పుస్తకములు పరీక్షలకుఁ బఠనీయగ్రంథములయ్యెను. ౧౯౨౮లో నంద్యాలలో శ్రీయుత సర్ రాధాకృష్ణయ్యగారి యాజమాన్యమున జరిగిన ఆంధ్రమహాసభలో వీరభద్రరావుగారికి "ఆంధ్రచరిత్ర చతురానన" యను బిరుద మొసంగఁబడెను. ౧౯౩౨ మెయి ౨౫వ తేదీని చెన్నపురి రానడేభవనమున శ్రీ ఉయ్యూరురాజావారి యధ్యక్షతను జరిగిన మహాసభలో వీరి కొక వినతిపత్రము సమర్పింపఁబడెను.

తమ "ఆంధ్రులచరిత్ర" నామూలాగ్రముగఁ బరిశోధించి దానిలోఁ బెక్కులు నూతనాంశములు చేర్చి పదిభాగములుగ నీ గ్రంథమును వీరిపుడు పునర్ముద్రితముఁ జేయ సంకల్పించియున్నారు. ఒరుల యాజమాన్యమునఁగాక సొంతముగనే తా మీగ్రంథమును బ్రచురింపఁబూనియున్నారు. వచ్చులాభమంతయుఁ దామె మూటగట్టుటకుఁగాదు వీరిట్లు చేయుచుండుట. చరిత్రకారుఁడు గ్రంథపరిశోధనాసందర్భమున సత్యము లని నిర్ధారణ చేసికొనినసంగతులు వెలువరించుపట్ల బిడియములు, మొగమోటములును లేక ఖండితముగఁ జెప్పనప్పుడె యే దేశపు సత్యచరిత్రగాని వ్యక్తముకాఁగలదని వీరిప్రబల విశ్వాసము. ఐన నీ గ్రంథప్రచురణసందర్భమున నెవరెంత ద్రవ్యసాహాయ్యము చేసినను స్వీకరింప వీరు సంసిద్ధులె. పుస్తకమందలి పది సంపుటములలోను ఐదవదియగు "కాకతీయాంధ్రరాజయుగచరిత్ర" మిక్కిలి చక్కనిదని యెంచి వీ రిది ముందుగఁ బ్రచురించుచున్నారు. త్వరలోనె యిది సిద్ధమగును. పిమ్మట రెండురూపాయలు వెలగల యీపెద్దపుస్తకము ఇపుడు చందాచెల్లించువారి కొక రూపాయికె యొసఁగఁబడును. అంతటినుండి రెండేసినెలల కొకసంపుటము ముద్రిత మగుచుండును.

దేశాభిమానులు, భాషాపరిపోషకులును వీరభద్రరావుగారి సదుద్యమమునకుఁ దగు ప్రోత్సాహము గలిగింపవేఁడుచున్నాను. వీరి సత్సంకల్పమునకు సంపూర్ణ విజయము చేకూరుఁగాక!

[చిలుకూరి వీరభద్రరావు పంతులుగారి 'కాకతీయాంధ్రయుగ చరిత్రము' ప్రకటనము ప్రక్కపుటలో ముద్రితమయినది. ఆంధ్రు లెల్లరు శ్రీ పంతులుగారి ప్రయత్నము నెడ నాదరమును చూపి అమూల్య ప్రతిఫలముగా "ఆంధ్రులచరిత్రను" బడయుదురు గాక!

సం. భారతి.]

## ఆంధ్రమహాజనులకు విజ్ఞప్తి

# ఆంధ్రుల చరిత్రము ౫వ భాగము

# కాకతీయాంధ్రయుగ చరిత్రము

### ౪౦౦ పుటలు గలిగి కాలికోబైండు చేయబడినది

ఆంధ్రులచరిత్రము సమగ్రమయినది పది (౧౦) సంపుటములలో ముగియుచున్నది. ఒక్కొక్కసంపుటమున ౪౦౦ పుటలుండును. "కాకతీయాంధ్రరాజయుగచరిత్ర" మను నీ యైదవసంపుటమును ముందుగాఁ బ్రచురింపవలసినదని నా మిత్రులు కొందరు కోరినందున దీనిని ముందు ప్రచురింప సమకట్టితిని. రెండుమాసముల కొక సంపుటము చొప్పున ౧౦ సంపుటములు ప్రచురింపఁ బూనుకొన్నాను.

ఇరువదియైదుసంవత్సరముల క్రిందట వ్రాయబడిన చరిత్రమునంతయు ననేకసందర్భములలో సంస్కరించుటయేగాక ఇప్పటివరకు వెలువడిన యనేక నూతన చరిత్రాంశములను జేర్చి నూతనవిధానరచనలతో నలరారునట్లుగా సిద్ధము గావింపబడిన యీ యపూర్వచరిత్రములోని యీయైదవసంపుటము పునర్ముద్రణమున కీయఁబడినది.

ఇందు క్రీ. ౧౧౨౬ మొదలుకొని క్రీ శ. ౧౩౨౬ వఱకు రెండువందల సంవత్సరముల పరిమితికాలములో "కాకతీయాంధ్రసామ్రాజ్య" మెట్లు మొలకెత్తి యెట్లు ప్రవర్ధమానమై, మహావృక్షమై, యెట్లు శాఖోపశాఖలతో విస్తరించి ఒక్క వెలుఁగు వెలిఁగి, యెట్లస్తమించినదో యా వివరమంతయుఁ గలదు.

ఆంధ్రప్రజల పురోభివృద్ధికొఱకె తన జీవిత మంకితము గావించుకొన్న ఈ చరిత్రకారుఁడు నలువదేఁబది సంవత్సరములలో గడించుకొన్న తన యనుభవ జ్ఞానముతోఁ దాను రచించిన యీ యాంధ్రుల చరిత్రము ౧౦ సంపుటములను నాంధ్రులకు తన జీవిత కాలములోనే స్వల్ప మూల్యమునకే లభ్యమగునట్లు చేసి ఋణవిముక్తిని గాంచ కోరుచున్నాఁడు. కావున నాంధ్ర సోదర సోదరీ మణులెల్లరు నీ మహోద్యమమునకు జేయూత నిచ్చి తోడ్పడవలయునని ప్రార్థించుచున్నాఁడను. ఇందు అనేక కులములకు సంబంధించిన మహాపురుషుల యొక్కయు, శూరనారీమణుల యొక్కయు వృత్తములు మిక్కిలి మనోహరములుగా వర్ణింపఁబడినవి. మత సాంఘిక పరిణామ చరిత్రగూడ విస్తరింపబడినది. అనేక వింత విషయములుగూడ గలవు. ఆంధ్రదేశమున బుట్టిన ప్రతిగృహస్థుని యింటను ఈయాంధ్రుల చరిత్ర సంపుటము లలంకరింప దగినవిగా నున్నవి.

దీని వెల ౨ రూపాయలు మాత్రమే.

రూ. 116 లు ఇచ్చినవారు రాజపోషకులుగను, రు. 25 లు ఇచ్చినవారు పోషకులుగను, రు. 12 లు ఇచ్చినవారు అభిమానులుగను గ్రహింపబడి వారి నామములను ఈ సంపుటములలో బ్రకటింతునని మనవి చేసికొనుచున్నాను.

ఇట్లు,

చిలుకూరి వీరభద్రరావు,

కొవ్వూరు.




ప్రియుసందేశము

# మధ్యవర్తి

కొడవటిగంటి కుటుంబరావు

"అసలు నువ్వు నాకొడుకువే కాదు. ఫో ముందు బయటికి !"

"అదేమో నీకు తెలియాలి, మాఅమ్మకు తెలియాలి! నేనుమాత్రం వెయ్యిరూపాయ లక్కడ పెడితేగాని ఎక్కడికీ కదిలేది లేదు."

"వెయ్యిరూపాయలు! ఈ రోజుల్లో! పాపం, నువ్వు ఎప్పుడు అడుగుతావా అని కుప్పపోసుకుకూర్చున్నా ! ఏంచేస్తావు వెయ్యిరూపాయలతో ? మూటా మూటా మెడకు ఉరిపోసుకుంటావా? "

"మీ కటువంటి అనుమానం ఉంటే నోట్లుగానే ఇవ్వండి! "

"నోట్లో నల్ల బొగ్గులో—వాటితో ఏం చేస్తావన్నాను ! "

"ఏదో చేస్తానన్నాను ! నీ కదంతా ఎందుకు? హోటలుపెట్టుకు బతుకుతాను."

"అదే ! అటువంటి దేదో చేస్తే కాని నువ్వు నాప్రతిష్ఠ బాగా నిలబెట్టినవాడివి కావు. ఏం ? "

"నే నెవరో, మీరెవరో ? మీప్రతిష్ఠ నేను నిలబెట్టే దేమిటి, కనీసం మీకొడుకునన్నా కానప్పుడు ! "

"ఆకూత నువ్వు కూస్తున్నావుకాని, ఇంకా లోకమంతా కుయ్యటం లేదుగా, కోడై ! "

"మొదట నువ్వే కూశావో నేనే కూశానో మనిద్దరికీ తెలుసు... అయినా, నాకు పోట్లాడటం సరదా అనుకోకండి. అటువంటి స్వభావం, అసలువిషయందగ్గిర తగాదాపడటం ఎట్లాగూ తప్పేటట్టు లేదు, వ్యర్థకలహంలోకి కూడా ఎందుకు దించుతారు ? "

"మాటలు నేర్చావు, చాతకాని వెధవా ! పోయి సంపాదించు. నిన్ను బియ్యే చదివించి నీ కోసం ఎంతతగలెయ్యాలో అంతా తగలేశాను. ఇక నాదగ్గిర చిల్లిగవ్వ లేదు."

"ఆసంపాదనకే పెట్టుబడి కావాలిసి వెయ్యిరూపాయలు అడిగాను. అవి పెట్టుకొని యావజ్జీవమూ తిందామని కాదు. "

"నీజన్మకు పెట్టుబడి అదివరకే అయిపోయింది. ఇక దమ్మిడీ లేదు.... ఉద్యోగం చేసి యేడుస్తావని ఆపెద్దమనిషి కాళ్లా వేళ్లాబడి శిఫారసుచెయ్యటానికి వప్పిస్తే, ఆయన్నుకాస్తా అవమానపరిచి, నాకు ఆయన మొహం చూడటానిక్కూడా తలవంపులుగా చేస్తావా? "

"అవమాన మేమిటి? నా కిప్పటికీ అర్థంకాకుండా ఉంది, తన తమ్ముడికొడుక్కు పదిరూపాయల ఉద్యోగం ఇప్పించలేనివాడు నాఉద్యోగానికి ఎట్లా శిఫార్సుచెయ్యగలడో! కళ్లూ, చెవులూ లేనివాళ్లకు చెప్పండి ఇటువంటి కభుర్లు."

"వాళ్లే నయం! —నీమాదిరిగా దురహంకారంతో గింజుకోక, రోజుకో పావలాడబ్బులు యాచించుకోగలుగుతున్నారు."

"అవును ఆపని మీ ప్రతిష్ఠకు భంగకారి కాదుకూడానూ!... మొత్తానికి మంచి ఉపాయం కనిపెట్టావు—నన్ను అసలువిషయాన్నించి తప్పించి నాచేత అవీ ఇవీ వాగించటం! ... నా కీ కభుర్లతో ఏమీ పనిలేదు. నే నింకోవిషయం ప్రసంగించను. నాకు కనీసం వెయ్యిరూపాయలు కావాలి. ఎప్పు డిస్తావో చెప్పు. అంతదాకా పెద్దమనిషితరహాగా ఊరుకుంటాను. ఆపైన ఒక్క క్షణంకూడా ఈ కొంపలో ఎవరికీ నిద్రాహారాలు లేకుండా చేస్తాను, చేసితీరుతాను!"

"నీతాతముల్లె దాచావా ఏమిటి నాదగ్గిర?"

"నాతాతముల్లె కాకపోతే నీస్వార్జితం నాకిమ్మన్నానా ఏమిటి? నీడబ్బు నాకు విషతుల్యం. నాతాతముల్లె ఎనిమిదెకరాలుండాలి. ఏంచేశా వదంతాను? దాన్లో నా కెంతవస్తుందో అంతా పంచండి. మీరు పోరీ అన్నతరవాత మిగతాదాని సంగతి చూస్తాం!"

"మాటలు తిన్నగా రానీ, పుంధాకోర్! నీఅక్కలపెళ్లికి మూడేసి మూడేసి వేలు పోశాను. నీదినవారాలకు మూడువేలు పైగా తగలేశాను. నీతాతముల్లె అప్పుడే పోయింది. నడు ముందు బయటికి!"

"నాతాతముల్లెకు నాకన్నా ముందు నా అక్కలమొగుళ్లు వారసులల్లే ఉన్నారు. తలా వెయ్యిన్నూటపదహారూ, వెండిసామానూ, అవన్నీ కట్టబెట్టి అల్లుళ్లచేత నానాబూతులూ పడటాని కభ్యంతరం లేదు కాని కొడుక్కు 'బతుకుతానో, భగవంతుడా!' అంటే ఇవ్వటానికి చిల్లిగవ్వ లేదు!"

"నిన్ను నేను బతకవద్దన్నానా? భరణం ఇస్తాను, ముండ కిచ్చినట్లు, తింటూ ఉండు!"

"నాకాభరణం అక్కర్లేదనే చెప్పటం. నేను కానీ కావాలన్నా మిమ్మల్ని అడగాలి. ఎందుకని మీచేత అడిగించుకోవాలి. రేపు యీముండభరణమే నాభార్యాకూడా పంచుకోవాలి—దాని కేదైనా కావాలంటే అది నన్ను ప్రార్థించటమూ, నేను మీతో మనవిచేసుకోవటమూ! తమ శలవైతే కద్దు, లేకుంటే లేదు.... నా కిదంతా పనికిరాదు. నాకు వెయ్యిరూపాయలు కావాలి. ఎందుకు కావాలోకూడా చెప్పను. ఇవ్వకపోతే కొంపకు చిచ్చుపెట్టి తీరుతాను. అట్లా చెయ్యకపోతే నేను మీకొడుకును కాదు."

"నువ్వసలు నాకొడుకువే కాదు. ఫో అవతలికి!...నువ్వూ, నీపెళ్లామూ!"

"దానిజోలి ఎత్తకండి, నాకు తూలుతుంది. నేను తూలితే మనిషిని కాను!"

వారంరోజులనించీ ఈ విధంగా నడుస్తున్నది దశరథరామయ్యకూ, కొడుకు హనుమంతరావుకూ.

ఏరకంమనుష్యులు ఆరకంమనుష్యులతో అతికిపోతారని తెలేనివాళ్లు అనుకుంటారు. కాని అది పూర్తిగా నిజం కాదు. ఇద్దరు మంచివాళ్లవిషయంలో తప్ప అది వర్తించదు. ఇద్దరు చెడ్డవాళ్లకు వాళ్ల దుర్గుణాల సామ్యం వల్ల పొసగటం అసంభవం ఇద్దరుపిసినిగొట్లకు ఎట్లా పొసగుతుంది? గుణాలయొక్క మంచిచెడ్డలు నిర్ణయించటానికి ఇది ఒక మంచి ఉపాయంకూడానూ. ఒక గుణాన్ని ఆగుణంతోనే పరీక్షచెయ్యాలి. ఏగుణం కలవాడు ఆగుణమే ఇతరుల్లో చూసి సహించలేడో, అది దుర్గుణం. మానవులను ఎడం చేసేవి దుర్గుణాలు. మానవులను దగ్గిరికిచేర్చి జాతికి ఐకమత్యమూ, బలమూ చేకూర్చేవి సద్గుణాలు.

ఈ తండ్రీ కొడుకులు అనేకవిషయాల్లో ఒకరి నొకరు పోలినవారే. కాని ఇద్దరికీ పడ లేదు. హనుమంతరావుకున్న ఓర్పు లేనితనం చూస్తే దశరథరామయ్యకు ఒళ్లుమంట; దశరథరామయ్యకు ఓర్పు లేకపోవటం చూస్తే హనుమంతరావుకు ఒళ్లు మండేది. కాస్త కోపంరాగానే అవతలవాణ్ణి గడ్డిపరకకింద కట్టివెయ్యటం తండ్రిలో పెద్దదుర్గుణ మని హనుమంతరావునమ్మకం. కాస్త వాదనలోకి దిగగానే తన్ను "నువ్వు,నువ్వు" అని సంబోధించటమేకాక, తన్నొక వెంట్రుక కింద కట్టి మాట్లాడటం తనకొడుకు కున్న పెద్దతెగులని దశరథరామయ్యనమ్మకం. వీరిద్దరితగాదా పరిష్కారం.అయ్యే దెట్లా?

తను మాట్లాడేదాన్లో పాయింటు ఉన్నదని దశరథరామయ్య కొడుక్కు తెలియచెయ్యాలని ప్రయత్నంచేస్తూ, అతను అది చూడకపోవటం చూచి మరింత మండిపడేవాడు. సరిగా అదేసమయంలో హనుమంతరావుకూడా తన పాయింటు తండ్రికి విప్పిచూపిస్తూ, ఆయన దాన్ని గమనించకపోతే మరింత మండిపడేవాడు.

"ఏంరా, అబ్బాయి! శేషగిరిరావుగారితో మాట్లాడాను. నీకు ఉద్యోగం ఇప్పిస్తా నన్నాడు. కాస్త ఆయనకు కనపడు తూఉండు అప్పుడప్పుడూ!"

"ఆయన ఎట్లా ఇప్పిస్తాడు నాన్నగారూ? ఆయన కంత పలుకుబడే ఉంటే, నరసింహారావునిరుద్యోగిగా ఉండటమేమిటి?"

ఈ పోట్లాట ఈ విధంగా ప్రారంభమయిందంటే ఎవరైనా నమ్మగలరా?

కాని ఇది ఇట్లా ప్రారంభం కావటం సౌభాగ్యమ్మగారు కళ్లారా చూస్తూ, చెవులారా విన్నది. ఆరోజు కారోజు ఈవివాదం పెరిగిపోతున్నవైనం చూసి ఆఖిడ తనకళ్లనూ, చెవులనూ తనే నమ్మలేకపోయింది. చదరం

గం మొదలైన ఆటల్లో ఆడేవాళ్లకన్న చూసేవాళ్లకు ఆటయొక్క కిటుకులు బాగా తెలిసినట్టు, ఆవిడకు ఈ కలహం ఎంతవృథా కలహమో తండ్రికొడుకులకన్న బాగా తెలుసును. ఆ ఇద్దరూ చిన్న అగ్నికణకాని ఒక మండదగిన కట్టెకాని లేకుండా, గారడీ చేసినట్టు, పెద్దజ్వాల తయారుచేశారు. ఇది చల్లారాలంటే ఎక్కువశ్రమకూడా అవసరం లేదు. తండ్రికొడుకు లిద్దరూ, తమవల్ల పొరపాటుందని చెంపలు వాయించుకోను కూడా అక్కర్లేదు. రెండోవారు చెప్పే మాటల్లో కించిత్తు సబబు ఉందేమో చూతామని అనుకుంటే చాలును—ఈ తగాదా కట్టుపడిపోతుంది. ఎవరికన్న ఎవరు రెండో వారిని ఎంతఎక్కువ నీచంగా చూడగలుగుతారో చూతామని ఇద్దరూఎంతకూ పట్టుపట్టుకుకూర్చుంటే, పాపం, ఆడది, సౌభాగ్యమ్మ ఏంచెయ్యగలదు ? ఇద్దరిచేతా ఇంతవయసు గడిచిన తరవాత ఇప్పుడు రంకులు కట్టించుకుంటూ, ఇద్దరినందునా నలగటంతప్ప! ఆవిడ ఎడంగా ఉంటేనే ఇంత సౌరభ్యంగా ఉంది; ఇక ఆవిడ మధ్యవర్తిత్వం చెయ్యబోతే వాళ్లు ఆమెను బతకనిస్తారా? ఉత్తది! ఆవిడ ఒక్కనమస్కారం చేసి, "దీనికి అంతు ఎప్పుడురా భగవంతుడా?" అని ప్రార్థించింది.

ఆ యిద్దరిలోనూ పైకి చూడటానికి హనుమంతరావు మెరుగనిపిస్తాడు. సాధ్యమైనంత వరకు అతను అవీ ఇవీ తవ్వడు. పోట్లాడటం ఇష్టంలేనివాడల్లే కనిపిస్తాడు. తండ్రి తూలినంత తూలినట్టుండడు. అప్పుడప్పుడూ వాదనలో తండ్రిమాటలు ఆయనమీదికే తిప్పికొట్టి విసేవాళ్లకు తప్పంతా తండ్రిదే ననిపిస్తాడు. కాని అతనివల్ల కావలసినంత తప్పు లేకపోలేదు. పదిరోజులు కిందటివరకూ తనకు కాసి కావలసినా సంతోషంతో తండ్రి నడిగి తీసుకోలేదా ? అది తనకు భరణంగా భావించాడా? తను బి యే వరకూ చదవటానికి అయిన ఖర్చంతా వృథా అయిందనీ, తనకు ఏ చిన్న ఉద్యోగమన్నా దొరక్కపోవటం తన ప్రారబ్ధమనీ అతను అనేకమార్లు అనుకోలేదా? తన అక్కలకు తన తాతఆస్తిమీద నైతికంగా తనకున్న అధికారం ఉందని ఎన్నోసార్లు ఎంతోమందిదగ్గిర అనలేదా? ఇవన్నీ అడిగేవా రెవరు ?

కాస్త కోర్టుపని తగిలి దశరథరామయ్య గారు బస్తీకి వెళ్లవలిసివచ్చింది. హనుమంతరావు అత్తవారిఊరు ఆ ఊరే. సహజంగా దశరథరామయ్య వియ్యంకుడిఇంటికే వెళ్లాడు ఆతిథ్యానికి.

దమయంతి మామగార్ని చాలామర్యాద చేసి, కుశల ప్రశ్నలడిగి, కాళ్లు కడుక్కునేటందుకు నీళ్లిచ్చి ఎంతో గౌరవించింది. దశరథ రామయ్యకు కోడల్ని చూడగానే ఎందుకో ప్రాణం లేచివచ్చినట్టయింది. ఈవారం రోజులనించీ తీక్ష్ణమైన ఎండదెబ్బతగిలి నెర్రెలు పడ్డట్టున్న ఆయన హృదయంమీద అమృతవర్షం కురిసినట్టయింది.

కామక్రోధాదులను తిరస్కరించే మహా ఋషులుసహితం సద్గుణాలకు లొంగిపోయేవాళ్లు. వారం పదిరోజులనించీ గౌరవించబడటంకాని, సానుభూతి చూపబడటంగాని అనుభవించని దశరథరామయ్యకు కోడలి ఆపేక్ష ఎంత ఆహ్లాదకరంగా ఉందో? తన గర్భవాసాన పుట్టి తన్ను వేధిస్తున్న హనుమంతరావుతో ఈ పిల్లను పోల్చుకున్నాడేమో దరశథ రామయ్య? ఎవరిసానుభూతితోనూ తమకు ప్రమేయంలేనట్టు నటిస్తూ అందరికన్నా ఎక్కువ సానుభూతి కావలసినవాళ్లలో ఆయనకూడా ఒకడు.

ఏమయినా ఆయనకు దమయంతినిచూడ గానే కలిగిన ఆనందానికి మేరలేదు. "ఈ పువ్వు ఎంత అందంగా ఉంది! ఎన్నడూ చూడలేదే! ఆహా! ఇది మనింట్లో ఉంటే ఎంత బాగుండును!" అని అపూర్వమైన పుష్పాన్ని చూసి మనం అనుకున్నట్టు అనుకో గలిగాడు దశరథరామయ్య దమయంతిని చూస్తూ. ఈ పిల్ల తన కోడలయినందుకు చాలాసంతోషమయింది కాని, "ఆ వెధవ దీనికి తగడుకదా" అనే చింత ఆయన్ను కొంచెం బాధించింది.

వెయ్యవలసిన కుశలప్రశ్నలన్నీ వేసి దమయంతి పారిపోలేదు, అక్కడే గడ పలో ఆయనకు సగంకనబడుతూ నిలుచుంది. ఈ పిల్లతో తన కష్టసుఖాలన్నీ చెప్పుకో వాలని దశరథరామయ్యకు ఒక ఆవేశం వచ్చింది. ఆమెకూ తనకూ మధ్య ముప్ఫై ఏళ్ల తేడా ఉన్నమాటకూడా మరిచిపోయి, ఆమె తనవయసుమనిషి అయినట్టూ, తను ఆమెవయసువాడల్లేనూ ఆయన మాట్లాడ టం మొదలుపెట్టాడు. చిన్నతనంలో ఎప్పుడో ఆయన తన తల్లితో ఈ విధంగా మాట్లాడి ఉంటాడు. మళ్లీ ఇప్పుడు! ఈ అనుభవం ఆయనఆత్మకు చాలా సుఖకరంగాకూడా ఉంది.

పూసగుచ్చినట్టు తనకూ, తన కొడుక్కూ నడిచిన తగాదా యావత్తూ దశరథరామయ్య కోడలికి చెప్పాడు, పొరపాటునఅయినా తను కొడుకును అన్నమాటల్లో ఒకటయినా పయికిరానివ్వకుండా. దమయంతి తీరికగా ఆయన చెప్పేదంతా విన్నది; మధ్యమధ్య మాటలుకూడా అందుకున్నది. "నేను పసి దాన్ని, ఇదంతా నా కెందుకు లెండి!" అన్నట్టుగా కాని, "పెద్దనాంబసానితనం" కనపరుస్తూకాని ఒక్కమాట కూడా రానివ్వ లేదు. మాట్లాడటంలో ఆతూకం సహజంగా రావాలి. దమయంతికది పుట్టకలోనే వచ్చింది.

దశరథరామయ్యగారు తన మీదినించి గొప్పభారం ఒకటి తొలిగించుకున్న వాడల్లే తృప్తిపడ్డాడు. ఎట్లాగో అది తన నోటిమీది గానే రావాలి కనక, దశరథరామయ్య వియ్యంకుణ్ణి తన కొడుకుఅవుపోసన కార్యం గురించి కదిలించాడు. దమయంతి కేం? పదిహేనేళ్లు నిండుతై. రజస్వల అయి ఏడేని మిది మాసాలుకూడా కావస్తున్నది. ఆమె తండ్రీ కొన్ని లాంఛనపుమాటలన్నా చివ

రకు సరే నన్నాడు. ముహూర్తంకూడా నిర్ణయం అయిపోయింది. ఈ మాట ఇంటో తెలియగానే తండ్రీకొడుకులకు మళ్లీ ఒక ఘర్షణ జరిగింది.

"చేసేది నా కార్యమా? ఊళ్లోవాళ్ల కార్యమా? నాకు తప్పెట్లూ, తాళాలూ, బాజాలూ, వందమంది సాక్షులూ ఎందుకు? నా యిష్టం వచ్చినప్పుడు వెళ్లి నా పెళ్లాన్ని నేను తెచ్చుకుంటాను." అని హనుమంతరావూ, "నీయిష్టం వచ్చినట్టే ఏడుచుకో, నువ్వెట్లా ఛస్తే నా కెందుకు?" అని దశరథ రామయ్యా, ఆ పోట్లాట అప్పటికి ఆఖరు చేశారు.

"అమ్మయ్యో! మీకు పోట్లాడటం ఎంత సరదా అండీ! నాతో ఎప్పుడూ పోట్లాడరు కాదూ? ఎవరికైనా కోపంవస్తే నా ప్రాణాలు పీచుపీచు మంటై!" అన్నది దమయంతి.

హనుమంతరావు నవ్వాడు. అతను భార్యను తెచ్చుకుని వారంరోజు లయింది. ఇకముందెట్లా ఉన్నా, ఇప్పటి వరకూ అతను పెళ్లాం వంక నవ్వుతూ తప్ప చూడలేకుండా ఉన్నాడు. ఇకముందు కూడా ఆమెమీదగాని, చివరకు ఆమెఎదురుగాగాని కోపంతో ఉండటం కష్టంగానే ఉండే టట్టుఉంది. ఎల్లప్పుడూ సంతోషంగా ఉండే విద్య ఆమెకు తెలుసునల్లే ఉంది. ఆమెయొక్క సరదా అదొకరకమైన ఉత్తమజాతి అంటువ్యాధిమాదిరిగా కూడా కనపడుతున్నది.

కొద్దికాలంకిందట తండ్రిచేసిన పనే హనుమంతరా విప్పుడు చేశాడు—తను తన తండ్రిని అన్నమాటలన్నీ దాచిపెట్టి పెళ్లాంతో తండ్రిమీద చాడీలుచెప్పాడు. భగవంతుడు దమయంతిని మధ్యవర్తితనం చెయ్యటాని కని సృష్టించాడేమో. లేకపోతే వాళ్లూ వాళ్లూ వచ్చి తమతమ రిపోర్టులు ఆమెదగ్గిర చెయ్యటం ఎందుకు?

మధ్యవర్తి ఎప్పుడూ గోడమీది పిల్లి వాటంగా ఉండాలి. లేకపోతే తమ ఉద్యోగం త్వరలో ఊడిపోగలదు. అందుకనేనేమో దమయంతి మొగుడులేనప్పుడు మామగారితోనూ, ఒంటరిగా మొగుడితోనూ ఒకరకంగా మాట్లాడటం మొదలుపెట్టింది. ఆరకం ఇదీ:

"ఎబ్బె! మీరు అనవసరంగా మథనపడుతున్నారండీ! మీరు అనేది ముమ్మాటికీ నిజమనుకోండి! కాని ఆయన అనేమాట అబద్ధం కాదు. మీరు సరియైన మధ్యవర్తి ఉండి పని చేస్తే మీ తగాదా సులభంగా తేలిపోతుంది!"

"నీకు తెలేదే, పిచ్చిదానా! అయినా నీకేమన్నా వాణ్ణి తిప్పగలనని ధైర్యం ఉంటే ప్రయత్నించు" అని దశరథరామయ్య అన్నాడు.

"సరే! ఇంకేం? మాకు నువ్వే మధ్యవర్తిగా ఉండు, ఇటువంటి బంగారపు చిలుక మాకు మధ్యవర్తిగా ఉండటంకన్న కావలిసిందేమిటి?" అని హనుమంతరావు అన్నాడు.

కాని ఎన్నాళ్లకూ దమయంతి వ్యవహారంలోకి దిగలేదు. ఎవరి దౌర్బల్యం ఏమిటో తెలిస్తేనేగాని మధ్యవర్తితనం సరిగా సాగదు. సహజంగా మొగుడితత్వాం తెలుసుకోటానికే ఆమెకు ఎక్కువ అవకాశాలు లభించినై. ఆమెకు ఒకనాడు మంచిఉపాయం తట్టింది. అవకాశంకోసం కనిపెట్టుకుని కూర్చుంది. పోట్లాట కొద్దిగానో, గొప్పగానో ప్రతిరోజూ జరిగిపోతున్నది కాని ఆమెకు కావలసిన అవకాశం అయిదారరోజులదాకా రాలేదు.

ఆనాడుమధ్యాహ్నం భోజనాలైనతరవాత దశరథరామయ్య భార్యతో ఏదో ఇంటిఖర్చును గురించి మాట్లాడుతూ, కొడుకును కూడా ఒకపోటుపొడవటానికి అవకాశం దొరికేటప్పటికి అది వదులుకోటం ఇష్టంలేక— ఆయన ఇటువంటివిషయాల్లో, పాపం! చిన్నపిల్లవాడివంటివాడు!—" మీకేమే? 'అది చెయ్యి, ఇది చెయ్యి! నాకు పాతికఇయ్యి, యాభై ఇయ్యి!' అంటారు. చేసేవాడికి తెలుస్తుంది ఆకష్టనిష్ఠూరాలు! " అన్నాడు.

ఇందులో హనుమంతరావు తండ్రి తన్ను ఎత్తిపొడిచాడనుకునేటందు కేమీ లేదు. కాని ఇతను ఆ తండ్రికొడుకే కనక తండ్రిఉద్దేశం గ్రహించగలిగినవాడై. "అబ్బో! ఏమిచేత! బహు గొప్ప చేత చేస్తున్నారు?" అని, పుచ్చకాయల దొంగ అంటే భుజాలు తడువుకున్నాడు. అప్పుడు దమయంతి కలిపించుకుంది.

"ఏమిటండీ, కాకపోయినా! ప్రతిదానికీ ఆయనమీదికి ఒంటికాలిమీద లేస్తారు! అంత చాతయినవారు మీరు చెయ్యరాదూ?... ఆతాళంచెవులు ఆయన కివ్వండి మామగారూ! నిజంగానే! ఏంచేస్తారో చూతాం! ఈసూటీపోటీలన్నీ మీ కెందుకు ?"

దశరథరామయ్య ఒక్కక్షణం నిర్ఘాంతపోయినాడు, కాని దమయంతిమొహంచూసి ధైర్యం తెచ్చుకుని, "ఓ! మహారాజుగా!" అంటూ తాళపుచెవులు తీసి కోడలి చేతిలో పెట్టాడు దమయంతి అవి తీసుకొని వెళ్లి మొగుడిమొహాం ఎదట గలగల్లాడిస్తూ "ఇంద!" అన్నది.

హనుమంతరావు లోపల పొందిన ఆనందానికి మేరలేదు. తన తండ్రిని దమయంతి ముచ్చటగా బుట్టలోవేసిం దనుకున్నాడు. కాని, పాపం! ఏమీ లాభంలేదు. అతనికి ఎటువంటి బాధ్యతా వహించటానికి ఓపికలేదు. అటువంటివిషయాల్లో అతను అమితసోమరి. తన కిప్పుడీ మేనేజిమెంటుకూడా ఎందుకు? కాని, దమయంతా? బాకువంటి పిల్ల!

అతను పెళ్లాంవంక నవ్వుతూ చూసి, "అంటే సరి!" అని ఊరుకున్నాడు.

"తీసుకోండి మరి!"

"నే నిప్పుడు ఈపెత్తనం తక్కువయిందనే దిగులుపడుతున్నా కాదూ?" అన్నాడు హనుమంతరావు.

"మాటలు మాత్రం అంటారు —పడే వా ళ్లుంటే! ఏం?" అంటూ దమయంతి తాళంచెవులు మామగారికి ఇచ్చేస్తూ, "క్రియకు వచ్చేటప్పటికి ఇంతే లెండి" అన్నది.

వంటఇంట్లో సౌభాగ్యమ్మ నిట్టూర్పువిడిచిన చప్పుడు అస్పష్టంగా వినపడ్డది దమయంతికి.

---



విలాసిని

శిల్ప చిత్రము

K. P. S.

# సాముద్రికశాస్త్రము

## 3. ఐశ్వర్యభావము

కోటమర్తి చినరఘుపతిరావు

84

ధనరేఖపై మానవుని మైశ్వర్యమే గాక ఆయుర్దాయవిషయమును, భార్య ఆయుర్దాయమునుగూడ నిర్ణయింపవచ్చునని చెప్పియున్నాను. అంతియకాక ధనరేఖపై మైశ్వర్యమేగాక మానవుని గుణగణాదుల గూర్చి కూడ చెప్పవచ్చును. కొందరా రేఖపై వివాహాదివిషయములగూడ తెల్పుదురు. కావున నిం దాయావిషయములగూర్చి నిరూపించుటకు సావకాశ మెట్లుండునో సూచించుచున్నాను.

ధనరేఖపై మానవుని ఆయుర్దాయవిషయమునుగూర్చి స్వల్పముగ ముచ్చటింతును.



పటము ౧

ధనరేఖ, యే శిరోరేఖనో కొంచెము దాటిన పిమ్మట నాకస్మికముగ కోసివేయబడిన ట్లాగిపోవును. ఆయుర్దాయరేఖ అనగా జీవితరేఖలో ఆ వయస్సునకే శుక్రస్థానములో నుండి యొక యవాంతరరేఖ వచ్చి కలిసికొనును. ఆజీవితరేఖలో సుమారు 40 వ సంవత్సరమున నవాంతరరేఖ జీవితరేఖతో కలిసికొనిన సమయముననే ధనరేఖ తెగిపోయి యుండును. అట్టియెడ కొన్ని ముఖ్య విషయములు గమనించికొనవలసి యున్నది. (చూ. 1 వ పటము)

శుక్రాంతరరేఖలోని యవాంతరరేఖవలన మనము తెలిసికొనగలిగినవిషయములు:

1. జాతకునకు 40 వ సం.రమున అపారమైన జబ్బుచేయవచ్చును.

2. ఒక్కొకవేళసన్నిహితులు అత్యంత సమీపబంధువులలో మరణము సంభవింపవచ్చును.

3. కొందరి మతముప్రకారము భార్యామరణము గూడ దానివలన సూచింపబడవచ్చును.

ఈపై మూడు విషయములు జాతకుని మనస్సును,శరీరమునుగూడక్షోభపెట్టునవియే గాదా! అన్నింటికంటెను ముఖ్యమైనది జాతకునకు 40 వ సం.న అపారమైన జబ్బుచేయవచ్చునను విషయమే. అట్టిస్థితిలో ఆ జబ్బు జీవితమున కెట్టిమార్పు తీసికొనిరాగల దని

మనము ధనరేఖను జూచిన అందా రేఖ సరిగ ఆ సమయమునకే కోయబడిన ట్లుండుట చూతుము. అప్పుడు జాతకుడుండు స్థితిగతుల మనము కనుగొందుమేని జాతకుడు సుఖముగ ఋణాదిబాధలు లేక తనకు వచ్చు పిత్రీయ ముపై స్వేచ్ఛగ జీవింపగలిగినవాడుగా నున్నచో అట్టివానికి యీజబ్బు ఆర్థికమైన మార్పు ఎట్లు తీసికొనిరాగల దను విషయ మును నిర్ణయించుకొనవలెను. సహజముగా నాత డప్పటివరకును మంచిస్థితిగతులు గలిగి యున్న వానికి నాకస్మికమైన ఆర్థిక ప్రమా దము తటస్థించుట యనగా ఏదియో విపద్దశ వచ్చుట యనియే భావింపవలెను గదా! అప్పు డావిపద్దశను నిర్వచనము చేయుచో జాతకునకు 40 సం.న అపారమైన జబ్బు చేయుటచే విపత్తు సంభవింపవచ్చు నని నిశ్చ యించుకొనవలెను.


పటము ౨

రెండవదియైన ఆప్తమరణమువలన ధన రేఖకే విపత్తు సంభవించునంతటి ప్రమాదము తటస్థించు ననుకొనుట సమంజసవిషయము గాదు.

మూడవదియైన భార్యా మరణమును నిరూపింపవచ్చు ననుసంగతి కొంతవరకు నిర్ధారణపరుపవచ్చును. కాని ఆ సమయ ములో భార్యాస్థానమైన హృదయరేఖలో విఘ్నములు (చూ. 2-వ పటము), వివాహ


పటము 3

రేఖలో విచ్ఛిత్తులు(చూ. 3 వ పటము)కూడ చూచుకొనవలెను.

ఇన్ని వివిధస్థలములలో భార్యామరణ చిహ్నములు కానుపించుటకు సావకాశ ముండగా ఒక్క-శుక్రస్థానమందలి యవాంతర రేఖనుబట్టి ఆవిషయమును యిదమిత్థ మని నిర్ణయించి చెప్పుటకు సావకాశ ముండదు గదా! కావున పైవిషయములనుగట్టిగ తలచి మంచిచెడ్డలెల్ల సమాలోచనము చేసిచూచిన యెడల మానవుని ఆయుర్దాయవిషయమును కొంతవఱకు నిరూపింపవచ్చును. ఇక నొక విషయము:

మానవుని చేతిలోని జీవితరేఖ, శిరో రేఖ, హృదయ రేఖలు మొదటి తరగతి రేఖలు. అనగా స్వతంత్రశక్తిగలిగిన రేఖలు,

ఇతర రేఖల బలాబలములపై నాధారపడ నక్కరలేకుండ నీ మూడు రేఖలు గూడ



పటము ४

స్వతంత్రముగ ఫలితము లొసంగును. పెడ మొగములు తిరిగియున్న జీవిత రేఖ గలిగిన చేతిలో శిరోరేఖ, హృదయ రేఖ లెంత బాగుండినను మానవునకు చావు తప్పదు (చూ 4 వ పటము). అట్లే శిరోరేఖ శనిస్థానములో చిద్రుపలై యున్నచో కడమ రెండు



పటము ५

రేఖలు బాగుండినను మానవునకు చావు తప్పదు. (చూ. 5 వ పటము)

అట్లే హృదయరేఖ రవిస్థానములో ముక్కలైపోయినచో శిరోరేఖ, జీవిత రేఖ



పటము ६

లెంత బాగుండియుండినను మానవునకు చావు తప్పదు. (చూ. 6 వ పటము)

కాని ధనరేఖ, రవిరేఖ, ఆరోగ్యరేఖ లట్టివి గావు. ఇవి ద్వితీయపక్షమునకు జెందినవి. అనగా ఆ రేఖలు స్వయముగా, ధన విషయములోగాని, కీర్తివిషయములో గాని, వ్యాపారవిషయములో గాని స్వతంత్రించి మంచిచెడ్డలు నిరూపించునేగాని మానవుని యాయుర్దాయాది ముఖ్య విషయములలో స్వతంత్రముగ శక్తికలిగి పని చేయనేరవు. అందుచే ఈమూడు రేఖలును ద్వితీయ పక్షమునకు చెందిన రేఖలు. ఈ ద్వితీయపక్షమునకు చెందిన రేఖలలోని మంచిచెడ్డ లన్నియు ప్రధాన రేఖలైన శిరోరేఖ, హృదయరేఖ, జీవిత రేఖలపై నన్వయించుకొని ఫలితములు చెప్పవలెనేగాని వేరుగా యేరేఖ కారేఖ చూచి వాని ఫలితముల నిరూపింపరాదు. కొన్నివేళలయందు సాధారణమానవుల కతీతమైన ఫలములు నిరూపించు ధనరేఖ, రవి రేఖలు కానగును. అట్టియెడ ఆరేఖలలోని

యు త్తీర్ణతను చూచినంతమాత్రమున జాతకున కతీతమైన యోగము పట్టు నని చెప్పివేయరాదు. అట్టి అతీత యోగము పట్టుచో కడమరేఖ లాయోగమున కనుమతించు చున్నవా? లేక భిన్నములుగనున్నవా? ఈ అతీత యోగమునుబట్టి మానవునిలో నెట్టి మంచిమార్పులు గలుగనున్న వను విషయములు బాగుగ జూచుకొనవలెను. అట్టివి సాధారణముగ కానుపించవు. అనగా సాధారణమానవున కతీతలక్షణములవలన గలుగు మేలుకీళ్లను నిలబెట్టుకొనలేని జాతకుల జీవితములు దుఃఖాంతములౌను. కాని సుఖాంతములు కావు. కావున రవి, ధన రేఖలలోను త్తీర్ణమైన లక్షణములు గాన్పించుచో వెంటనే ఆరేఖలశక్తిని, అవి చేయు నుపకారాపకారములను సంశయించి పిమ్మట జాగ్రత్తగ హస్తమును పరిశీలించి ఫలితమును జెప్పవలెను.



పటము 8

పైరీతినే హస్తమును జాగ్రత్తగ పరిశీలించినచో ధనరేఖనుబట్టి జాతకుని కేసంవత్సరమున భార్యావియోగము సంభవించునో చెప్పవచ్చును

హృదయరేఖలోనుండియొక అవాంతర రేఖ ధనరేఖతో జేరినపిమ్మట ధనరేఖ పైకి బోవక అచ్చటనే ఆగిపోయినచో ఆ వయస్సున జాతకునకు భార్యావియోగము రావచ్చునని సూచించు చున్నది (చూ. 7 వ పటము)

హృదయరేఖలోని యవాంతర రేఖ యొక్కటే ఆత్మబంధువుల వియోగమును నిరూపించును. కాని ఆ అవాంతర రేఖ ధనరేఖతో సంబంధమును కూడ కలిగియున్ననేగాని భార్యావియోగమును చెప్పుటకు సావకాశము లేదు. ఇక్కడకూడ ధనరేఖ ద్వితీయస్థానమునే నిలచియున్నది. ఆప్తమరణచిహ్నము ప్రథమస్థానమునకు చెందిన హృదయరేఖయే నిరూపించుచున్నది. కాని అంతమాత్రముతో పని సంపూర్తికాలేదు. ఆమరణమునుగూర్చి యెవరికి చెందునదీ ధనరేఖను జూచిగాని చెప్పుటకు సావకాశము లేదు. కావున ధనరేఖ స్వతంత్రముగా నిలిచి ఫలితమునొసంగుట లేదు. ద్వితీయస్థానమున నిలిచి హృదయరేఖలో గలిగినవిపత్తును బలపఱచుచున్నది. దీనింబట్టి ధనరేఖ భార్యామరణమునుగూడ నిరూపింపవచ్చునని తేలుచున్నది.

ధనరేఖపై మానవుని గుణగణాదులను చెప్పవచ్చుననిగూడ ముందు వ్రాసియున్నాను. ధనరేఖలో మానవుని యవగుణములు



పటము ౮

నిరూపింపగలిగినది ఒక్కలక్షణముమాత్రమే. అది వడ్లగింజవలెనుండు రేఖ. లేక ద్వీపరేఖ. (చూ. 8 వ పటము)

అట్టి వడ్లగింజరూపమును గలిగిన ధనరేఖలో మానవుని జీవిత రహస్యములు పెక్కులు తెలిసికొనవచ్చును.

అట్టి వడ్లగింజ ధనరేఖకు ముందుగా బయలు దేరి (అందులో నుండి ధనరేఖ బయలుదేరు చున్నట్లు గోచరించు చుండ



పటము ౯

వలెను) అతిసన్నముగా వంకరలతో పోవు చుండిన అట్టిజాతకునకు జన్మమును గూర్చిన రహస్య మొక్కటి యున్నదని తలంపవలెను.

అనగా గూఢోత్పన్న సంతానమునకు చెందిన వాడని దీని యభిప్రాయము. (చూ. 9 వ పటము)

ధనరేఖలోమధ్య వడ్లగింజయుండి, గురు స్థానములో నక్షత్రచిహ్న ముండినచో అట్టి



పటము ౧౦

జాతకుడు తనకంటె నుచ్ఛస్థితిలో నుండిన యన్యస్త్రీసంపర్కమును పొందగలడు.

(చూ. 10 వ పటము)



పటము ౧౧

ఆ నక్షత్రమే రవిస్థానములో నుండిన విద్యాధికుని ప్రేమించుట సంభవించును.

(చూ. 11 వ పటము)



పటము ౧౨

ఆనక్షత్రమే బుధస్థానములో నుండిన శాస్త్రజ్ఞుని, లేక వైద్యుని ప్రేమించుట సంభవించును. (చూ. 12 వ పటము)

ఈధనరేఖలోని ద్వీపచిహ్నములు స్త్రీపురుషాదుల నీచప్రవర్తనమును నిరూపింపజాల వని కొందరిమతము. అట్టియెడ నీద్వీపచిహ్నము లేమిసూచించునను ప్రశ్నమునకు సమాధానముగా వా రీదిగువరీతిని చెప్పియున్నారు.

సరిగనుండు రేఖ సక్రమముగపోవు నదివలె గంభీరత గలిగియుండును. కాని నదిమధ్య లంకలు వైచినయెడల దాని గంభీరత నశించిపోవును. అట్లే రేఖయేదైనను సక్రమముగ ద్వీపచిహ్నములులేకుండ నిబ్బరముగ పోయినచో ఆరేఖకు సహజమైన సర్వగుణములును కలిగియుండును. అట్లుగాక ఆరేఖలో ద్వీపచిహ్నము లుండుచో ఆరేఖ సహజమైన లక్షణములలో గభీరత పోగొట్టుకొనియుండును. హృదయరేఖలోని ద్వీపచిహ్నము ప్రేమలోని గంభీరతను పోగొట్టుననియు, శిరోరేఖలోని ద్వీపచిహ్నము తెలివితేటలు పోగొట్టుననియు, జీవితరేఖలోని ద్వీపచిహ్నము ఆరోగ్యమును బోగొట్టుననియు, రవిరేఖలోని ద్వీపచిహ్నము కీర్తిని పోగొట్టుననియు, అట్లే ధనరేఖలోని ద్వీపచిహ్నము ఐశ్వర్యమును బోగొట్టుననియు వారివాదము. కాని పూర్వకాలమునుండియు ధనరేఖలోని ద్వీపము అవినీతినిరూపణచిహ్న మని చెప్పుదురు. ఇందులకు తార్కాణముగా నేను చూచిన కొందరి చేతులలో యీ చిహ్నము గాన్పించినది. ఆ చిహ్న మున్న కాలములో వారికి ధనవిషయమున నష్టము రాలేదు. మరియు వారి యవినీతి ప్రవర్తనముల గూర్చి కొంచెము ప్రసంగించినప్పుడు మాత్రము వారు "దానికేమి లెండి. ఏదో! చిన్నతనపు పనులు. అందరుచేస్తారు. కొందరి అదృష్టము కొద్ది పైకిరారు. కొందరు దొరికిపోతారు. ఇంతే తేడా" అని వారుచేసిన యకార్యముల కెట్లో సమాధానముల జెప్పుకొనుచు వచ్చిరి.

మొత్తముమీద ధనరేఖలోని యీ చిహ్నమునుబట్టి మానవుని యవినీతి ప్రవర్తనమునుగూర్చికూడ చెప్పవచ్చును.

ఇక ధనరేఖపై వివాహ విషయమును గూర్చి ముచ్చటించెదను.

పాశ్చాత్య దేశపు సుప్రసిద్ధ సాముద్రిక శాస్త్రవేత్తలు కొందరు ధనరేఖపై వివాహ విషయములు చెప్పవచ్చునని వారిసిద్ధాంతము. ధనరేఖ సాధారణముగా శుక్రస్థానమునుండి

యో, చంద్రస్థానము నుండియో పుట్టుచుం డును. శుక్రస్థాన మాత్మీయులకు, అనగా సోద రీలు, మేనత్తలు, పినతల్లి, పెద తల్లులకు స్థానము. చంద్రస్థానము భార్యా స్థానము. అందులకనియే చంద్రస్థానములో పుట్టిన ధన



పటము ౧౩

రేఖను బట్టి ఆజాతకుడు తన భార్య, లేక స్త్రీ యిచ్ఛానుసారముగా ధనమును వెచ్చించునని ఫలితమును జెప్పవచ్చును. ధన రేఖ చంద్ర స్థానములో పుట్టుటచే వచ్చెడిఫలిత మిదియే. అందుచే చంద్రస్థానము స్వస్త్రీకి సంబంధించి యున్నది. (చూ. 13 వ పటము) చంద్రస్థాన




స్థానములు. పటము ౧౪

శుక్రస్థానములకు (చూ. 14 వ పటము) ధన రేఖలోనికి చంద్రస్థానములో బుట్టిన వేరొక



పటము ౧౫

రేఖపోయి కలిసికొనిన ఆ రేఖ కలుసుకొను నప్పటికాలమునకు వివాహము జరుగునని చెప్పవచ్చును. (చూ. 15 వ పటము)

ఇట్లే రెండుమూడు రేఖలు చంద్రస్థాన ములో బుట్టి ధన రేఖతో నప్పుడప్పుడు కలుసుకొనుచు బోయిన ఆ రేఖలు కలిసిన వయస్సులో ద్వితీయ, తృతీయవివాహములు జరుగునని చెప్పవచ్చును.

కాని యిక్కడ నొక్క విషయమును ముఖ్యముగ గుర్తించుకొనవలెను.

ఈసాముద్రికశాస్త్రము ప్రస్తుతములో పాశ్చాత్యదేశ పరిశోధకులచే వ్రాయబడు చున్నది. వారు వారు చూచినయభిప్రాయా నుసారముగా వారికి కొన్ని కొన్ని ఫలిత ములు కన్పించుచున్నవి. అనగా పాశ్చాత్య దేశములో నొకస్త్రీ రెండుమూడు వివాహ ములు చేసికొనవచ్చును. వారలను సంఘ మామోదించును. కాని మన దేశములో నట్టి యాచారములు పనికిరావు. సాధారణ బ్రాహ్మణకుటుంబములలో గాని, మరేయితర

కుటుంబములలోని స్త్రీనిగానిచూచి ఆమెకు పైచెప్పిన చిహ్నమును బట్టి రెండు మూడు వివాహాము లున్నవని చెప్పిన సాముద్రిక శాస్త్రవాది పరిహాసపాత్రు డగును. గాని మన్ననకు పాత్రుడుగాడు. కావున పై విష యమును ముఖ్యముగ జ్ఞప్తియం దుంచుకొని ఫలితముల జెప్పవలెను. ఇక నిట్టిలక్షణములు గలవారి కెట్టిఫలితముల జెప్పవచ్చునని యడి గినచో భార్యాపక్షమునుండి గాని, తదితర స్త్రీవలనగాని ధనప్రాప్తినిగూర్చి చెప్పవలెను. ఆరేఖయే ధనరేఖను త్రెంపివేసిన, అనగా ధనరేఖనుదాటిపోయిన అట్టి చిహ్నమువలన వారిధనమువలన స్వార్జితము, లేక పిత్రీయము నకే భంగమువచ్చునని తెలుపవలెను.

మన హిందూదేశజులకు ధనరేఖపై వివాహ ఫలితముల చెప్ప ప్రయత్నించుట ప్రమాదకరము.

---



M. V.

గాలిగోపురముకడకు ఎక్కిపోవుమార్గము - తిరుపతి



కపిలధార - తిరుపతి M. V.

# కుటుంబకవులు - కవి కుటుంబములు

మానేపల్లి రామమూర్తి

భారతవర్షపు ప్రాచీనౌన్నత్యమునకు వంశపారం పర్యాగతమైన కళోపాసనమే ప్రధానకారణము. తరతరములనుండి కళోపాసనము చేయుచున్న కుటుంబములు నాటికిని, నేటికినిగూడ భారతవర్షమున లెక్కకు మిక్కిలిగా నున్నవి. మల్లినాథసూరి, అప్పయ్యదీక్షితులు, డిండిమభట్టు మొదలగు ప్రఖ్యాత పండితుల కుటుంబములనుగూర్చి యాంధ్రవిద్వాంసులు పరిశోధనలు చేసియున్నారు. వఝులవారు, కవిరాయనివారు, కాకరపర్తివారు, మండలేములవారు ఈ మొదలగు వంశనామములతో ప్రఖ్యాతి గడించిన కవికుటుంబముల చరిత్రములు ప్రత్యేకముగా ప్రకటింపవలసిన భారము ఆంధ్ర పరిశోధకులపై గలదు. అట్టి ప్రఖ్యాతికవి కుటుంబములలో నొకటగు మండపాకవారి కుటుంబమునుగూర్చి యిక్కడ కొంత వ్రాయుచున్నాను.

విద్యానగరసామ్రాజ్య మస్తమించి, యాంధ్రదేశము మహమ్మదీయులకు హస్తగతమైన క్రొత్తదినములలో, నేటి తణుకు తాలూకాలోనున్న మండపాక యను గ్రామమున నుండిన, కామకవిగారను పేర ప్రసిద్ధి నొందిన యొక కవి స్వగ్రామమును విడిచి, కాశీయాత్రకును, కాశీనివాసమునకును, బయలుదేరి తన యత్తవారి యూరగు విశాఖపట్టణపు జిల్లాలోని బాడంగియను గ్రామమునకు వచ్చెను. ఈ కామకవిగారు మంత్రశాస్త్రమునను, కవిత్వమునను, మిక్కిలి ప్రజ్ఞావంతులై యుండిరి. వీరితోగలసి వచ్చిన వీరికుమారుడు కృష్ణభట్టారకులు సాలూరురాజులయొద్ద అతిబాల్యముననే కొన్ని మహిమలు చూపినందున, ఆ రాజులు సంతోషించి, రెండగ్రహారము లిచ్చి, కృష్ణభట్టారకులుగారిని, వారి తండ్రిగారగు కామకవిగారిని ప్రార్థించి, కాశీయాత్రను మానిపించి, తమ సన్నిధిని నిలిపినైచిరి. ఆ రెండగ్రహారములలో నొకటి కుమారుడగు కృష్ణభట్టారకుల పేర కృష్ణాపుర మనియును, రెండవది తండ్రియగు కామకవి గారి పేర కామన్నవలస యనియును నేటికిని ప్రఖ్యాతములై యున్నవి. ఈ కామకవిగారు బ్రహ్మీభూతులగుటచే బ్రహ్మీభూత కామకవిగారని వంశచరిత్రలో పేరు గాంచిరి. నాటినుండి యీ కుటుంబమున "తాత మనుమల వంశసను తప్పకుండ యతులగుచుమండు" నాచారము సంప్రదాయముగాను, అవిచ్ఛిన్నముగాను వచ్చుచున్నది. కృష్ణభట్టారకులుగారి కుమారుడు బ్రహ్మీభూత కామకవిగారు. వీరు తమకవిత్వమహత్త్వముచే విజయనగరసంస్థానాధీశ్వరులగు పెదవిజయరామ గజపతి మహారాజులను మెప్పించి, యా మహారా జిచ్చిన ధనరాశిచేత తండ్రిగారగు కృష్ణభట్టారకుల పేరను, తాతగారగు కామకవిగారి పేరను పెక్కు ఆరామములను, తటాకములను ప్రతిష్ఠించిరి.

ఈ బ్రహ్మీభూత కామకవిగారి కొమాళ్లు లక్ష్మణకవి, సోమేశ్వరకవి, కృష్ణభట్టారకులు, శివన్న కవి, కాంచీనాథకవి అను నైదుగు రుండిరి. వీరిలో సోమేశ్వరకవిగారు బాల్యముననే సోమేశ్వరుని సాక్షాత్కరింప జేసికొని, సోమేశ్వరుని లింగమును స్థాపించి దేవాలయనిర్మాణ మొనర్చి, పెక్కు మహిమలను జూపించి ప్రసిద్ధికాంచిరి.

జ్యేష్ఠులగు లక్ష్మణకవిగారు కవితాప్రభావముచే విజయరామగజపతిమహారాజుగారిని మెప్పింపగా, వారు లక్ష్మణకవిగారిని రేసులవలసముతాకు ముస్తాజరులుగా నధికారమిచ్చి, సవారి, జోడు మశాల్లు, దినమునకు ఆరురూపాయిలు భత్యఖర్చు ఏర్పాటుచేసిరి. అపుడు సంభవించిన కాటకములో లక్ష్మణకవిగారు అగ్రహారములలోని బ్రాహ్మణుల బీదతనమును జూచి, కనికరించి, కొన్ని సంవత్సరములు శ్రోత్రియము కాపు చేసిరి. వారివిరోధు లప్పుడు కుట్రచేసి, స్వామిద్రవ్యాపహరణము చేసిరని మహారాజులతో కపటపరిచి చెప్పగా, అవమానము కలుగునేమోయని భయపడి

లక్ష్మణకవిగారు ఆత్మహత్య కావించుకొనిరి. విజయ రామగజపతిమహారాజుగా రిది యెఱిగి, కుట్రదారులను శిక్షించి, లక్ష్మణకవిగారి కుమారులకు పూర్వపుమర్యాదలు శాశ్వతముగా జరుగునట్లు ఏర్పాటుచేసిరి. లక్ష్మణకవిగారి మూడవకుమారు డగు పేరయకవిగారు కామన్నవలస విడిచి, పాలతేరను గ్రామమునకు బోయి, యచ్చట దామెరవారను వెలమదొరలకు గురువులై, యచ్చటనే కాపుర ముండిపోయిరి. వీరు రచించిన గ్రంథములు నిరోష్ఠ్య దాశరథిశతకము, ఇందుమతీపరిణయము, కుముద్వతీపరిణయము మొదలగునవి పెక్కు కలవు.

పేరయ్యకవిగారి కుమాళ్లు కామకవిగారు మహర్షులు. వీరు నిత్యతపస్సంపన్నులు; మహారాజోపాసకులు; మహారాజులమన్ననను తృణీకరించినవారు. దారిద్ర్యముననే సంతృప్తిబొంది మహాగ్రంథములు రచించినవారు. వీరు రచించిన గ్రంథములు లెక్కకుమిక్కిలిగా గలవు. బ్రహ్మోత్తరఖండము, కార్తికవ్రతమహత్త్వము, బలరామక్షేత్రమహత్త్వము, శతకములు, దండకములు, స్తోత్రములు, ఈ మొదలైన వెన్నో వీరు రచించిరి. వీరి శైలి ప్రౌఢమైన ప్రబంధమార్గమున రచించిన పురాణములలోని శైలివలె నుండును. కవిత్వమున శ్రీనాథు డీయనకు మార్గదర్శి. ప్రవర్తన పోతనార్యుని ప్రవర్తనకన్న మిన్నయైనది. దానమొనర్పవచ్చిన మహారాజు నీయన లక్ష్యముచేయలేదు. తన్నుపోషించుచుండిన ప్రభువును గూడ తనయిచ్చకువచ్చినప్పుడే దర్శించుచుండెను గాని, వారు కోరినప్పుడుకాదు. తపస్సునను, కవితాతపస్సునను జీవితకాల మంతయును గడపిన మహాకవి, మహాత్ముడు, మహానుభావు డీయన.

ఈయనపెద్దకుమారుడగు రామస్వామికవిగారు అవధూతానుభూతిగీతలు, ద్వాదశమంజరి కాస్తోత్రము, గంగాలహరి, గంగాస్తవము మున్నగునవి కందపద్యములుగానే తెనిగించిరి. వీరు రచించిన వన్నియును కందపద్యములే. వీరికందములు తిక్కనకందములకు మెఱుగెక్కించిన ట్లుండును.

కామకవిగారి రెండవకుమారుడు పార్వతీశ్వరకవిగారు. వీరు ప్రఖ్యాతపురుషులు. శ్రీ బొబ్బిలిసంస్థానమున నాస్థానకవులుగా నుండి, శ్రీమదానంద గజపతి మహారాజుల యాదరణ సత్కృతులకు పాత్రులై శ్రీ వేంకటగిరి, జటప్రోలు, ప్రముఖ మహా సంస్థాన ప్రభువులచే సమ్మానితులై, మహాప్రఖ్యాతి గడించిన వారు వీరిచరిత్రము కొంతవరకు భారతిలో ప్రకటితమైనది.



మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు,
వయస్సు ౪౫, ఆధ్యాత్మిక కవి.

అభినవాంధ్ర కవితా పితామహులగు పార్వతీశ్వరకవిగారి చరిత్రము ప్రత్యేకగ్రంథముగా వారి పౌత్రులగు పార్వతీశ్వరశాస్త్రిగారు వ్రాసి యున్నారు కావున, విస్తరించి వ్రాయలేదు. కామకవిగారి మూడవ కొమారుడు పేరయకవిగారు పెక్కుదండకములును, శతకములును రచించిరి. వీరు గొప్పపౌరాణికులు; గొప్పతపశ్శాలులు. వీరు తమ మహిమను కవిత్వమునకన్న తపస్సునెక్కుడుగా జూపించిరి.

రామస్వామి కవిగారి కుమారుడు కామకవిగారును, వారి పౌత్రుడు రామస్వామియును, పెక్కు గ్రంథములు రచించిరి. పార్వతీశ్వర కవి గారి కుమారుడు కామకవిగారు ప్రాస్తావిక పద్యావళి, కాశీదర్పణము మొదలగు గ్రంథములు రచించిరి. వీరును తండ్రిగారివలెనే బొబ్బిలి సంస్థాన

మున నాస్థానకవులుగ నుండిరి. కామకవిగారి కుమారులలో జ్యేష్ఠులు పార్వతీశ్వరశాస్త్రిగారు. వీరు బాల్యము



కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

నుండి కవులై యాంధ్రదేశమున నిప్పుడు ప్రఖ్యాతులై యున్నారు. వీరు ప్రథమదశలో రచించిన గ్రంథములు ప్రాచీన ప్రబంధ ధోరణిలో నుండును. కాని, క్రమముగా వీరు సనాతనాధునాతనమార్గసమ్మేళనమున వ్రాయ నారంభించినారు. వీరు ప్రాచీనమార్గమునందే యభిరుచి గలవారై యున్నారు. వాడుకభాషయందు ప్రేమ గలవారై, వాడుకభాషలో గ్రంథములు రచించినవారే యైనను, వాడుకభాషలో గ్రంథములు రచించుట క్రొత్తగా నెవరో తెచ్చిపెట్టినది కాదనియు సనాతన సంప్రదాయమే యనియు, చెప్పుచుందురు. వీరు రచించిన గ్రంథములు లెక్కకు మిక్కిలిగానున్నవి. అందు సుజనామోదిని, సావిత్రీసత్యవంతము, ప్రేమము, దీనచింతామణి మొదలగునవియును, వేంకటరావు, కాముది, మోసము మొదలగునవియును మధ్యదశలో ప్రకటింపబడి యున్నవి. ఉదంకుడు, పాలవెల్లి, తేనెపట్టు, విరిసజ్జ, పార్వతీశ్వరకవిజీవితచరిత్రము మొదలగునవి నేటి రచనలై యున్నవి. వీరి విమర్శనములు, వ్యాసములు, ప్రత్యేక పద్యములు సంపుటములుగా గూర్చి ప్రకటింపవలసియున్నవి. మ. రా. రా. వేమవరపు కామేశ్వరరాయ కవిగారు పార్వతీశ్వర కవిగారి జీవిత చరిత్రమును గ్రంథ విమర్శన పూర్వకముగా ప్రకటింపదలచి యున్నారు. కావున నేనిందు ప్రత్యేకించి వ్రాయలేదు. పార్వతీశ్వర కవిగారి సోదరులు వేంకటశాస్త్రిగారు వైణికులు కీర్తి శేషులగు నందిగాన వేంకట శాస్త్రిగారి యొద్దను, తుమరాడ సంగమేశ్వర శాస్త్రిగారియొద్దను వీణాభ్యాస మొనర్చి వీణావాదనమున నారితేరియున్నారు.

ఈ పార్వతీశ్వర శాస్త్రిగారి జ్యేష్ఠసోదరి యగు శ్రీమతి దొడ్డ లక్ష్మీనరసమాంబగారు గొప్పవిదుషి. సంస్కృతాంధ్రములయందును సంగీతమునందును సముచిత వైదుష్యము గలిగి పురాణ పఠనమున నారితేరి, మంత్ర శాస్త్రమున పూర్ణ పట్టాభిషిక్తురాలై, శ్రీచక్రోపాసనమున నే దినములు గడపుచు నీ సాధ్వీమణి తపోనిష్ఠలోనుండి ప్రఖ్యాతురాలై యున్నది.

బ్రహ్మీభూత కామకవిగారి నుండి నేటివరకు, అనగా సుమారు మున్నూరేండ్లనుండి, పదితరములనుండి మండపాకవారియింట సనాతనమైన విషయములు మూడు కలవు.

౧. తాతమనుమల వరుసను తప్పకుండ యతులగుట.

౨. కావ్యనాటకాలంకార సాహితీ యుక్తులై, అందఱును కవులై, కవినామధేయమున ప్రఖ్యాతులగుట.

౩. మంత్రశాస్త్రమున పూర్ణపట్టాభిషిక్తులై, యాధ్యాత్మిక జీవనమునను, ఆధ్యాత్మిక రచనమునను ప్రఖ్యాతులగుట.

ఈమూడును నేటివరకు నవిచ్ఛిన్నముగా వచ్చుచున్నవి.

ఆంగ్లేయవిద్యాభ్యాసమువలన నీ కుటుంబమున కొన్ని క్రొత్తపోకడలుగలిగినను, మొత్తముపైని సనాతనాచారావలంబనమునందే యీకుటుంబమువారికందఱికిని ప్రేమవిశ్వాసములు కలవు.

మండపాకవారి కుటుంబముతో సంబంధించినవి మఱికొన్ని విద్వత్కుటుంబములు కలవు.

౧. వాహినీపతివారు. వాహినీపతి సూరకవిగారు పార్వతీశ్వరకవిగారికి మేనల్లుళ్లు. ఈయన సరస్వతీ విజయము, సానందోపాఖ్యానము మొదలగు గ్రంథములు రచించెను. ౨. గుమ్మలూరివారు. గుమ్మలూరి వేంకటశాస్త్రిగారు మహావైణికకవులు. సుప్రసిద్ధులగు నందిగాన వేంకటశాస్త్రిగారు, తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు, కట్టు సూర్యనారాయణగారు మొదలగు వైణిక విద్వాంసులు వీరి శిష్యులే. వీరు రచించిన గ్రంథములలో ప్రధానమైనది పల్లవోల్లాసము ఆనంద గజపతి మహారాజుల కంకితము గావింపబడినది. గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రిగారు తార్కిక చక్రవర్తులు. ఆసేతుకాశీతలాంతమగు భారతవర్షమున వీరిని మించిన తార్కికులు లేరని తజ్జ్ఞు లంగీకరించియున్నారు. గుమ్మలూరి నరసింహశాస్త్రిగారు మహా మహోపాధ్యాయులగు పరవస్తు వేంకటరంగనాథాచార్యవరగురువులకు శిష్యులై మహావిద్వాంసులై యున్నారు. సత్యానందనాథస్వామి యను పేరుగల శ్రీ బండారు సత్యనారాయణశర్మగారు పూర్ణపట్టాభిషిక్తులై, మహాతపస్సంపన్నులై ఇప్పటి పార్వతీశ్వరశాస్త్రిగారికి ఆధ్యాత్మికవిద్యాగురువులై యున్నారు. వీరిచరిత్రము పార్వతీశ్వరశాస్త్రిగారే మున్ముందు ప్రకటింతురు. ఇంకను తాతవారు, కవిరాయనివారు మొదలగు విద్వత్కుటుంబములు మండపాకవారితో సంబంధ బాంధవ్యములు గలవై యున్నవి.

మండపాకవారి వంశచరిత్రము సంపూర్ణముగా వ్రాయుటకు తగినయాధారములు ఇప్పుడు సజీవులై యున్న పార్వతీశ్వరశాస్త్రిగారియొద్ద కలవు కావున ఆపని వారే చేయవలసియున్నది. మండపాకవారి వంశచరిత్ర వ్రాయుటయు, ఆవంశమున బుట్టిన కవులు రచించిన నూరులకొలదిగానున్న గ్రంథముల బ్రచురించుటయు ఇప్పుడు జీవించియున్న మండపాకవారికి తప్పనిపనియైయున్నది. వారి వంశకీర్తిని శాశ్వతముగా నిలుపుకొనుటకై వా రాకార్యము నిర్వహింపవలసియున్నది. అట్లే ఇతర కవికుటుంబముల చరిత్రములును ఆకుటుంబములలోనివారే వ్రాయుటకు తగిన యధికారసంపత్తులుకలవారై యున్నారు. అట్టి విద్వత్కుటుంబములచరిత్రలు వ్రాయగలవారిచే వ్రాయించి తగిన ప్రోత్సాహ మొసంగుభార మాంధ్రలోకముపై గలదు. తరతరములుగా కవితాకళను, తదితరకళలను తమయింట నిలుపుకొని కళోపాసనా రూపతపస్సున జీవితములు ధారవోసిన విద్వత్కుటుంబములజీవితములు ధన్యములు.



# 'టెక్నికలర్ టాకీలు'

య:౯. జగన్నాథస్వామి

టాకీలు ఇంకా వచ్చాయో లేదో, మనదేశపు జనంలో నూటికి పదిమందయినా ఇంకా వాటిని తిన్నగా చూచారో లేదో అప్పుడే ఇతరదేశాలలో రంగులటాకీలూ, మూడుపరిమాణాలు (3 Dimensional Talkies) గల టాకీలూ తయారవుతున్నాయి. వీటికన్నిటికీ దిగదుడుపు పెట్టెలాటి (Telivision) దూరదర్శకతలలా ఉండగా సాధారణపు ఫోటోగ్రాఫులూ, సినీమాలు చూచినతరువాత, "మనుష్యులపోలికలు అంత సరిగా ఏలావస్తాయో" అనేసందేహం తీరకపోయినా, కలగటంలేదు. వెల్తురు, కెమేరా, ఫిల్ము - వీటిపరస్పర సంబంధాలు తెలియకపోయినా, ఏదో, అలా ఫోటోలుతీయడం కెమేరాఅలవాటులలో ఒకటిగా పరిగణించబడి, అంతఅపనమ్మకం -జీవకళ పోతుందను కోవడం—కొంతతగ్గింది. ఇంక కొన్నిసంవత్సరాలు పోతే రంగులటాకీలుకూడా ఆలాగే పరిపాటిఅవుతాయని ఊహింపవలసిఉంటుంది. అయితే ప్రస్తుతంలో మాత్రము బొమ్మలు ఏలామాట్లాడతాయిరా అనేప్రశ్నతోపాటు, రంగులుకూడా ఏలావచ్చాయో అనేప్రశ్న పామరులలోనేకాక పండితులలోకూడా పుట్టడం సహజం. ఈప్రశ్నకు సమాధానము చెప్పి, ముఖ్యముగా ప్రపంచమంతలోను మెప్పుపొందిన అనేకవర్ణవిధానము (టెక్నికలర్ ప్రోసెస్ - Techni colour Process) వల్ల రంగులఫిల్ములు ఏలా తయారుచేస్తారో పరిశీలించడానికి అవకాశమున్నది.

సాధారణముగా మనకంటికి ప్రకృతిలో నానా వస్తువులు వేరువేరురంగులతో కనిపిస్తున్నాయంటే ఆయారంగులగుణము మనకు ఏలా తెలుస్తున్నది అని మొదటిప్రశ్న. దానికి యంగ్, హెల్మ్‌హోల్ట్జ్ (Young and Helmholtz) అనేవాళ్లు ప్రత్యక్షముగా ఋజువుచేసిన దేమిటంటే, కంటికీ రంగులకూ గల సంబంధము సరిగా చెప్పలేకపోయినా, నీలము, ఆకుపచ్చ, ఎఱుపు అనేమూడురంగులకాంతుల మిశ్రమముతోటి మనకంటికి కనిపించే ఏరంగులనైనా పుట్టించవచ్చు, ప్రదర్శింపవచ్చునని. ఇక ఈనిరూపణను బట్టి మొట్టమొదటి రంగుఫిల్ము తయారుచేయపూను కొన్నవాళ్లేంచేశారంటే, ఒకటేసీనును ఈమూడు రంగుల 'ఫిల్టరు'లు వేసి మూడునెగెటివులు (రూపప్రతిబింబమును గ్రహించిన ఫోటోఅద్దాలను నెగెటివులంటారు) తీశారు. తరువాత ఏనెగెటివునుంచి తీసిన 'కాపీ'కి ఆ'ఫిల్టరు'రంగు వేసి, ఈ మూడుకాపీలు తెరమీద ఒకటేచోట పడేటట్లు చేసి చూస్తే దాదాపు ప్రకృతిసహజమయిన రంగులు వచ్చాయి. అయినా మూడుకెమేరాలు ఒకటేచోట పెట్టి ప్రదర్శించడానికి వీలు లేదు కనుక తెరమీద 'లెన్సు' ల దూరాన్నిబట్టి రూపములకు యథార్థస్థానవ్యత్యాసదోషము (Parallax error- పారల్లాక్స్ ఎర్రర్) కలిగింది; అనగా మూడు బొమ్మలూ సరిగా ఒకదానిమీద ఒకటి అతికినట్లుపడడానికి వీలులేకపోయింది. అందుచేత, అచ్చులో మూడు వేర్వేరుదిమ్మలతో మూడురంగుల బొమ్మ (Tri-colour picture) కొంచెం అజాగ్రతగా అచ్చువేస్తే ఏలాఉంటుందో - బొమ్మవి ఒక్కొక్కరంగు అంచుగీతలు ఈప్రక్క, ఆప్రక్క ఎగుడుదిగుడుగా కనిపిస్తూ,—అలా తయారయింది ఈఫిల్ముకూడాను.

ఇక దీనినిబట్టి, బుద్ధిమంతు లందరూ నిశ్చయం చేసుకొన్న దేమనగా, ఎల్లాగో కష్టపడి మూడునెగెటివులు సంపాదించి, ఈమూడురంగులతోటి ఒకటేకాపీ తీయగలిగితే ఈప్రొజెక్షనులో (ఫిల్మును ప్రదర్శించడములో) కలిగేలోపము తీరుతుందికదా అని. ఈప్రథమ ప్రయత్నము సఫలము కాకపోయినా, ఫలసిద్ధికి త్రోవ చూపించింది. ఇప్పుడు ఎఱుపు 'ఫిల్టరు' పెట్టి ఒకనెగెటివు వచ్చిందనుకోండి. ఈనెగెటివులో వున్న తెలుపు నలుపులు వేటిని తెలుపుతాయి? అసలు సీనులో ఎఱుపు

లేనిచోట్లను, ఎఱుపుఉన్నచోట్లను తెలుపుతాయి. ఒక ఎఱ్రటితలపాగా ఉందంటే అది నెగెటివులో తెల్లగా వస్తుంది; అదే ఏఆకుపచ్చగానో ఉంటే నల్లగా వస్తుంది. అందుచేత ఈనెగెటివులోనుంచి తీసిన కాపీ దేన్ని తెలుపుతుందంటే, అసలు సీనులో ఎఱుపులేనిచోటులు ఇందులో నల్లగాను, ఎంతమాత్రము ఎఱుపుఉంటే అంతమాత్రము తెల్లగాను వస్తాయి. దీన్నిబట్టి ఏయే రంగుఫిల్టరువేసితీసిన నెగెటీవులు ఏలా ప్రింటుచేయాలో తెలుస్తుంది.

తరువాత ఈమూడునెగెటివులు ప్రింటుచేయడంలో కష్టాలు లేకుండాఉండేటందుకు ఇప్పటిసాధారణపురంగుచిత్రముల ప్రింటింగులోవలె 'మొజెయిక్ ప్రోసెస్' (Mosaic prccess) అనేపద్ధతిని అనుసరించారు. ఇందులో పరమాణుప్రమాణముగల రంగుల చుక్కలు - ముఖ్యమయిన మూడురంగులవీని - ఉన్న ఒకఫిల్ము (Screen film) తయారుచేసి, దాని వెనకాల నెగెటివు, ఫిల్మునిపెట్టి సీనుతీసి, ఈనెగెటివునుంచి తీసిన కాపీకి మొదట ఉపయోగించినరంగుఫిల్ములాటిది ఒకటి అతికించి దాన్ని తెరమీద ప్రదర్శనం(ప్రొజెక్టు-Projeect) చేశారు. అప్పుడు సరిఅయిన రంగులు కనిపించినా అంత అందము రాలేదు.

ఈ పద్ధతిలో ఉపయోగించినసూత్రము (Principle) అచ్చులో వచ్చే ఫోటోగ్రాఫుబొమ్మలు చూస్తే బాగా బోధపడుతుంది. కొంచెం బాగా పరిశీలిస్తే ప్రతి అచ్చువేసిన ఫోటోబొమ్మను చుక్కల (Grain) వల్ల ఏర్పడినదిగా కనిపిస్తుంది. ఇందులో చుక్కలు ఎంతసూక్ష్మమయినవిగా (Fine grain) ఉంటే అచ్చులో బొమ్మ అంతఅందముగాకనిపిస్తుంది. ఇంకొక సర్వసాధారణమయిన ఉదాహరణము చిల్లులఅట్టలో కుట్టిన రంగులరంగుల ఊలుబొమ్మలు. ఇవి దూరంగా ఉన్నప్పుడు అందంగా కనబడడానికి కారణమేమిటి? చిల్లులు దూరానికి కలసిపోయి ఆయారంగులు గల ఊలు కొంచెం ప్రకృతిసహజమయినరంగులాగ కనిపించడమే. కనుక ప్రతిబొమ్మని, ప్రతిరంగుని చిన్నచిన్న చుక్కల గుంపుచేత ప్రదర్శించవచ్చునని ఈపద్ధతి నవలంబించినారు. కాని ఈరంగుచుక్కలు గల ఫిల్ము తయారుచేయడము చాలాకష్టమయిన పని. అందులో ప్రతి చతురపుఅంగుళపు ఫిల్ములోను పదిలక్షలకంటె ఎక్కువ చుక్కలు ఒక్కొక్కరంగువి ఉండాలంటే - అటువంటిది, వేలకొలది అడుగుల ఫిల్ము ప్రతికాపీకి కావలసివచ్చేటప్పుడు వ్యయప్రయాస లత్యధికము. అందుచేత ఈపద్ధతికూడా నిలిచిందికాదు.

కనుక మళ్లీ ఈమూడునెగెటివుల పద్ధతికే వచ్చి, మంచిప్రింటు తయారుచేయడానికి చేసిన ప్రయత్నాలలో ముఖ్యమయిన విషయ మొకటి తేలింది. అది ఏమిటంటే, ఎఱుపురంగు ఫిల్టరువేసి తీసిన నెగెటివుని ఎఱుపురంగుకాపీగాకాక మిగిలిన రెండు ముఖ్యమయిన రంగుల (Primary colours) తోను, అనగా, నీలము ఆకుపచ్చ (Turquoise base) రంగులతోను, ఈవిధముగానే మిగిలిన కాపీలున్నూ తీస్తే ఎక్కువ అందంగా ఉంటుంది మిశ్రమము అని. ఈవిధానాన్నే కొంచెం మార్చి అనేకవర్ణపద్ధతి (టెక్నికలర్ ప్రోసెస్) లో ఉపయోగించారు. ఈవిధంగా ఏరంగు ఫిల్టరువేసి తీసిన నెగెటివును ఆరంగుతప్ప మిగిలినరంగులలో ప్రింటు చేయుటనువ్యవకలకలనపద్ధతి(Subtractive process) అంటారు.

| నెగెటివుముందరవేసే ఫిల్టరురంగు | కాపీకి ఉపయోగించే రంగులు |
| --- | --- |
| ఎఱుపు | ఆకుపచ్చ,నీలము(Turquoise) |
| ఆకుపచ్చ | ఎఱుపు,నీలము (Magenta) |
| నీలము | పసుపుపచ్చ |

టెక్నికలరు పద్ధతిలో మూడునెగెటివులూ ఒకటే కెమెరానుంచి తీసి, ఆనెగెటివులనుంచి పైపద్ధతి ప్రకారము కావలసినరంగులలో మూడుకాపీలు తయారుచేసి కొంచెం తెలుపు నలుపు ఉన్న వేరొకకాపీ (Key print - కీ ప్రింటు) మీదకి ఈరంగుల కాపీల మీదనుంచి రంగులను మార్చారు, 'ఇంబైబిషన్' (Imbibition) అనే పద్ధతివల్ల.

ఈ'ఇంబైబిషన్'పద్ధతి ఏలాటిదంటే-చిన్నపిల్లలు నాటకప్పేపర్లలోనుంచి బొమ్మలు నోటుపుస్తకాల

లోని కెక్కించటంలాంటిది. బొమ్మ తెల్లకాగితంమీద పెట్టి నున్నటిదానితో రాపిడిచేస్తే ఆబొమ్మ కొంచెం కొంచెం తెల్లకాగితముమీద అంటుకోవడంలాంటిది. ఈరంగులకాపీలుకూడా అలాగే 'క్రీప్రింటు' (తెలుపు నలుపుకాపీ)మీద పెట్టి కొంతసేపుంచితే ఆరంగులు దానికి అంటుకుంటాయి. అయితే, ఈపద్ధతికి మూడు రంగులకాపీలు ప్రత్యేకము అంటుకొనేటటువంటి రంగులతో తయారుచేస్తారని చెప్పనక్కరలేదు.

ఈపద్ధతి చాలా సున్నితమయినదీ, కష్టమయిన దీని. అయినప్పటికీ ప్రస్తుతంలో ఇంతకంటె సులభమయిన మార్గము మంచికాపీలుచేయడానికి కనిపెట్టబడలేదు. ఒకటేసారి ఈమూడురంగులు ప్రింటుచేసి కాపీ తయారుచేయడానికి ఇప్పటి 'సెన్సిటివ్ మెటీరియల్ - (Sensitive material) ఫిల్ములు పనికిరావు. ఏవో రెండురంగులలో కాపీ తయారుచేయవచ్చు, ప్రస్తుతపు ఫిల్ములమీద మరల మూడవరంగు 'ఇంబైబ్' చేయవలసే వుంటుంది; లేకపోతే,'బ్రూస్టర్ ప్రోసెస్' (Brewster process)లో చేసేటట్టు ఫిల్మును మరల 'సెన్సిటైజ్' (Sensitize), అనగా రూపప్రతిబింబమును గ్రహించేటట్టు చేయాలి. ఇది దుస్సాధ్యము. అందుచేత వాటి అన్నిటిలోనికి 'టెక్నికలరు' పద్ధతియే నిల్చింది,ఉత్తమమయినదిగా. ఇది అమెరికనుపద్ధతి.

దీనికి ప్రతిగా ఇంగ్లీషువాళ్లు కనిపెట్టిన పద్ధతి 'గాస్పాకలర్'విధానము (Gaspa colour process). ఇది చాలా అద్భుతమయిన పరిశోధనయొక్క ఫలితము. ఈవిధానమువల్ల ఈమూడు నెగటివులు ఒకటేఫిల్ముమీద రంగులలో ప్రింటుచేయడానికి అవకాశము కలిగినది. ఈఫిల్ముకి మూడుపొరలుగా రంగుల రసాయనము (Emulsion-ఇమల్షన్)పూతవేసినారు. వీటిలో ఒక రంగు'బ్లూ-గ్రీన్'(నీలము,ఆకుపచ్చ);ఇంకొకటి'మెగెంటా'(ఎఱుపు,నీలము);వేరొకటి'యెల్లో'(పసుపుపచ్చ). అంతేకాక ఒక్కొక 'ఇమల్షను'ను ఒకొక్కరంగు వెలుతురులో ప్రింటుచేయడానికి వీలయ్యేటట్టు చేసినారు. ఇంతకంటె చిత్రమేమన, ఈఫిల్ముని 'ప్రోసెస్' (Process)చేయడానికి ఉపయోగించే ద్రావకములు అనవసరమయినచోట్ల రంగులను తీసివేసి చక్కటిరంగుల కాపీని తయారుచేస్తాయి. ఈపద్ధతివల్ల తయారయిన కాపీ అత్యుత్తమమయి, ఆదర్శప్రాయ మయిన ప్రత్యేకపురంగుఫిల్ములు మూడు కలిపి(Bind) అతికిస్తే ఏలా ఉంటుందో అలా ఉంటుంది. ఈపద్ధతిని ఇంగ్లాండులో ఇప్పుడు ఉపయోగిస్తున్నట్లు తెలియవస్తున్నది.

ఈవివిధపద్ధతులకు ఉపయోగించే నెగటివులను ఏలా తీస్తారనేది ప్రశ్న. మూడు రంగుఫిల్టరులు మూడు కెమీరాలకు వేసి తీసిన నెగటివులలో ఒకదానికీ ఇంకొకదానికి తేడా ఉండి, బొమ్మలు ఒకటే మాదిరిగా ఉండవు. అందుచేత ఒకేలెన్సువల్ల వచ్చిన బొమ్మ (Image-ఇమేజ్) మూడురంగుల ఫిల్ములు తీయడానికి ఉపయోగించవలెనని తీర్మానించారు. ఇక ఈ రంగులలోకి విడదీయడానికి చేసిన అనేకప్రయత్నాలలో అన్నిటికంటె ఉత్కృష్టమయినదాన్ని టెక్నికలరువిధానానికి ఉపయోగించారు.

ఈపద్ధతినిమిత్తము కెమీరా ప్రత్యేకము తయారుచేసినారు. సాధారణపు టాకీకెమీరాలో ఒకటే ఫిల్మూ, ఆవొకఫిల్ముకి ఒకద్వారమూ (Gate - గేటు) ఉంటాయి. అయితే ప్రత్యేకము నిర్మించిన కొత్త కెమీరాలో రెండు'గేట్లు' ఉంటాయి; ఈరెండు'గేట్ల'లోను మూడుఫిల్ములు పడిపేటందుకు వీలుఉంటుంది. మామూలుగా లెన్సుముందర వేసే ఒకఫిల్టరుకు బదులుగా ప్రతిఫిల్ముముందర కావలసిన ఫిల్టరువేస్తారు. ఇక ఈచిన్నమార్పు లన్నిటికంటె ముఖ్యమయినదీ, మిక్కిలి ఉపయోగమయినదీ ఏదంటేఒక'హాఫ్‌సిల్వర్డు మిర్రర్', (సగముసగము, అనగా అంటీఅంటకుండా కళాయి చేసిన అద్దము). ఈయద్దము ఒకటేలెన్సులో నుంచి వచ్చిన రూపప్రతిబింబమును (ఇమేజ్) రెండుగా విడదీసి ఒక్కొకదాన్ని కెమీరాయొక్క ఒక్కొకవైపుకు పంపుతుంది. అద్దము సగముసగము కళాయిచేసినది (హాఫ్ సిల్వర్డు) అగుటవల్లను, అది రూపప్రతిబింబము వచ్చు దిశకు ౪౫ డిగ్రీలు కోణము ఏర్పడేటట్టుగా అమర్చబడుటవల్లను రూపము (Image) ప్రతిబింబితమయి అద్దమున కెదురుగా నున్న కెమీరాగేటుమీదను,

అద్దములోనుంచి వెనుకనున్న కెమిరాగేటుమీదను పడును.




Lens Image parallel to the wall with gate with blue filter.

1. Half Silvered Mirror-సగము కళాయిపూసిన అద్దము.
2. 1st Gate:-మొదటి కెమిరాగేటు - Yellow Filter తో.
3. 2nd Gate with Blue Filter-రెండవగేటు నీలపుఫిల్టరుతో.
4. Orthochromatic Film with red filter backing (8).
5. Panchromatic Emulsion
6. Blue Record film.

ఈప్రక్కగేటులో నున్న ఫిల్ము నీలపురంగు ఫిల్టరుద్వారావచ్చిన నెగటివును తీయును. ఈగేటులోనున్నది ఒకేఫిల్ము. అద్దమువెనుక నున్న గేటులోమాత్రము రెండుఫిల్ములు ఉపయోగించబడినవి. మొదటిది సాధారణపు(Orthochromatic)ఫిల్ము. దీనిరసాయనపు (Emulsion) ప్రక్కయును, దీనివెనుకనున్న (Panchromatic) ఫిల్ముయొక్క రసాయనపు (Emulsion) ప్రక్కయును చేర్చి యుంచబడినవి. అయితే మొదటి ఫిల్ముముందర, గేటులో పసుపుపచ్చ (Yellow)ఫిల్టరు ఉపయోగించబడినది. అందుచేత మొదటిఫిల్ముమీద పసుపుపచ్చఫిల్టరుద్వారాతీయబడిననెగటివు ఏర్పడును.

ఇక ఈఫిల్ముచెనుకభాగమునకు ఎఱుపుఫిల్టరు రంగు పూయబడినది. కనుక మొదట పసుపుపచ్చఫిల్టరు ద్వారా వచ్చిన రూపప్రతిబింబము ఈఎఱుపుఫిల్టరు ద్వారా వెనుకనున్న ఫిల్ముమీద పడును. కనుక ఈ ఫిల్ముమీద రెండురంగులు ఫిల్టరుద్వారా తీసిన నెగటివు ఏర్పడును. కనుక దీనిని ఆకుపచ్చకాపీమీద తీసిన చాలును.

కాబట్టి ఈప్రత్యేకపు కెమిరామూలముగా మూడు నెగటివులు ఒకేలెన్సునుంచి వచ్చిన 'ఇమేజ్' వల్ల తయారయి 'పారల్లాక్స్' (Parallax) బాధను తప్పించినవి.

ఇక ఈపద్ధతియందు ముఖ్యముగా గమనింపవలసిన విషయము - సీనుకు ఎక్కువవెలుతురు ఇవ్వవలసి వచ్చుట. ఈకష్టము ఎక్కువ 'పవరు'గల లెన్సులుఉపయోగించి తప్పించుకొనవచ్చును. మరియొక విషయము-నటీనటకుల ముఖములకు కావలసినంత వెలుతురుమాత్రము నిచ్చుట. అట్లు కానియెడల ముఖమునందలి లేతరంగులు చెక్కిళ్లయొక్క ఎఱుపు మొదలయినవి సరిగా రావు సినీమాలో.

ఈటెక్నికలరువిధానము శబ్దమునకు (Sound Track) ఏమియు చెఱుపుకలిగింపదు.

# పరామర్శ

బుఱ్ఱా వెంకటసుబ్రహ్మణ్యము

తన మొగుడు పోయాడన్న వార్త వచ్చిననాడు అందరూ అంతమతులుపోయినవాళ్లల్లా ఏడవడానికి కారణం ఒకవిధంగా తనకి బోధపడింది. పక్కఇంటివారి జానమ్మమాట తలపెట్టినప్పుడల్లా అందరూ 'అయ్యో పాపం!' అనడం తను చూస్తూనేఉందికా! కాని పక్కఇంటివారిజానమ్మ శుభ్రంగా పెద్దతరగతులలో చదువుకుంటోంది, మిగిలిన ఆడపిల్లలలా కాకుండా ఇప్పుడు తనుగూడా జానమ్మలా చదువుకోవాలన్నమాట!

ఇంట్లోఉన్నవాళ్లందరూ ఒక్కసారిగా గొల్లుమన్నారు. "ఏమిపాపం చేసుకున్నావే, నాతల్లీ? ఏమిపాపంచేసుకున్నావే? ఏమిపాపంచేసుకున్నావే?" అంటూ తనతల్లి తనని కాగలించుకొని నేలమీదకూలబడి ఏడుపు మొదలుపెట్టింది. "పిలిచిపిల్లనిస్తే శత్రువైపోయాడే! పరమశత్రువైపోయాడే!" అని మళ్లీ మళ్లీ తననాయనమ్మ గోలపెట్తూ, తలబాదుకుంటూ ఒకమూల చతికిలబడింది. తనఅన్నగారు తనరెండుచేతులూ రెండుచేతులలోనూ గట్టిగాపట్టుకుని పెద్దపెట్టున రాగాలుపెట్తూ కూర్చున్నాడు. ఇంటిదాసీమనిషికూడా పనిమానుకునివచ్చి స్తంభానికి జార్లబడి అందరికేసీ చూస్తూ, తనూ ఏడుస్తోంది. అసలుకారణంఅటుండగా వీళ్లందరూ ఇలాఏడవడంచూస్తూ తనుగూడా గుక్కతిరగకుండా ఏడ్చిఏడ్చి, ఆఖరికి సొమ్మసిల్లిపోయింది. మొదటినుంచీ వీథిలో వచ్చీపోయేవాళ్లందరూ ఏడుపుధ్వనులువిని కిటికీలలోంచి తొంగిచూడడం, ఎరుగున్నవాళ్లూ ఎరగనివాళ్లూ లోపలికిచొరబడి కాసేపు దుఃఖంగా తమఅందరికేసీ చూసివెళ్లిపోవడంతను కనిపెట్తూనేఉంది. కాని మరికొన్నిసంవత్సరాలు జరిగిపోయేవరకూ ఆనాటి వార్త ఎంతదుఃఖకరమైనదో తను సమంగా గ్రహించలేదు.

ఆవార్త వచ్చిననాటికి పదహారురోజులక్రిందట తనకి పదేళ్లు నిండేయి. అంతకి ఆరునెలలక్రిందట తన పెళ్లిసంబరాలు జరిగేయి. తనకి పెళ్లికానిరోజులలో కామమ్మత్తకొడుకైన నారాయణరావు తనమొగుడని అందరూ వేళాకోళంచేసేవారు. ఆరోజులలో 'నారాయణరావుబావ' అంటే తనకి చాలాసిగ్గుగాకూడాఉండేది. కాని, ఏకారణాలవల్లనైతేనేమి, ఆసంబంధం పడిపోయింది. కామమ్మత్త అందరితోనూచెప్పడం పిల్లకీ పిల్లవాడికీ మూడేళ్లేభేదంకనుక పెళ్లిమాటతలపెట్టలేదని. అసలుకారణం కామమ్మత్తకీ, కామమ్మత్తపెద్దకొడుకు శివరావుకీ కట్నంఆశ ఎక్కువగాఉండడం. ఈసంబంధంచేసుకుంటే డబ్బేమీరాదని వాళ్లిద్దరికీ బాగాతెలుసును. పెద్దకట్నాలిచ్చేందుకూ, ముచ్చట్లన్నీజరిపేందుకూ పిల్లతండ్రైనా బ్రతికిలేడు!

ఆఖరికి తనకి పరాయిసంబంధమే వచ్చింది. తనపెళ్లికి నారాయణరావుబావకూడా వచ్చాడు. మొదటిరోజున నారాయణరావుకేసి చూస్తుంటే ఒకటి రెండుసార్లు పూర్వం అందరూ వేళాకోళానికి అంటూవుండేమాటలు జ్ఞాపకం వచ్చాయి. కాని, ఈ పెళ్లికొడుకు నారాయణరావుకంటె చాలా ఎక్కువ అందమైనవాడనీ లెక్కలేనంత ఎక్కువ తెలివైనవాడనీ అందరూ అనడంవల్లనూ, కొత్తబట్టలలోనూ సంగీతసభలలోనూ ఊరేగింపులలోనూ తనకిసరదా రోజురోజుకీ హెచ్చిపోవడంవల్లనూ నారాయణరావుమాట రెండురోజులలో తను పూర్తిగా మరచిపోయింది.

తనమొగుడుపోయిన నాల్గవరోజున తన పినతల్లి వీరభద్రమ్మా, వీరభద్రమ్మకూతురు సీతా తమ యింటికి వచ్చారు. వాళ్లూ గుమ్మంలో కాలుపెట్టగానే తన నాయనమ్మా, అమ్మా ఇద్దరూ గొల్లుమని ఏడవడం మొదలుపెట్టేరు. వీరభద్రమ్మచిన్ని చీరకొంగుతో కళ్లు తుడుచుకుంటూ తనని కాగలించుకుని ఏడ్చింది. తనకి

కూడా మళ్లీ ఏడుపు వచ్చింది. నాలుగురోజులజట్టి చుట్టాలూ, స్నేహితులూ పరామర్శకిరావడం, తనదగ్గర కూర్చోడం, వాళ్లు ఏడవడం, తను ఏడవడం జరుగుతూనే ఉన్నాయి. మొదటిరోజు రాత్రి ఎవరూ అన్నాలు తినలేదు. ప్రతివాళ్లూ మిగిలినవాళ్లని 'అన్నాలు తినండర్రా' అని పోరేవాళ్లేకాని ఒక్కరూ భోజనాలకి లేవలేదు. రాత్రి తను కొంచెం పాలు తాగింది. రోజల్లా మంచినీళ్లుమట్టుకు అందరూ చెంబులకొలది తాగేరు. రెండవరోజున మళ్లీ ఒక్కపూటే భోజనం చేసేరు. పొద్దున్న తనకి మూలగదిలోకి వాళ్లమ్మ కాస్తచేరూ అన్నం కాస్తమజ్జిగా అన్నం తెచ్చి పెట్టింది. ఆసాయింత్రం తనకి కాఫీతాగాలనిపించినప్పటికీ ఎవరూ తాగడంలేదనిచూసి తను అడగడానికి సందేహించింది. రాత్రి వాళ్ల నాయనమ్మ కొంచెం మజ్జిగ తెచ్చి ఇచ్చింది. మొన్నాడుపొద్దున్న ధైర్యంచేసి తను కాఫీ కావాలంది. ఆతర్వాత కాఫీలూ,భోజనాలూ అన్నీ మామూలుగానే జరిగేయి.

నాలుగురోజులుగడిచేక అందరిదుఃఖాలూ కొంచెం అణిగినట్టు అనిపించింది. అదికాక తనకి సీత రావడంవల్ల ఒక కొత్తవ్యాపకం దొరికింది. సీతతండ్రి ఇప్పుడు దక్షిణాన్ని ఏదోపెద్దఊళ్లో పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. సీత అనేక కొత్తసంగతులగురించి తనతో మాట్లాడుతూఉండేది. సీత తనకంటె రెండేళ్లపైన ఆరునెలలు చిన్నదైనప్పటికీ తనకంటె పెద్దదానిలా కబుర్లు చెప్తూఉండేది. అన్నిటికంటే ముఖ్యమైనసంగతి, సీతకి చీట్లపేక ఆడడం తెలుసును. ఈసారివస్తూ ఒక చీట్లపేక తీసుకువచ్చిందికూడాను. ఇద్దరిలో ఆడగలిగిన ఆటలు సీతకి అనేకం తెలుసును. అవన్నీ తనకిప్పుడు నేర్పింది. ఈ ఆటలు నేర్చుకుని ఆడుకుంటూ ఉండేసరదాల్లో మిగిలిన ఆలోచనలు తనకి దూరమైపోయాయి.

రెండుమూడుసార్లు సీతా, తనూ ఆడుకుంటూ, ఉండగా పరామర్శకి కొందరుమనుష్యులురాగానే తన నాయనమ్మవచ్చి సీతని కోప్పడి, ఆపేకముక్కలన్నీ దాపించేసి, ముందు సావిట్లోకివెళ్లి, మామూలుగా వచ్చినవాళ్లతోకూర్చుని ఏడ్చి, తర్వాత వాళ్లని తనగదిలోకి పరామర్శకి తీసుకువచ్చేది. రానురాను తనకొక విచిత్రమైన విషయం తేటబడింది. పరామర్శకి మొదటిరోజులలో రాకుండా ఆలస్యంగావచ్చినవాళ్లు చాలామంది కంటనీరుపెట్టకుండా తనకేసి తేరిపారిచూసి వెళ్లిపోయేవారు. తనఅమ్మా నాయనమ్మా మట్టుకు ప్రతిక్షణం కళ్లు పంచకొంగులతోఅద్దుకుంటూ ఉండేవారు. అటువంటి సమయాలలో తనకి ఏడుపువచ్చేదికాదు.

ఒకరోజున తనూసీతా ఆడుకుంటూఉండగా ఎవరోపరామర్శకివస్తే తన నాయనమ్మవచ్చి క్రిందపడి ఉన్న పేకముక్కలన్నీ మాట్లాడకుండా లాక్కుని పెట్టెసందునపారేసింది. చేతులలో ముక్కలుమట్టుకు చేతులలోనే ఉన్నాయి. ఆటపట్టుదలలో సీతకీ తనకీ కూడా చాలాకోపంవచ్చింది. ఆకోపంలో తను "ఎవరు వచ్చినాసరే, నేను పేకాడడంమానను, నాయనమ్మా" అంది. తననాయనమ్మ ఒక్కక్షణం ఏడుపుముఖంపెట్టి తెల్లబోయిచూస్తూ చటుక్కున సీతచేతిలోఉన్న పేకముక్కలునాలుగూ లాక్కుని చింపి ఒకమూలగా విసిరేసింది. సీత బేరుమని ఏడుస్తూ వాళ్లఅమ్మదగ్గరకి పరుగెత్తింది.

పదవరోజున తనకి పుస్తెలుతీసేసేరు. అప్పుడు కూడా తనకి ఏడుపురాలేదు. ఆతర్వాత అయిదారునెలలవరకూ మామూలుగా పాఠశాలకి వెళ్లడంమానుకుంది. ఆ అయిదారునెలలూ తన అన్నగారూ, అమ్మా తనచదువులగురించి అఖండంగా వాదించుకునేవారు. తనకి చదువుకోవాలన్న అభిలాష ఉండడంవల్ల అన్నగారుచెప్పినట్టు చెన్నపట్నంవెళ్లి వితంతుశరణాలయంలో చదువుకునేందుకు తను చాలాఇష్టపడింది. తనతల్లికి అది ఏమాత్రమూ నచ్చలేదు. "అబ్బాయీ నాకేమీ తెలియదు. నేనెప్పుడూ దగ్గరఉండవలసినరోజులు దానికి. నేనెప్పటికీ ఒప్పను"అని వాదించేదావిడ."శరణాలయం వాళ్లు ఆడపిల్లల్ని చూసుకోడంలో నీకు తీసిపోరు" అని తనఅన్నగారు అంటూఉండేవారు. అతను పెద్దచదువులు చదువుకోనకపోయినప్పటికీ, చెల్లెలైన తనకి చదువులు పూర్తిగాచెప్పించాలని అతను శపథంపట్టేడు.

ఆఖరికి తనపంతం, తనఅన్నగారిపంతం నెగ్గేయి. చదువులకి చెన్నపట్నం వెళ్లింది.

ఎప్పుడుచెన్నపట్నంవెళ్లినా తనఅన్నగారు తీసుకువెళ్తూఉండేవాడు. ఎప్పుడుశెలవులువచ్చినా అన్నగారు చెన్నపట్నంవచ్చి ఇంటికితీసుకువస్తూఉండేవాడు. మొదటిసారి తనతల్లికూడా చెన్నపట్నంవచ్చింది. ఆసారి వాళ్లిద్దరూ తనని శరణాలయంలో వదిలిపెట్టి వెళ్లిపోతున్నప్పుడు పట్టరానిదుఃఖంవచ్చింది. పైకిఏడ్చేస్తే తల్లి మళ్లీతీసుకువెళ్లిపోతుందేమోనన్నభయంతో తనదుఃఖం ఆపుకుంది. వాళ్లు వెళ్లిపోయాక రాత్రంతా ఏడుస్తూ గడిపింది.

రానురాను ఆహాస్టల్‌లో మిగిలినపిల్లలతో సరదాగాకాలక్షేపం చేస్తూ తనదుఃఖాలన్నీ మరచిపోయింది. ఒకటిరెండుసార్లు జ్వరంతగిలినప్పుడూ మరికొన్ని కష్టసమయాలలోనూ శరణాలయంలోఉన్న పెద్దలు స్వంతతల్లులలాగ తనకి ఉపచారం చెయ్యడంవల్ల ఆశరణాలయాన్ని స్వంతగృహంతర్వాత మరొకస్వంతగృహంలా చూసుకునేది.

ఈలోపున తనకి చదువులలో సహజమైన అభిలాషఉండడంవల్ల ప్రతిసంవత్సరం పరీక్షలలో సులభంగా ఉత్తీర్ణురాలయేది. పదిహేనేళ్లు నిండకుండానే మెట్రిక్యులేషన్‌పరీక్షలో జయంపొందింది. మరుసటిసంవత్సరం మేరీరాణీకళాశాలలోఉండి ఇంటర్‌మీడియట్ చదువులు ప్రారంభించింది.

ఆ సంవత్సరమే తనబావ, నారాయణరావు కూడా రాజధానికళాశాలలో గణితశాస్త్రపు ఆనర్సు తరగతిలో ప్రవేశించాడు. నారాయణరావుకి సీతని ఇచ్చి పెళ్లిచేసేట్టట్టు స్థిరపడింది. సీతతండ్రి సీతకి పదిహేనేళ్లు నిండేవరకూ పెళ్లిచెయ్యననడంవల్ల పెళ్లికానప్పటికీ, అవబోయేమామగారిదగ్గర డబ్బుపుచ్చుకుని నారాయణరావుచదువులకి చెన్నపట్నంవచ్చాడు. ప్రతీనెలా ఆయనే నారాయణరావుకి డబ్బు పంపిస్తూ ఉండేవారు.

నారాయణరావు తనని చూడడానికి అప్పుడప్పుడు వస్తూఉండేవాడు. మొదటిసంవత్సరం నెలకో, రెండునెలలకో ఒకసారివచ్చేవాడు, అయిదునిముషాలో పదినిముషాలో ఉండి, కుశలప్రశ్నలుమాత్రంవేసి వెళ్లిపోతూఉండేవాడు. ఆసమయాలలోఅతని కెంతసిగ్గుగా ఉండేదో తనకికూడా అంతసిగ్గుగానూ ఉండేది. అతను వచ్చి వెళ్ళిపోయినప్రతిసారీ కూర్చుని తనతల్లికి "ఈ వాళ నన్ను చూడడానికి నారాయణరావుబావ మాహాస్టల్‌కివచ్చాడు" అని ఉత్తరం వ్రాస్తూఉండేది. రెండవ సంవత్సరం మొదటినాలుగైదునెలలూ పూర్వంలాగే ఎప్పుడోకాని తనని చూడడానికి నారాయణరావు వచ్చేవాడుకాడు. నాలుగైదునెలలయాక రాజధానికళాశాలలో విద్యార్థులు ఇంగ్లీషులో ఒకనాటకం వేసేరు. ఆనాటకంలో నారాయణరావు దొక ప్రధానపాత్ర. నారాయణరావు తనతో ఆమాటఎన్నడూ చెప్పలేదు. రాజధానికళాశాలలో నాటకంచూడడానికి మేరీరాణీకళాశాలలోని విద్యార్థినులు చాలామంది వెళ్లేరు. తనుకూడా వెళ్లింది. నాటకరంగంమీద నారాయణరావుని చూడగానే చాలాఆశ్చర్యపడింది. చూడగానే తనతోఅతను దీనిమాట చెప్పలేదని చాలా కోపగించుకుంది. కాని నాటకంజరుగుతున్నకొలదీ ఆకోపం ఆశ్చర్యం మరచిపోయి, అతని నటనకౌశల్యంచూసి చాలా ఆనందించింది. చూడడానికి వచ్చినవాళ్లందరూ అతనిపాత్రపోషణ మెచ్చుకుని చప్పట్లుకొట్టుంటే ఆచప్పట్లన్నీ తనకేఅన్నట్టు ఉప్పొంగిపోయింది. తనపక్కన కూర్చున్న ఆడపిల్లలతో "అతను నా మేనమామకొడుకు" అని మళ్లీమళ్లీ చెప్పింది. ఆరాత్రి తను హాస్టల్ చేరుకోగానే భోజనంచేసి గదికివెళ్లి నారాయణరావుకి ఒక పెద్దఉత్తరంవ్రాసి రాత్రికిరాత్రే తపాలాపెట్టెలో పడేసింది. ఉత్తరంలో నారాయణరావుని నాటకం సంగతి తనకి చెప్పకుండా దాచినందుకు కోప్పడింది. నాటకంలో అతనిపాత్రధారణ చాలాబాగున్నందుకు అతన్నిపొగిడింది. అతను తనకి బావఅవడంవల్ల తను చాలాగర్వపడుతున్నానంది. తను బతికిఉన్నంతకాలమూ ఆనాటకాన్నీ, అతనిపాత్రపోషణనీ ఎన్నడూ మరచిపోలేనంది. మొన్నాడు తనని చూడడానికి నారాయణరావు మేరీరాణీకళాశాలకి వచ్చాడు ముందటిరాత్రి ఎదురుగుండాకూర్చున్న ఆడపిల్లలలో వెంటనే అతనికి

తను కంటబడినట్టు చెప్పేడు. నాటకం జరుగుతున్నంత సేపూ తను అతిసంతోషంగా ఉండడం చూసేనన్నాడు. రాత్రికిరాత్రే తనుపొగుడుతూ ఉత్తరంవ్రాయడం అతనికి చాలా ఆనందం కలుగజేసిం దన్నాడు.

అప్పటినుంచి తననిచూడడానికి నారాయణరావు తరచుగా వస్తూఉండేవాడు. అతను వచ్చినప్పుడల్లా అతను వచ్చాడని తల్లికివ్రాయడం మానుకుంది. కొంత కాలం ఉత్తరాలలో అతనిపేరు ఎత్తడం మానేసింది. దానితోకూడా సంతృప్తిలేక, అతను ఇప్పుడిప్పుడు వారానికి అధమం రెండుసార్లు వస్తున్నాకూడా, అబద్ధం ఆడుతూ, "నారాయణరావుబావ నన్ను చూడడానికి వచ్చి రమారమి మూడుసెలలయింది." అంటూ తల్లికి వ్రాసేది.

తను ఇంటర్‌మీడియట్ పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. మేరీరాణీకళాశాలలోనే బి. ఏ. తరగతిలో ప్రవేశించింది. సంవత్సరం మొదలులోనే తన నాయనమ్మ చచ్చిపోయిందని ఉత్తరంవచ్చింది. అన్నగారు రావద్దనివ్రాసినా వెళ్లడానికి ప్రయత్నం చెయ్యబోయి మళ్లీ మానేసింది. నారాయణరావు ఎప్పటిలాగే తనని చూడడానికి వారానికి రెండుసార్లు వచ్చేవాడు దానికి తోడు అప్పుడప్పుడు అతను తనకి ఉత్తరాలు వ్రాయడం తను అతనికి ఉత్తరాలు వ్రాయడం కూడా జరిగేది. నారాయణరావుమీద తనకి ప్రేమ రోజు రోజుకీ వృద్ధవుతోంది. నారాయణరావు సీతని పెళ్లిచేసుకోవాలని తనకి తెలుసును. కాని నారాయణరావు తనతో ఇంతవరకు సీతగురించికాని పెళ్లిగురించికాని ఎన్నడూ మాట్లాడలేదు. ఒకరోజున అతనితో ఈ విషయమై మాట్లాడుదామని నిశ్చయించుకుంది. అతనితో కూర్చుని మిగిలినసంగతులు మాట్లాడుతుంటే ఈ పెళ్లిప్రశ్నలు వెయ్యడానికిమట్టుకు తనకి ధైర్యంచాలలేదు. అతను వెళ్లిపోయాడు. ఆఖరికి ఆరాత్రి అతనికి ఈవిషయమై ఉత్తరం వ్రాయడానికి స్థిరపరచుకుంది. మూడునాలుగు సార్లుఉత్తరం మరీపెద్దదిగావ్రాసి చీకాకుపడి చింపేస్తూ వచ్చింది. అతనిపెళ్లివిషయమై తను ఇంత ఆదుర్దాపడుతున్నట్టుచూసి అతను ఏమనుకుంటాడో అని భయపడింది. 'ఈప్రశ్నలన్నీ అతన్ని అడిగేందుకు నాకు హక్కేమిటి ?' అని తనలోతను చర్చచేసుకుంది. ఉత్తరం వ్రాయకూడ దనుకుంది. ఊరుకుంది. కాని మరొక గంట ఈపనీ, ఆపనీచేసివచ్చి కూర్చుని ఆఖరికి ఈ విధంగా అతనికొక ఉత్తరంవ్రాసి టపాలోవేసింది: "అన్నట్టు ఈవాళసాయంత్రం నిన్నొకప్రశ్న అడుగుదామనుకుంటూ మరచిపోయాను. మళ్లీ మరచిపోతానేమోనని వెంటనే ఉత్తరంవ్రాస్తున్నాను. నువ్వు మాచెల్లెలు సీతని పెళ్లిచేసుకోడం నిశ్చయం అయినట్టేనా? నిశ్చయమే అయితే, మీపెళ్లి ఎప్పుడు?"

ఈప్రశ్నలకి తనకొక పెద్దజవాబువ్రాసి పంపించాడతను. అతనికి సీతని పెళ్లిచేసుకోవాలన్న అభిలాష ఎన్నడూలేదని వ్రాశాడు కాని సీతని పెళ్లిచేసుకోకుండా ఉంటే చాలాచిక్కులకి పాలవుతానని వ్రాశాడు. అతని అన్న శివరావుకి చాలాకోపం వస్తుందన్నాడు. అదికాక, ఇన్నాళ్లూ అతనిచదువులకి సీతతండ్రే డబ్బుపంపిస్తూఉండడం ఒకచిక్కైనవిషయం అన్నాడు. ఏదిఎలాఉన్న, సీతని పెళ్లిచేసుకోకుండా ఉండేందుకు సకలప్రయత్నాలూ చేస్తానన్నాడు. సీతని పెళ్లిచేసుకోవాలన్న అభిలాష ఇప్పుడు ముఖ్యంగా అతనికి లేకుండాఉండేందుకు కారణం తను బోధపరచమంటే తర్వాత తనకి బోధపరుస్తానని వ్రాశాడు... అతనిఉత్తరం చదువుకుని చాలాఆనందించింది. అతను వ్రాయడానికి సందేహించినకారణం ఏమిటో తను గ్రహించింది. గ్రహించి ఉప్పొంగిపోయింది. మొన్నాడు అతనువచ్చినప్పుడు నవ్వుతూ ఆకారణంఏమిటో చెప్పమని అడిగింది. అతను కంగారుపడ్డాడు. సిగ్గుపడ్డాడు. చెప్పలేక పోయాడు. ఆనాడు వెళ్లిపోయి కారణం బోధపరుస్తూ ఉత్తరం వ్రాసిపంపించాడు. అతని ఉత్తరం చదువుకుంటూ తను ఆనందపరవశురాలైపోయింది. ఇన్నాళ్లకి ఈఉత్తరంలో అతనికి తనమీద ఉన్న ప్రేమఅంతా తెలియపరిచాడు. ఎప్పటికైనా పెళ్లిచేసుకుంటే తననేపెళ్లిచేసుకుంటానని వాగ్దానంచేసేడు. ఆ ఉత్తరానికి అతనికి తను జవాబువ్రాయలేదు. దానికి జవాబు ఎలావ్రాయాలో తనకి బోధపడలేదు. నాలు

ఐదురోజులయాక అతను మళ్లీ తనహాస్టల్‌కివచ్చాడు. ఇన్నాళ్లకి మళ్లీ ఇద్దరూ కొత్తగా ఒకరినొకరు చూసుకుంటూ సిగ్గుపడిపోయారు. ధారాళంగా మాట్లాడలేకపోయారు. ఆఖరికి తనేఅతనితో అతనిఉత్తరం అందించని చెప్పింది. జవాబువ్రాయలేదేమని అతను చిన్నబుచ్చుకుంటూఅడిగేడు. ఏవిధంగావ్రాసేందుకూ తనకి స్ఫురించలేదనిచెప్పింది. తనమూలంగా అతనుఅతనిఅన్నగారితోకాని, సీతతండ్రితోకాని చిక్కులలోపడడం తనకి ఇష్టంలేదని చెప్పింది. మరేమీ పరవాలేదన్నాడతను. పరీక్షలయిపోయాక వేసంగికి ఇంటికివెళ్లిపోయినప్పుడు అతని అన్నకి అన్నిసంగతులూ బోధపరుస్తానన్నాడు. అన్నగారు అతనిఉద్దేశ్యాలతో ఏకీభవించేటట్టు చెయ్యగలనన్నాడు. ఏమాత్రమూ సందేహంలేదన్నాడు. అతను అంతధైర్యంగా మాట్లాడుతుంటే తనకిగూడా ధైర్యం కలిగింది. అతనుపట్టినపట్టు నెగ్గుకుంటే తనజన్మ ముఖ్యంగా సార్థకంఅవుతుం దనుకుంది. ఆనందించింది. ఆ సంవత్సరం ఆఖరిఅయిదారునెలలూ అతిసులాసాగా గడిపింది. ఆసంవత్సరం అతనికి పెద్దపరీక్ష అవడంవల్ల అతన్ని మరీతరచుగా తనకోసంవచ్చి నష్టపోవద్దని అనేకసార్లు బ్రతిమాలుకుంది. అతను వినలేదు. పూర్వం అంత తరచుగానూ వచ్చేవాడు. పూర్వంకంటే ఎక్కువ తరచుగా ఉత్తరాలు వ్రాస్తూ ఉండేవాడు. పూర్వంకంటె నాలుగైదింతలు పెద్దఉత్తరాలు వ్రాసేవాడు. ఆఉత్తరాలన్నీ తను జాగ్రత్తగా దాచుకునేది. మళ్లీమళ్లీ వాటిని పెట్టెలోంచి పైకితీసి చదువుకుంటూవుండేది. కొన్నాళ్లయాక అతనిఫోటోఒకటి తనకిమ్మని కోరింది. ఇచ్చాడు. తనఫోటో ఒకటి అతనికిచ్చింది. పడుకోబోయేముందు అతనిఫోటో ఒకసారి చూస్తేకాని పడుకునేదికాదు. తెల్లవారగట్ల లేవగానే మళ్లీ అతని ఫోటో చూస్తే కాని మరేపనీ చేసేదికాదు. అతనిగురించి ఆలోచించని ఘడియలేదు. అతనిగురించి ఆలోచించని నిముషం లేదు. ఇంతలో అతనిపరీక్షలు ప్రారంభం అయాయి. పరీక్షలలో ప్రతిరోజూ అతనికి ధైర్యంచెప్తూ ఉత్తరం వ్రాసేది. తనస్వంతపరీక్షలకైనా ఎన్నడూ అంత బెంగపెట్టుకోలేదు. పరీక్షలయిపోయాక ఊరికిబయలుదేరేనాడు సాయంత్రం అతనువచ్చాడు. మళ్లీ చెప్పిందితనకోసమని అతను కష్టాలుతెచ్చిపెట్టుకోగూడదని. ఎన్నికష్టాలుసంభవించినా లొంగదలచుకోలేదని చెప్పేడతను. ఆఖరినిముషాన్ని 'ఇతను మాటనిలబెట్టుకోగలుగుతాడాలేదా' అని సందేహించింది. మళ్లీ ఈవిషయంలో అతను సామర్థ్యంలేనివాడు కాడనుకుంది. అతని అన్నగారితో మాట్లాడి వెంటనే తనకి ఉత్తరంవ్రాస్తానన్నాడు. ఈశలవలలో అతనికి తనదగ్గరనుంచిమట్టుకు ఉత్తరాలేవీ రాకూడదన్నాడు. అతను వ్రాయమని వ్రాసేవరకూ ఏమీ వ్రాయవద్దన్నాడు. సరేనంది.

అతను వెళ్లిపోయాడు. మరొక రెండుమూడు రోజులలో తనుకూడా తనఊరు జేరుకుంది. అక్కడ తనకి ఏమీతోచలేదు. నారాయణరావు అన్నగారితో వాదిస్తూ ఏమిబాధలుపడుతున్నాడో అని బెంగపెట్టుకుంది. పదిపదిహేనురోజులయాక ప్రతిరోజూ అతని ఉత్తరానికి ఎదురుచూస్తూకూర్చుంది. ఎప్పటికీరాలేదు. మరీబెంగపెట్టుకుంది. నెలరోజు లయాక అతను పరీక్షలో ఉత్తీర్ణుడయాడని వార్తాపత్రికలలోచూసింది. వెంటనే అతనికి ఉత్తరంవ్రాయాలని బుద్ధిపుట్టింది. కాని అతను వద్దనడం జ్ఞాపకంతెచ్చుకుని వ్రాయడం మానుకుంది. ఇప్పుడైనా అతను తప్పకుండా ఉత్తరం వ్రాస్తాడనుకుంది. మరొకపదిరోజులుచూసింది. అప్పటికీ ఉత్తరంరాలేదు. విసుక్కుంది. దుఃఖపడింది. రాత్రుళ్లు ఏడుస్తూగడిపింది. ఒకరోజునకూర్చుని అతనినిర్లక్ష్యానికి నిందిస్తూ, తనప్రేమ ఎంతనిర్మలమైనదో, ఎంత మేరలేనిదో అతనికిబోధపరుస్తూ అతనివాగ్దానం అతనికి జ్ఞాపకంచేస్తూ ఒక పెద్దఉత్తరంవ్రాసి టపాలోవేసింది. దాన్ని టపాలోవేసిన మూడవరోజున మధ్యాహ్నం భోజనాలుచేసి కూర్చున్నాక తనఅన్నగారికి సీతతండ్రివద్దనుండీ, శివరావువద్దనుండీ రెండుపెళ్లిశుభలేఖలు వచ్చాయి సీతకి నారాయణరావునిచ్చి మరొకనాలుగు రోజులలోపెళ్లి! తనతల్లి ఆపెళ్లికబురు విని సంతోషంగా "పోనీ, ఇన్నేళ్లబట్టి అనుకుంటున్న సంబంధం తప్పిపోకుండా ఉండడంచాలాగొప్పమాట. మంచికబురే.

శుభం!" అంది. తనఅన్నగారు పెళ్ళికి వెళ్ళేందుకు బట్టలూ గట్రా సద్దుకోవాలన్నాడు. 'తనుకూడా పెళ్ళికి వస్తుందా?' అని అడిగేడు. తనురానని జవాబిచ్చింది. ఆకబురు తెలిసిన రెండుమూడుగంటలవరకూ లోకం అంతా ఏదోఒక పెద్దకుపానులో కొట్టుకుపోతున్నట్టు అనిపించింది తనకి. ఎటుపక్క చూసినా దుఃఖమే. ఏవిధంగా ఆలోచించినా నిరాశే. ఆనిరాశ తనకేకాదు. సృష్టికంతటికీ. కళ్ళు కప్పుకుపోయాయి. మెదడు నశించింది. నరాలబలం పోయింది. చచ్చిపోతున్నానేమో అనుకుంది. తల్లి కాఫీ దగ్గర తెచ్చిపెట్టిన కాఫీ ముట్టుకోలేదు. మతిలేదు. చల్లారిపోయిన కాఫీ తల్లి వెచ్చబెట్టి మళ్ళీ తెచ్చేవరకూ తాగలేదు. వెంటనే ఆత్మహత్యచేసుకోవాలని ఎందుకు తనకి బుద్ధిపుట్టడంలేదో అని ఆశ్చర్యపడింది. లేచి మూలగదిలో తలుపులూ కిటికీలూ దగ్గరగా వేసేసుకుని చీకట్లో మంచంమీద పడుకుంది. తన అన్నగారు వచ్చి 'జ్వరంవచ్చేటట్టుందా?' అని అడిగేడు. చాలా తలనొప్పిగా ఉందని చెప్పింది. మాత్రలుతెచ్చిఇచ్చాడతను. వాటిని మింగింది. పడుకుని ఏడవడం మొదలుపెట్టింది. ఏడవకపోతే ఆదుఃఖంతో గుండె బద్దలయిపోతుందేమో అన్నంతబాధ అనుభవించింది. తల్లికి ఏమీ బోధపడకపోయినా, ఆవిడ వచ్చి ఓదార్చబోయింది. తల్లివచ్చి పక్కలో కూర్చోగానే దుఃఖం అణచుకోడానికి కొంచెమైనా ప్రయత్నించకుండా మరీపెద్దపెట్టున ఏడుస్తూ పడుకుంది. తన అన్నగారు తడిగుడ్డతెచ్చి నుదురుమీదపెట్టి గుడ్డని తడుపుతూ విసనకర్రతో విసురుతూ నుంచున్నాడు. తనకి లోకంలో మిగిలినది వీళ్ళిద్దరే అనుకుంది......కాని నారాయణరావులేని జీవితానికి వీళ్ళుండిముట్టుకు ఏమి ప్రయోజనం?

తనుకొంచెం ఏడుపుమాని కళ్ళుమూసుకునేసరికి తల్లీ, అన్నగారూ తనుశోషవచ్చి నిద్రపోతోందనుకున్నారు. "సీతపెళ్ళికబురు వచ్చినప్పటినుంచీ దాని ముఖం చూస్తున్నానురా. ఏమీలేదు. అందరూ నిక్షేపంలా పచ్చగాఉంటుంటే తనకర్మం ఇలాఉందికదా అని ఏడుస్తోంది. నేను భయపడుతూనేఉన్నాను. ఎవరం మట్టుకు ఏమిటిచెయ్యగలం? దానినుదుటా, నానుదుటా అలావ్రాసిపెట్టేడు ఆదుర్మార్గపుదేవుడు" అంటూ తల్లి ఏడుస్తోంది. "ఏడవకమ్మా. నువ్వుకూడా ఏడిస్తేఎలాగ? చెల్లాయి వింటోందేమో కూడానూ మరి, మాను" అంటూ అన్నగారు నెమ్మదిగా నచ్చచెప్తున్నాడు తల్లికి. ఆ మాటలు విని, తను ఎంతదుఃఖపడుతున్నా, పాపం, వీళ్ళని దుఃఖపెట్టకూడదనుకుంది. నిద్రపోతున్నట్టు నటిస్తున్నది. ఇంకా నిద్రపోతున్నట్టే నటించింది. ఆఖరికి నిజంగా నిద్రపోయిందికూడాను.

మళ్ళీ రాత్రి ఎనిమిదిగంటలప్రాంతాన లేచింది. తల్లి అడిగితే అన్నంతిననంది. కాఫీమట్టుకు తాగి పడుకుంటానంది. చన్నీళ్ళతో ముఖంకడుక్కునివచ్చి కాఫీ తాగి మళ్ళీపక్కలో పడుకుంది. ఇప్పుడు కొంచెం నిశ్చలమైనమనస్సుతో అన్నిసంగతులగురించీ ఆలోచించడం మొదలుపెట్టింది. నారాయణరావు అతనిఅన్నగారిమాట జవదాటలేకపోయాడన్నమాట. అతనిగురించి ఆ భయం తనకి మొదటినుంచీ ఉన్నదేకదా అనుకుంది. అంత ఆశ్చర్యపడవలసిన కారణం లేదనుకుంది. ఆశపెట్టుకోడం పూర్తిగా తన తెలివితక్కువే. ఇంతట్లో చటుక్కున తనురెండురోజులక్రిందట నారాయణరావుకి వ్రాసిన ఉత్తరం జ్ఞాపకంతెచ్చుకుంది. 'అది ఎందుకువ్రాశానో కదా! ఎందుకువ్రాశానోకదా!' అని లక్షసార్లు అనుకుంది. లక్షసార్లు సిగ్గుపడింది. అలా ఆవిషయమై సిగ్గుపడుతూఉండగానే మళ్ళీ తన అంతరించని ఆశలు తలలు పైకెత్తేయి. తనఉత్తరంచూసుకుని నారాయణరావు ఆఖరినిముషాన్ని సీతని పెళ్ళాడడం మానేస్తాడేమో!... ......వెర్రి ఊహలు! ఆస్థితిలో తనంటే తనకే జాలి కలిగింది. నారాయణరావు మనోబలం లేనివాడు. అతని అన్నదగ్గర అతను ఎదురుమాట చెప్పలేకపోయాడు. అతను స్వయంగా ఇచ్చిన వాగ్దానాలనీ, తన సంపూర్ణమైనప్రేమనీ గడ్డిపరకలలా తోసిపారేశాడు. ఇకమ తను చెయ్యగలిగినదేమీలేదు. అతన్ని మరచిపోవడానికి ప్రయత్నించాలి. కాని.........ఎలా మరచిపోవడం?

తనఅన్నగారు నారాయణరావుపెళ్ళికి వెళ్ళేరు. సరిగ్గా నారాయణరావు పెళ్ళిముహూర్తంవేళ ఇక్కడ

108

తను నారాయణరావు తనకి వ్రాసిన ఉత్తరాలూ, నారాయణరావు తనకిచ్చిన ఫోటో చింపెయ్యడానికి నిశ్చయించుకుంది. గడియారం చూసి సరియైనవేళకి రహస్యంగా తన పెట్టె తెరిచి ఆ ఉత్తరాలూ, ఆ ఫోటో పైకి తీసింది. ఫోటో చింపబోయింది. మధ్యని అంగుళంలో పదోవంతు చింపి చటుక్కున మానేసింది. ఆ పైని చింపేందుకు చేతులు రాలేదు. పిచ్చిగా ఆ బొమ్మని ముద్దుపెట్టుకుంది. ఎన్నడూ దానిని చింపడానికి ప్రయత్నించకూడదనుకుంది. ఈ నారాయణరావే వేరు! ఇప్పటి నారాయణరావు కాదు!

ఆ ఉత్తరాలన్నీ తీసి చదువుకుంది... సీతకి ఇప్పుడే పుస్తెకట్టూ ఉంటాడు!... కాని ఏమి ఉత్తరాలివి! ఏమి ఉత్తరాలు! తనమీద నిజంగా అఖండమైన ప్రేమ లేనివాడు ఇటువంటి ఉత్తరాలు వ్రాయగలుగుతాడా? ఒక ఉత్తరంలో తమరు ఎన్నడూ ముద్దుపెట్టుకోలేదని విచారపడుతూ వ్రాశాడు. ఇంక ఎన్నడూ ముద్దుపెట్టుకోడం ఉండదు కదా!... సీతకి పుస్తెకట్టడం అయిపోయుంటుందా? అయిపోయే ఉంటుంది... ఫోటోనీ, ఉత్తరాలనీ పెట్టెలో పడేసింది. పడేసి, ఒకసారి ఫోటోని మట్టుకు మళ్లీ పైకితీసి చింపిన భాగాన్ని ముద్దుపెట్టుకుని లోపల పడేసి పెట్టెకి తాళం వేసింది.

అన్నగారు వచ్చి పెళ్లి సంగతులన్నీ చెప్పేడు. శివరావుకీ, సీతతండ్రికీ జరిగిన పోట్లాటలన్నీ వర్ణించాడు. నవ్వుతూ వింది. శివరావు తమ్ముడిచేత అలకరోజున మోటారుకారు అడిగించాడట. విని, అతి నిర్లక్ష్యంగా, "మోటారుకారుకాదు, మువ్వొంకాయ!" అన్నాడట సీతతండ్రి. ఈ కథలన్నీ ఎవరి పెళ్లిగురించో అన్నట్టు వింటూ కూర్చుంది తను. ఇంతట్లో తన అన్నగారు నారాయణరావు తను పెళ్లికి రానందుకు చాలా విచారించాడనీ, మళ్లీ మళ్లీ తను రాకపోవడం గురించి ప్రశ్నలు వేసేడనీ చెప్పేడు. నారాయణరావు తన అన్నగారితో తన గురించి మాట్లాడకుండా ఉంటుంటే బాగుండు ననుకుంది.—ఎందువల్లనో! ఇంతకీ నారాయణరావు తన మాట మరచిపోలేదన్న మాట. ఎలా మరచిపోతాడు?... తన ఉత్తరం అందిందో లేదో? ఒకవేళ ఏ కారణంవల్లనైనా పెళ్లిరోజున అందిందేమో? లేకపోతే, కొంప తీసి, మరి ఎవరిచేతులలోనైనా పడిందేమో?

శలవులు కాగానే చదువులకి చెన్నపట్నం వెళ్లిపోయింది. ఆ సంవత్సరం నారాయణరావు చెన్నపట్నం రాలేదు. అతని కబురు తనకి అప్పుడప్పుడు తెలుస్తూనే ఉండేది. పెళ్లయిన తర్వాత భార్యతో ఆరు నెలలు మామగారి ఇంట్లోనే ఉన్నాడు. ఎక్కడికీ కదలలేదతను. ఆ తర్వాత ఉత్తరహిందూస్థానంలో ఎక్కడో ఉన్నాడని తనకి తెలిసింది. భార్యని అతనితో తీసుకు వెళ్లలేదు. ఉత్తరహిందూస్థానం ఎప్పుడు వదిలేడో మట్టుకు తనకి తెలియలేదు. మొదట తను చెన్నపట్నం రాగానే తనకి అతను ఉత్తరం వ్రాస్తాడనుకుంది. వ్రాయలేదు. తర్వాత ఉత్తరహిందూస్థానంలో భార్య అతనితో లేనప్పుడు అతను తనకి ఉత్తరం వ్రాస్తాడేమోనని ఆశపడింది. అప్పటికీ వ్రాయలేదు. పూర్వం అతను తనకి వ్రాసిన ఉత్తరాలే చదువుకుంటూ కాలం వెళ్లబుచ్చింది. ఆ ఉత్తరాలు చదువుకుంటుంటే తనమీద అతనికి ఒకానొకప్పుడున్న ప్రేమ ఎన్నటికీ నశించదని ఒక వెర్రి ధైర్యం కలిగేది. ఆ వెర్రిధైర్యం రాను రాను దృఢనమ్మకం అయిపోయింది. అతను అన్నగారికి ఎదురుతిరగలేక సీతని పెళ్లిచేసుకున్నాడు కాని, నిజంగా అతనికి ఇంకా తనమీదే అగాధమైన ప్రేమ అని నిశ్చయించుకుంది. ఒకరిని ప్రేమిస్తూ మరొకరిని పెళ్లిచేసుకోవలసివచ్చిన అతని జీవితం గురించి ఆలోచిస్తూ చాలా జాలిపడేది. అతనికి మనోబలం చాలకపోవడంవల్ల తమ ఇద్దరి జీవితాలూ కృత్రిమపు జీవితాలయిపోయాయని అనుకుంటూ ఉండేది.

ఆ ఏడు తన పెద్దపరీక్ష. పరీక్ష పదిహేను రోజులనగా నారాయణరావు చెన్నపట్నం వచ్చాడని తనకి తెలిసింది. మనస్సు కెలికేసినట్టు అయిపోయింది. తనకోసం వస్తాడేమోనని ఒక్కొక్కప్పుడు ఆశ. తనకోసం వస్తాడేమోనని ఒక్కొక్కప్పుడు భయం. కాని అతను రాలేదు. ఈ ఆదుర్దాలో తను పరీక్షకి సమంగా చదువుకోలేదు. పరీక్షంతా అయ్యాక ఆ ఏడు పోతుం

దేమోనని భయపడింది. ఒకరాత్రంతా కూర్చుని ఏడ్చిందికూడాను.

తన ఊరికి బయలుదేరింది. రాజమహేంద్రవరం స్టేషన్‌లో రైలుకిటికీలోంచి తొంగిచూస్తుంటే ఒక మూల పచార్లు చేస్తున్న స్వరూపం నారాయణరావులా కనిపించింది. తనగుండె దడదడ కొట్టుకోడం ప్రారంభించింది. అతను చూసేస్తాడేమోనని భయపడింది. రైలు బండిలో రెండవవైపుకి వెళ్లిపోయి కనబడకుండా వంగి కూర్చుంది. రైలు కదులుతుంటే మళ్లీ అది నిజంగా అతనవునో కాదో చూడాలని బుద్ధిపుట్టింది. చూసింది. అతనే. తనకేసి చూడలేదతను. కానిఆస్వరూపం అతనిదే. పెళ్లయాక కొంచెంలావుగామట్టుకు మారేడు.

అయిదారు వారాలయాక తను పరీక్షలో ఉత్తీర్ణురాలయినట్టు వార్తాపత్రికలో చూసుకుంది. తన అన్నగారు ఆనందించాడు. తల్లికూడా చాలాగర్వపడింది. ఊళ్లో ఎరుకున్న వాళ్లందరూ వచ్చి తన తెలివితేటలు పొగడడం మొదలుపెట్టేరు. అప్పటికైనా తను జయం పొందడంవల్ల తనకి ఏవిధమైన ఉత్సాహమూ కలగలేదు. రెండురోజులయాక ఎన్నడూ అనుకోనిది నారాయణరావుదగ్గరనుంచి తను పరీక్షలో ఉత్తీర్ణురాలయినందుకు అతనిసంతోషం తెలియపరుస్తూ ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంలోనే సీతకూడా ఆవిషయమై తన ఆనందం తెలియపరుస్తూ వ్రాసింది. దానికి ఏమీజవాబివ్వలేదతను. ఆ ఉత్తరం వచ్చిననాడుమట్టుకు రాత్రి మామూలు వేళకి తనకి నిద్రపట్టలేదు.

నారాయణరావు ఉత్తరం వచ్చినరెండువారాలకే నారాయణరావు చచ్చిపోయాడన్న దుర్వార్త తనచెవిని పడింది. ఒక్కక్షణంలో ఏవిధంగానో మేఘంలేని ఆకాశంనుంచి పిడుగుపడినట్టయింది. కాని వెంటనే తనుదుఃఖపడవలసినంత దుఃఖపడలేదు. ఆసంగతి తను కూడా గ్రహించింది. గ్రహించి సిగ్గుపడింది సీతమొగుడైన నారాయణరావు చచ్చిపోయినట్టు భావించుకుంది కాని తనకి ముఖ్యుడైన నారాయణరావు చచ్చిపోయినట్టు భావించుకోలేదప్పుడు. కొంతసేపయాక నారాయణరావుముఖం మళ్లీ తనకంటబడదని ఆలోచించుకుంటూ చాలాదుఃఖపడింది. ఆఖరిసారి అతన్ని రాజమహేంద్రవరం స్టేషన్‌లో చూడడం జ్ఞాపకం తెచ్చుకుంది. అతన్ని అప్పుడు పిలిచి మాట్లాడలేదని ఇప్పుడు విచారించడం మొదలుపెట్టింది. ఆరాత్రి అతని ఉత్తరాలన్నీ రహస్యంగాతీసి అతనువ్రాసిన ప్రతిపంక్తీ చదివింది. అతని ఫోటోని విసుగులేకుండా అనేకసార్లు ముద్దుపెట్టుకుంది. ఏడ్చింది......ఆరాత్రిపడుకుంటూ మళ్లీ నారాయణరావు చచ్చిపోవడం అంత మరీవిచారకరమైనవిషయం కాదని ఆలోచించింది. అయిష్టంగా సీతని పెళ్లిచేసుకున్నాడతను. చచ్చిపోవడంవల్ల అతనికి విముక్తివచ్చింది. అదికాక చచ్చిపోవడంవల్ల పూర్తిగా మళ్లీ అతను తనవాడైపోయాడు.

మొన్నాడు తనూ, తనతల్లీ కలిసి సీతని పరామర్శచెయ్యడానికి సీతతండ్రి ఉద్యోగంచేస్తున్న ఊరికి వెళ్లేరు. తన పినతల్లి వీరభద్రమ్మ వీథిగుమ్మంలో అక్కని కౌగలించుకుని గొల్లుమని ఏడ్చింది. సీతతండ్రి వీథి సావిట్లో మతిపోయినవాడిలా కూర్చుని వచ్చినవాళ్లని చూసి లేవనైనా లేవలేదు. సీత లోపలిగదిలో ఒక మంచంమీద పడుకుని ఉంది. వీరభద్రమ్మపిన్నీ, తనతల్లీ, తనూ ఆగదిలోకి ప్రవేశించడం సీతచూసింది. గోడవైపుకి ఒత్తిగిల్లి తలగడాలో తలదాచుకుని ఏడవడం మొదలుపెట్టిందిసీత. తనువెళ్లి ఆప్రక్కలోనే కూర్చుని మాట్లాడకుండా సీతచేతులు పట్టుకుని మృదువుగా వాటిని తడుముతూ ఓదార్చబోయింది. తనతల్లి నేల మీద చతికిలబడి వీరభద్రమ్మపిన్నికేసిచూసి కన్నీరు ధారలుగా కారుస్తూ "అమ్మో, చెల్లీ, నాకే ఈకర్మం అనుకుంటుంటే నీకుకూడా ఈకర్మమే పట్టిందేమే! నువ్వేమి పాపంచేసుకున్నావే? ఏజన్మలో ఎవరికి అపరాధంచేసేవే?" అంటూ ఏడ్చింది. తనతల్లి ఏడవడం, తనపినతల్లి ఏడవడం, సీత ఏడవడం చూస్తూ కూర్చుంటే, మొదట రాని కన్నీరు తనకికూడా గంగాప్రవాహంలా వచ్చేసింది. కాసేపయాక తనతల్లీ, పినతల్లీ గదిలోంచి వెళ్లిపోయారు. తనూసీతా మిగిలేరు. సీత లేచికూర్చునికళ్లుతుడుచుకుంటూ జుట్టుముడివేసుకుంటూ, "కాసిని మంచినీళ్లు తెచ్చిపెట్టక్కయ్యా" అంది. తను



అబిసీనియా సైనికుడు రణరంగమునకు బోవుచున్న భార్యవద్ద సెలవు గైకొనుట



ఇటాలియను సైనికులలోని బాలసైనికుడు వయస్సు ౧౨ ఏండ్లు



జనరల్ నసీబు, అబిసీనియాసేనాని
(ఒగడన్ రంగము)



రాస్ సెయాము, అబిసీనియాసేనాని
(ఉత్తరరంగము)



మార్షల్ బడోగ్లియో
ఇటలీప్రధానసేనాని
(తూర్పుఆఫ్రికా)

వెళ్ళి మంచినీళ్లు తెచ్చింది. మంచినీళ్లుతాగి సీత మళ్లీ ఏడుపు మొదలుపెట్టింది. తనకి మాట్లాడేందుకేమీ తోచలేదు. ఇంతట్లో పరామర్శ చెయ్యడానికి ఎవరో తను ఎరగనివాళ్లు వచ్చారు. పక్కలో కూర్చున్న సీత మళ్లీ పడుకుని గోడవైపుకి ముఖం పెట్టేసింది. "చిన్న పిల్ల, పాపం. ఏడాదైనా కాపురం చేసిందా మొగుడితో?" అం దావిడెవరో. పరామర్శకి వచ్చినవాళ్లు సీతఎదురుగుండా ఇటువంటిప్రశ్నలు వెయ్యడం తనకేమీ నచ్చలేదు. ఇంతట్లో తనపినతల్లి ఒకమూల ఏడుస్తూనే "ఏడాదెక్కడండీ? ఆరునెలలో ఏడునెలలో కాపురంచేసింది. పట్టుమని ఏడాదైనా కలిసి ఉండలేదు ఇద్దరూ. దాని దురదృష్టం" అని బోధపరిచింది. తనపినతల్లి కూడా సీత ఎదురుగుండా ఈవిధంగా మాట్లాడడం తనకి అసలే నచ్చలేదు.........అయితే, సీత నారాయణరావుతో ఆరేడునెలలుమాత్రమే కాపురంచేసిందన్నమాట!

సీతని పరామర్శచెయ్యడానికి వచ్చిపోయేవాళ్లందరినీ చూస్తుంటే తనకి ముందు ఒకవిధమైన అసూయ పుట్టుకొచ్చింది. నారాయణరావు పోయాడని వీళ్లందరూ సీతని పరామర్శచెయ్యడానికి వస్తున్నారు. నారాయణరావు పోయాడని తనని పరామర్శచెయ్యడానికి ఎవరూరారుకదా!

రాత్రింపగల్లు ఇద్దరూ కలిసేఉండడంవల్ల పరామర్శఏడుపులు వాళ్లిద్దరినీ బాధించడం మానేసేయి. అప్పుడప్పుడు వాళ్లిద్దరే ఉన్నప్పుడుకూడా సీత ఏడుస్తున్నప్పటికీ చాలావరకు వాళ్లు అన్నివిషయాల గురించీ సామాన్యంగా మాట్లాడుకునేవారు. ముఖ్యంగా సీత ముందుముందు చదువుకోడంగురించి ప్రశ్నలువేస్తూ ఉండేది. మళ్లీ, ఉండిఉండి సీత కంటనీరుమాత్రం పెట్టుకుని నారాయణరావుగురించి మాట్లాడుతూఉండేది. సీత అలామాట్లాడడం తనకినచ్చేదికాదు. దుఃఖం ఎంతగొప్పదైతే అంతమౌనంగాఉండాలని తనఉద్దేశ్యం. అందువల్లనో, లేకమరేకారణంవల్లనో సీత నారాయణరావువిషయమై మౌనంగాఉండకపోవడం తనకి కష్టంగాతోచేది. తనదేశపుస్త్రీలు చనిపోయినభర్తల గురించి మౌనంగాఉండాలని తనఉద్దేశ్యం. కాని సీత నిరాటంకంగా తనభర్తగురించి మాట్లాడేది. సీతప్రవర్తన సామాన్య ప్రవర్తనకి ఎప్పుడూ వ్యతిరేకమే!

ఒకసారి సీత మాటలధోరణిలో "అక్కయ్యా, నీకూ నాకూ నడకలోనూ, నవ్వడంలోనూ చాలాపోలిక ఉందిఅంటూఉండేవారు. నాతోచాలాసార్లుఅన్నారు." అనిచెప్పింది.........తనగురించి సీతతో అప్పుడప్పుడు మాట్లాడేవాడన్నమాట!

ప్రతిరోజూ సీత ఒకతోలుపెట్టెతెరిచి అనేక ఉత్తరాలలో వెతికివెతికి కొన్ని ఉత్తరాలు పైకితీసి వాటిని చదువుకుంటూ ఏడుస్తూఉండేది. అవి సీతకి నారాయణరావు వ్రాసిన ఉత్తరాలు అయిఉండాలని తనుగ్రహించింది. కాని వాటిగురించి తనుఏమీప్రశ్నలు వెయ్యలేదు. ఒకరోజున సీతకి ఏమిబుద్ధిపుట్టిందో ఆపెద్ద ఉత్తరాలకట్టతెచ్చి తనఎదురుగుండా పెట్టింది. వాటిమీద నారాయణరావువ్రాత తను వెంటనే పోలికపట్టింది. "వీటన్నిటినీ విప్పి నన్ను చదవమంటుంది కాబోలు సీత!" అని భయపడింది. సీత ఏడుస్తోంది. చూస్తూ ఊరుకోలేక "ఎందుకంత దుఃఖపడతావు, సీతా? ఏమిటీ ఉత్తరాలన్నీ? వాటిని చూసుకుని మరీ దుఃఖపడుతున్నావు నువ్వు." అంది తను. "ఆయన ఉత్తరహిందూస్థానంలో ఉండగా నాకు వ్రాసిన ఉత్తరాలక్కయ్యా. నాకిప్పుడు మిగిలిన వివే" అంటూ ఏడ్చిందిసీత. తనకి అమితమైన కోపం వచ్చింది. అది ఒట్టి అసూయ అనేందుకు వీలులేదు. ఈఉత్తరాలకి నూరింతలు ఉద్రేకపూర్వకమైన ఉత్తరాలు నారాయణరావు ఒకానొకకాలంలో తనకి వ్రాశాడు. ఇవి అతను దూరదేశంలో ఉన్నప్పుడు మర్యాదకి కుశల ప్రశ్నలు వేస్తూ అప్పుడప్పుడు పెళ్లానికి వ్రాసిన ఉత్తరాలు అయిఉండాలి. నారాయణరావు తనకివ్రాసినవి స్వచ్ఛమైన ప్రేమయొక్కదౌర్బల్యంలో వ్రాసినవి. సీత ఈఉత్తరాలు తనఎదురుగుండాపెట్టి ఏడవడం చాలా అసహ్యం అనిపించింది తనకి. సీత ఈదుఃఖం ఏదో గొప్పఆభరణంఅయినట్టూ, ఈ ఆభరణంలో నారాయణరావు ఉత్తరాలు వజ్రాలూ, కెంపులూ అయినట్టూ ప్రదర్శిస్తోంది. ఇంకావెక్కివెక్కి ఏడుస్తోంది. ఒకవైపు కన్నీరు ధారలుగా కారుతున్నా, సీత ఉత్తరాలు చదవడంమట్టుకు మానలేదు.

ఇంతట్లో సీత ఒకఉత్తరం ప్రత్యేకంగా తీసి తనకి చదవమని ఇచ్చింది. నారాయణరావు సీతకి వ్రాసు

కున్న ఉత్తరాలు చదువుదామన్న అభిలాష తనకి లేనే లేదు. ఎందుకు తనకీ ఉత్తరాలు ?.........ఆక్షణం తనకి ఆఉత్తరాలన్నీ తీసుకుని వీథిలోకి విసిరేద్దా మన్నంతకోపం వచ్చింది. ఆక్షణం సీతతో తన రహస్యం, నారాయణరావురహస్యం చెప్పేదామన్నంత ఉడుకుబోతుతనం వచ్చింది. సీతతో "నువ్వు వెర్రిదా నవుకాని, నారాయణరావు నన్నొక్కర్తెనే ప్రేమిం చాడు. అతనిదురదృష్టంవల్ల నిన్ను పెళ్లి చేసుకోవలసి వచ్చింది" అని చెప్పేద్దామన్నంత అసహ్యంపుట్టింది.

కాని, మాట్లాడకుండా ఆ ఉత్తరం తీసుకుని చదివింది. చదువుతుంటే ఆకోపంపోయింది. ఆ ఉడుకు బోతుతనం పోయింది. ఆ అసహ్యం పోయింది. మిగి లిన ఉత్తరాలన్నీ చదవాలన్న కుతూహలం మట్టుకు మిగిలింది.........తనకి ఎంత ఉద్రేకపూర్వకంగా వ్రాశాడో ఉత్తరాలు, సీతకిగూడా అంతఉద్రేక పూర్వకంగానూ వ్రాశాడు! నిజంగా సీతని ఇంతప్రే మించాడా అతను? సందేహం లేదు.........అతనితో ఆరేడునెలలు కాపురంచేసిన సీత!

మిగిలిన ఉత్తరాలన్నీ కూడా చదవనిచ్చిందిసీత. తనకి వాటిని చదివేందుకు ఏమీహక్కు లేదని తెలు సును. సీత తెలివితక్కువమూలానో గర్వం మూలా నో వాటిని తనకిచదివేందుకు ఇచ్చింది కాని, అవి ఇతరులు చదవవలసిన ఉత్తరాలుకావని తెలుసును... సీతని అతను నిజంగా ప్రేమించాడు! లేకపోతే ఇటు వంటి ఉత్తరాలు వ్రాయలేకపోను......ఉత్తరాలన్నీ ఒకటొకటిగాతీసి చదివింది. అందులో కొన్ని ఉత్త రాలు మళ్లీమళ్లీ చదివింది. అన్నీ చదవడం అయాక సీతగదిలో కూర్చోలేకపోయింది. లేచి వరండాలోకి వెళ్లి ఒంటరిగా కూర్చుంది.

మళ్లీ అన్నివిషయాలూ ఆలోచించింది...నిజంగా నారాయణరావుకి తనంటే ఎంతప్రేమ ఉండేదో సీత అంటేకూడా అంతప్రేమా ఉండేదా? ఉండేఉండాలి. లేకపోతే, అటువంటి ఉత్తరాలు ఎలా వ్రాయగలుగు తాడు? పెళ్లిచేసుకున్నాక నారాయణరావు తనమాట ఆలోచించనేలేదన్నమాట! తనదంతా ఏదో కలలోని కథే అన్నమాట! ఇప్పుడన్నీ జ్ఞాపకం వచ్చాయి — ఉత్తరాలు వ్రాయకపోవడం, చెన్నపట్నంలో ఉండి చూడడానికి రాకపోవడం......రాజమహేంద్రవరం స్టేషన్‌లో ఆనాడు తను ఒకవేళ పిలిచినాకూడా పల కకపోయి ఉండునేమో!......సీత ఆరేడు నెలలు కాపురంచేసింది ఆతనితో!

ఒకవేళ నిజంగా ప్రేమించకపోయినప్పటికీ అటు వంటి ఉత్తరాలు సీతకి తంటాలుపడి వ్రాసిఉండకూ డదూ?......అంత కపటం ఉన్నమనిషైతే ఆకపటం తనకివ్రాసిన ఉత్తరాలలోనే ఎక్కువ ఉండేమో! ఏమో, ఎవరుచెప్పగలరు? ఏదీ తెలియదు.

తనకి ఏమీ బోధపడలేదు. ఇన్నాళ్లూ నారా యణరావు తననేప్రేమించాడనుకుంది. మరెవరినీ తర్వాత ప్రేమించలేదనుకుంది. ఇప్పుడు తనని అతను ప్రేమిం చాడో, లేదో తెలియదు. సీతని ప్రేమించాడో, లేదో తెలియదు. ఇద్దరిలో ఎవరిని ఎక్కువ ప్రేమించాడో అసలే తెలియదు. ఏమీతెలియదు. అంతా సందేహా స్పదం.

ఒక్కవిషయంలో సందేహాలు అనవసరం. తను ఇల్లుచేరుకోగానే నారాయణరావు ఉత్తరాలూ, నారా యణరావుఫోటో ముక్కలు ముక్కలుగా, చింపి వీథిలో పారెయ్యాక తప్పదు.

ఈ భూలోకం చాలా విచిత్రమైనది. ఎవరికీ మరొకరిసంగతి తెలియదు. కాని అందరూ మిగిలిన అందరిజీవితాలలోనూ చొరబడతారు. నారాయణ రావుకీ, తనకీ ఉన్నసంబంధం సీతకి ఏమాత్రమూ తెలి యదు. సీతకీ, నారాయణరావుకీ ఉన్నసంబంధం తనకి ఏమాత్రమూ తెలియదు. తనకీ, సీతకీకూడా నారాయణ రావు నిజంగా ఎటువంటివాడో అసలే తెలియదు. నారాయణరావు పోయినందుకు సీతని పరామర్శచెయ్య డానికి తను తయారిక్కడ......తనకే నవ్వొచ్చింది.

పైకినవ్వింది. ఆపైకినవ్వడం చాలాసూక్ష్మంగా అయినప్పటికీ పైకిమట్టుకు నవ్వింది. ఆనవ్వడం తన వీరభద్రమ్మపిన్ని చూసింది. చూచి ఆవిడ "అందరూ ఓదార్చడానికి వస్తుంటే, ఇది నాకూతురికికూడా తన గతే పట్టిందికదా అని పలుకుతున్నట్టుంది. లేకపోతే ఈ ఇంట్లో ఆనవ్వేమిటి?......దీని పొగరుమోతు తనం!" అనుకుని విసుక్కుంది. ఇంతట్లో ఎవరో ధగ ధగమెరిసే బనారసుచీరెకట్టుకుని పరామర్శకివస్తే మళ్లీ ఆవిడ కంటనీరు పెట్టుకుని చీరెకొంగుతో కళ్లు అద్దు కుంటూ యథాప్రకారంగా ఏడవడం ప్రారంభించింది.

# ఆఫ్రికాఖండము

కొ. నరసింహాచారి



## అల్జీరియా, మొరాక్కో-దేశములు

ఈ దేశములందలి జనులు ఎక్కువమంది 'బర్బరు'లనబడుజాతివారును, తక్కిన కొద్దిసంఖ్యవారు 'అరబ్బులు'ను, 'జ్యూ'లును, 'నీగ్రోలు'ను అయియున్నారు.

బర్బరులు తెల్లవారు; మహమ్మదీయులు. వారిభాష అరబ్బీభాష కాబట్టి అరబ్బులని పొరబడుట కవకాశ ముండెడిది కాని భాష యందును, అవయవనిర్మాణమునందును ఈ



౧. దక్షిణ అల్జీరియా యువతి

రెండుజాతులవారికినిసామ్యముండినను, వారు వేర్వేరుజాతులకు చెందినవారే. వారియందలి భేదము లెవ్వియనగా అరబ్బులు పొడవు ముఖము కలిగి కొంత తెలుపు తక్కువగా నుందురు. వారి ముక్కు సన్నమై పొడవుగా నుండును. నోరు చిన్నది. దౌడ లంతపెద్దవి కావు. వెండ్రుకలును, కండ్లును నల్లనైనవి. వారంతకార్యదీక్షయు, నుత్సాహమును కల వారు కారు. పరధ్యానము ఎక్కువ. ఆత్మ నిగ్రహము కలహము కలవారును, సూక్ష్మ జ్ఞానము కలవారును అగుదురు.

బర్బరులు కొంతగుండ్రని ముఖము కలిగిన తెల్లని మేనిచాయ గలవారు. ముక్కు అంతసన్నము కాదు. వెండ్రుక లంతనల్లవియు కావు. కార్యదీక్ష కలవారును, కష్టపడి పని చేయువారును అగుదురు. వారికి మనోనిగ్రహము తక్కువ.

బర్బరులలో సుమారు ౧౨౦౦ అంతర్జాతులు కలవట. కాని వా రందఱు మూడుముఖ్యభాగములుగ వ్యవహరింపబడుదురు. ౧. కబైల్సు అను మధ్యధరాసముద్ర తీరవాసులు, ౨. అట్లాసు పర్వతవాసు లగు షుల్లాలును, మొగదారు జిల్లావాసు లగు 'సూ'లును, 3. అట్లాసు పర్వత దక్షిణ ప్రాంతవాసులగు నల్లబర్బరులు, లేక హారాటినులును.

బర్బరస్త్రీల దుస్తులు అరబ్బీస్త్రీలదుస్తుల వలెకాక నిరాడంబరములైయుండును. వారు నడుమునకు ఒకపావడవంటి దుస్తునుకట్టుకొని (చిత్రము ౧) భుజములమీద నొకశాలువను

కప్పుకొందురు. అరబ్బీస్త్రీలకన్న బర్బర స్త్రీలకు స్వాతంత్ర్య మెక్కువ. వారికి శరీరము నంతయు కప్పెడి బురఖాలు లేవు. మెడకు బంగారు గొలుసులును, పూసల దండలును, చెవులకు పోగులును, కదాచిత్తుగా ముక్కుపుడకలును వారి యాభరణములు. పట్టణవాసులగు బర్బరులు రాతితో కట్టబడిన యిండ్లయందు నివసింతురు. ఈయిండ్లు రెండంతస్తులు కలవైకూడ నుండును. దక్షిణ దేశమునందలి కొన్నిజాతులవారు వ్యవసాయమువలన జీవించువారు గుడారములందు గాని, స్థలాంతరముల కిష్టము వచ్చినప్పుడు మోసికొనిపోవదగిన గుడిసెలందు గాని నివసింతురు.

కబైల్సుజాతివారిలో పురుషులు స్త్రీల నెక్కుడుగౌరవభావముతో జూతురు. వారి స్త్రీలకును బురఖా లక్కరలేదు. వారి 'ఘోషా' లేక బహిరంగముగా నితర జనులతో చరించవచ్చును. భర్తలతో సమానాధికారము వారికి కలదు. చాలమట్టుకు కబైలులు ఏకపత్నీవ్రతులు.

స్త్రీలు వివిధవర్ణములుగల చిన్న వస్త్రము తలకు కట్టుకొని మెడవెనుక కొంత తోకను జీరాడవదలుదురు. (చిత్రము ౨, 3, ౪, ౫, ౬.)

అరబ్బులు అల్జీరియా, మొరాక్కోలను ఏడవశతాబ్దమునందును, పదునొకండవ శతాబ్దమునందును జయించినందున ఈ దేశములలో వారి తర్వాత వచ్చిన ఫ్రెంచివారి కాలమువఱకు అరబ్బుల ప్రాజాపత్యమే యెక్కువయయి యుండెను. అరబ్బీ స్త్రీలు సన్నని వలిపమువంటి దుస్తును మొదట తొడిగి దానిపై వెడల్పయి వదులుగా నుండు షరాయీలను తొడిగికొందురు. ముఖమున కండ్లను వదలి తక్కినభాగములను మూయు



౨. కబైలుజాతి బాలిక

నట్లు ఒకసన్ననిగుడ్డను కట్టి, శరీరమునంతయు కప్పుట కొరకు బురఖాను వేసికొందురు. కండ్లు తప్ప తక్కిన భాగ మంతయు కప్పబడి యుండును. కొన్ని దేశములందు ఒక కన్ను మాత్రమే వెలుపలికి తెలియదగి యుండవలెనట. ఇట్టి యుడుపుల ధరించి నడచు నపుడరబ్బీస్త్రీలు కదలునట్టి గుడ్డల మూటలా యనునట్లు వికారముగ జూపట్టుచుందురు. బీదవారు పనికివెళ్లునపుడు శరీరమును కప్పదగిన కొద్దిపాటి యుడుపులతో పోవుదురు. ధనికులు ఇంటను, వెలుపలనుగూడ విపరీతముగా దుస్తులను దొడిగికొందురు. అనేకులు గోళ్లకు ఎఱ్ఱనిరంగును(గోరింట రంగువంటిది) వేసికొందురు. కొందరు తల వెండ్రుకలకును

అట్టిరంగును వేసికొందురు. వారికి నగల యందు ప్రీతి యెక్కువ. ధనికులు చెవులకు లోలాకులు, లేక కమ్మలు, మెడకు బంగారు గొలుసులు, కాళ్లకు బంగారుఅందెలు, రాళ్లు చెక్కిన నగలు ధరించెదరు. బీదలు పగడములు, వెండిసొమ్ములు, గాజుపూసలు మొదలగువాటిని ధరింతురు. నడచునపుడు వారి సొమ్ములు ఖణిల్ ఖణిల్లని మ్రోయుచుండును.



3. బౌసాదా దేశపు బాలిక దక్షిణ అల్జీరియా

అరబ్బుల వైవాహికాచారములు

వివాహవిషయమున స్త్రీలకు స్వాతంత్ర్య మెక్కువ. వివాహానంతరమును వారికి స్వాతంత్ర్యము ఎక్కువయే. కొన్ని ఐరోపీయ దేశములలోవలె వారివివాహానంతరము హనీమూన్ (Honey Moon) విహార పర్యటనములుకలవు. అరబ్బులకు పర్యటనములు లేవు. కాని వివాహమునకు పూర్వమువధువు కొంత ప్రయాణము చేయును. వివాహమునకు పూర్వము యువకులు ఎడారులలో నుండు బిడోయిన్ గుంపులలో చేరి ధైర్యసాహసాది గుణముల నలవఱచుకొని వచ్చుటకు పంపబడుట వాడుక. ఒకయువకునికి వధువు నిర్ణయము కాగానే వధువుతలిదండ్రులకు వార్త నంపుదురు. తర్వాత వధువు ఒకచెలికత్తెతో చక్కగా నలంకరించబడిన యొంటెపై నెక్కి వరునింటికి వచ్చును. కూడ మరికొన్ని యొంటెలపై సారెవస్తువు లన్నియు పంపబడును. ప్రయాణ మెంతదీర్ఘమయినను వధువుతో కూడ మేళగాండ్రును ఒంటెలపైనెక్కి మేళము వాయించుచు పోవుదురు. వివాహమునకు సంబంధించిన కలాపము చాల తక్కువ. క్లుప్తముగానుండును. కానివిందులు విస్తారము. బహుపత్నీకత నిరాక్షేపణీయమయినను, ఆచరణములోనుండుట తక్కువ. వివాహచ్ఛేదము (Divorce) కూడా చాల సులభము. కొన్నిచోట్ల భార్యలను మార్చుకొనుటయుగూడ కలదు! ఒకడు తనభార్య నిష్టపడనియెడల నామెను పుట్టినింటికి పంపవచ్చును. కాని అట్లు పంపునపుడు ఆమెతోతోలుతవచ్చినసారెనంతయు గూడ పంపివేయవలెను. ఒకడు చనిపోయిన యెడల నతనిభార్యను వాని సోదరుడే పెండ్లియాడవచ్చును. పెదతండ్రి పినతండ్రికుమార్తెలను పెండ్లియాడునాచారము అరబ్బులలో కలదు. ఒకవేళ సహోదరు లెక్కువమంది యుండి బాలిక యొక తెయే యయినయెడల నాసహోదరులలో జ్యేష్ఠునికిగాని, లేక అవివాహితుడగు పెద్దవానికిగాని ఆ బాలికను

పెండ్లియాడుహక్కు కలదు. స్త్రీలకు గూడ భర్తలం దేవైనలోపములుండి తమసుఖభంగ మునకు గారణమైనయెడల భర్తలను వదలు స్వాతంత్ర్యము గలదు.

సొంతముగా సంపాదించుకొనుయోగ్యతగలస్త్రీ తన సొమ్మును ఇష్టానుసారముగా వ్యయించవచ్చును. స్త్రీలను కాపాడుటలో పురుషులు మిక్కిలి శ్రద్ధవహించెదరు. వారికిని తమవలెనే స్వేచ్ఛ నొసంగెదరు. ఒకవేళ నొకస్త్రీ దుర్నీతిపరురాలైన పురుషునికి వలెనే యామెకును చాపల్యముండుట సహజమనుభావమునుజూపి యామెనురట్టుచేయరు. 'బిడోయిను'లను నొక అరబ్బీ తెగవారిలో రాక్షసవివాహాచారముగూడ గలదు.

స్త్రీలకు విద్య లేదు. పట్టణవాసులల్లో ధనికులలోతప్ప స్త్రీలకు చదువను, వ్రాయను రాదు.

## మూరుస్త్రీలు

మొరాక్కోవాసులు మూరు లనబడుదురు. వారిస్త్రీలు అరబ్బీస్త్రీలకన్న సౌందర్యవతులు. స్పెయినుదేశవాసులగు మూర్కిసులు ౧౬-వ శతాబ్దమున స్వదేశమునుండి తరుమబడి 'మొరాకో'కు వలస వచ్చి యచ్చటివారిలో సంకరమును చెందిపోయిరి. వారే 'మూరులు'. వారు స్పెయినుదేశస్థులనే చాలమట్టుకు పోలియుందురు. వారికి తెల్లనిదుస్తులన్న ప్రీతి. పురుషులదుస్తులు నిరాడంబరములు. స్త్రీలదుస్తులు మిక్కిలి ఆడంబరముగా నుండును. తెలుపున సన్నని మల్లు దుస్తును లోపల మొదట తొడిగి పైకి వెండి, లేక బంగారుపూవులు కుట్టిన రంగు అరచొక్కాను తొడిగి, ఈ అరచొక్కా వరకు వచ్చునట్లు నీలము, ఎరుపు, లేక పచ్చరంగు గల నిజారును తొడిగి దానిపై మరల నడుమునకు పట్టుదట్టీని కట్టుకొందురు. ఒక కాలిని మాత్రము మూయక దానియందు వెండి అందెలను ధరింతురు. పాదములకు చిన్న చెప్పులను తొడుగుదురు.

## మూరులగృహములు

అరబ్బుల గృహములకన్న మూరుల గృహములు శిల్పకౌశలము గలిగియుండును.



౮. నీగ్రోసాంకర్యముగల దక్షిణ అల్జీరియాదేశపు బాలిక

అందలిముఖ్యాంశ మేది యన, ఇంటివెనుక నొకవిశాలమగు ఆవరణముండి దానిలో సగముభాగమునకు పైకప్పు వచ్చియుండి కప్పు

పైన మేడగదులుండును. కప్పులేని భాగము నందు, నీటిబుగ్గలుగల చిన్న యుద్యానవనము ఉండును. ఆవరణమునుచుట్టి గదు లుండును. ప్రతిగదికిని ముం దొక పెద్ద కమానుకల ద్వార ముండును. ద్వారమున కంతయు చక్కని చెక్కడపుపనులుగల పెద్దతలుపును, ఆ తలుపునందు మఱియొక పిల్ల ద్వారము నుండును. గదులందు నేలలో చదరపురాళ్లు పఱుపబడియు గోడలందు గూడ చదరపు రాళ్లు పొదుగబడియు నుండును. కప్పు యొక్క లోభాగమునందు (Ceiling), చిత్ర విచిత్రపు నగిషీపనులు చేయబడి యుండును. మేడలోని గదులకు పోవుట కనేక మెట్లవరుస లుండును. మేడపైన ఆరుబయ లుండి దాని యందు స్త్రీలుమాత్ర ముబుసుపుచ్చుటకును చల్లనిగాలి ననుభవించుటకును అవకాశము గలిగియుండును.

మూరులు సామాన్యముగ నంతస్థూల కాయులు కారు. కాని బాలికలు వివాహ మునకు పూర్వము చక్కగా బలియుటకు దగినయాహార మివ్వబడుదురు.

వివాహవిషయము

వివాహము నిశ్చయమైనయెడల వధూ వరులు వివాహమునకు ముందొకమారు పర స్పరము చూచుకొనవచ్చును. ఇదియు బహి రంగముగ జరుగరాదు. వధువు వరునింటికి రాత్రికాలమున సాధ్యమయిన, వెన్నెలరాత్రి యందు తీసికొనిపోబడును. వివాహోత్సవ ములు సాధారణముగా సాయంకాలము నందును, రాత్రియందును జరుగును. ధనికుల



౫. దక్షిణ అల్జీరియా బౌసాదా దేశపు యువతి

యిండ్లలో వివాహ మన్న యెడల వధూవరుల గృహములుండువీథులు జనసమ్మర్దము గలవై వీథివారందరు తమ యుత్సాహమును జూపు దురు. సారెగొనిపోవు సేవకులు జనమధ్యము నుండి పోవుటయు చాల కష్టమగును.

వధువును బోనువంటి యొక పెట్టెయం దుంచి వీథులలో నూరేగించుకొని వరునింటికి గొనిపోవుదురు. ఆపెట్టెకు తెల్లగా సున్నము కొట్టబడి యుండును. కూడ మేళతాళము లుండును. మార్గమున నుండు ప్రతి దేవాల యమువద్దను పూజారియొక్క దీవనల గొను టకై వధు వాగవలసి యుండును.

దారిపొడుగునను జనులు వారి వారి యిండ్లనుండి అభినందన వాక్యముల జెప్పు

చుందురు. వరునిల్లు చేరిన వెంటనే యాబోను ను వివాహముజరుగుగదికి గొనిపోయి వధువును వెలికిదీతురు. తర్వాత నాపెట్టెను వధువును మరల నలంకరింతురు. వధువు చెలికత్తె గదితలుపుమూసి బీగము వేసి తాళపుచెవిని వరుని తల్లి కిచ్చును. తర్వాత వరుని తల్లి వధువువద్దకుపోయి కొంతమాటలాడి పిమ్మట వరునికి తాళపుచెవి నిచ్చి పంపును. అంత



౬. అల్జీరియాయువతి. ముఖమునను చేతులయందును పచ్చ పొడిపించుకొని యున్నది

టితో వివాహము పూర్తి యగును. రెండు రోజుల తర్వాత, వధువును గొనివచ్చిన బోనును ఇంటిపైన నందరికిని తెలియునట్లుం చెదరు. అప్పటినుండియు స్నేహితులు భార్యాభర్తలను జూచుటకు రావచ్చును. భార్య తన స్నేహితురాండ్రను ఏకాంతమున జూడవచ్చును. ౩, ౪ రోజులు భార్య తన స్నేహితురాండ్రతో నిష్టాగోష్ఠి నుండును. తర్వాత భర్త ఒకవారమువరకు తన స్నేహితులతో సల్లాపగోష్ఠి నుండి విందు లొసగుచుండును.

మూరుస్త్రీ జననమాది వివాహపర్యంతము తండ్రియండను, వివాహాది మరణ పర్యంతము భర్తయండను ఉండుటవలన నామె స్వాతంత్ర్యవిహీన యని యనరాదు. వివాహమయినదాది బాహ్య ప్రపంచానుభవము లేదని యొకకొదువయేగాని,యామె భర్త కన్ని విధముల సహధర్మచారిణి యగుటయే కాక గృహపరిపాలనయందు సంపూర్ణాధికారము గలిగియుండును. భర్తనే కట్టడి చేయు స్వాతంత్ర్య మామెకు గలదు. భర్త యామె మాట జవదాటజాలడు. కాబట్టి పాశ్చాత్యవిధానములకు ఇట్టిపరిస్థితులు సంకుచితములుగను, హేయములుగను కనుపట్టినను ఇతరులనుకొనుపాటి పరాధీనత లేక మూరుస్త్రీలు సుఖజీవు లనియే చెప్పదగియున్నారు.



దేవస్థాన ధర్మసత్రము తిరుపతి - రైలుస్టేషన్ దగ్గరనున్నది

M. V.



M. V.

కపిలేశ్వరాలయము, తిరుపతి

# మధ్యవర్తిత్వము

కాళ్ళూరి వెంకటరామారావు.

౧

రామసోమయాజిపేరు చెబితే కళ్ళేపల్లి అగ్రహారంలో పిట్టలు నీళ్ళుతాగవు. తండ్రితాతలు యజ్ఞాలుచేసినందుచేత వంశక్రమాగతంగావచ్చిన పౌరుషనామమే నిల్చిపోయిందిగాని అతనికి వైదికప్రవృత్తి మొదటినించీ లేదు. పూర్వార్జితపు ఆస్తి కొంతఉంది అతనికి. వేదమూర్తులై ప్రభువుల వార్షికాలవల్ల సంపాదించిన క్షేత్రములవి. దాన్ని జాగ్రత్తపరుచుకుంటూ జీవిస్తే ఆకుటుంబానికి కేవిధమైన లోటూ ఉండకపోయేదే.

చిన్నప్పటినించీ సోమయాజిమనసు వైదికంవేపుకంటె లౌక్యంవేపే ఎక్కువమొగ్గు చూపింది. తండ్రి చనిపోగానే అతని కేవిధమైన అడ్డూ లేకుండాపోయింది. ఊళ్ళోనూ, చుట్టుపక్కలా తగవులు బయలుదేరితేచాలు రామసోమయాజి అక్కడ వాలాడన్నమాటే. ఏదోఒకపార్టీని వెనకేసుకుని కోర్టుకెక్కించేస్తేగాని అతనికి నిద్రపట్టేదికాదు.

తేజోవంతులై, ఏపరిస్థితుల్లోనూ వీథిఅరుగుదిగకుండా శిష్యవర్గానికి పాఠాలుచెప్పుకుంటూ శ్రీమంతుల మన్ననలందిన వేదమూర్తులు అతని పెద్దలు. జీవించిన యెనభైతొంభైయేళ్ళలోనూ పూటకూళ్ళ భోజనం రుచి యెరగవు వారి జిహ్వలు. కోర్టుసమ్ముఖం తొక్కనేలేదు వారి పాదాలు.

రామసోమయాజులు క్రమంగా పెద్దవ్యవహారస్థుడైపోయాడు. విజయనగరం, విశాఖపట్నంకోర్టు వకీళ్ళకతనిరాక కళ్ళపండుగ. నెలకి యిరవైతొమ్మిది రోజులు ఇంట్లో విస్తరివెయ్యడపు అలవాటు అతనికి లేదు. అతడంటే ప్రతివాడికీ భయమే.

రోజులవెంబడిని సోమయాజి లౌక్యజ్ఞానమెక్కువైపోయింది, ఇతరుల వివాదాలలో తిరిగి ఆర్జించిన వ్యవహారజ్ఞానము అతనిబుద్ధిని స్వవిషయం వంకకు తిప్పింది. కొంతభూమి వారసత్వరీత్యా తనకు రావాలని ఒక మారపుజ్ఞాతిమీద దావాపడేశాడు.

కోర్టుయిల్లయిపోయిన సోమయాజితో తంటాలు పడలేదు. దావాఖర్చులకోసం యిల్లు గుల్లచేసుకోవడం యిష్టంలేదు. న్యాయం తనవేపే ఉందని స్పష్టంగా తెలిసినప్పటికీ ఆజ్ఞాతి రామసోమయాజితో రాజీపడిపోయేడు. అందుమూలంగా సోమయాజికి నాలుగుయెకరాల పల్లపుభూమి కలిసొచ్చింది.

శ్రమలేకుండా పొందిన ఈ ప్రథమవిజయము అతన్ని ఉత్సాహపూరితుణ్ని చేసేసింది. వెంటనే మరి నాలుగు దావాలు మరికొందరిమీద పడేశాడు వాళ్ళ స్థిరాస్తులు తనకి స్వాధీనపరచమని.

సోమయాజి అనుకున్నంత చులాగ్గా తేలిపోలేదీవ్యాజ్యాలు. నలుగురూ యేకమై సోమయాజిసత్తువ చూడాలనుకుని ప్రతివాదన సాగించారు. కొన్ని జిల్లాకోర్టునూ, కొన్ని హైకోర్టునూ చూశాయి వ్యాజ్యాలు. ఎందులోనూ నెగ్గలేకపోవడంసరికదా, వాటిలో అయిన ఖర్చులు సోమయాజియింటికీ వాకలికీ యెసరుపెట్టాయి. ఏబాధ్యతలూ లేని అతనిఆస్తి ఋణముల భారాన్ని మూలగడం ప్రారంభించింది.

సోమయాజికి నలుగురు కుమాళ్ళూ, యిద్దరు కుమార్తెలూను. విశ్వేశ్వరశాస్త్రి అతని పెద్దకుమారుడిపేరు. ఇప్పుడు శాస్త్రి విజయనగరంకాలేజీలో బి. ఏ. చదువుతున్నాడు. అతనికి వివాహమై నాలుగేళ్ళయింది. అతని అత్తవారి ఊరు "గరికివలస" విజయనగరానికి పదిమైళ్ళ దూరంలో ఉంది.

ఒకప్పుడు విజయనగరంమహారాజావారు వేటాడి, పరివారమునుండి వేరయిపోయి, చీకట్లో దారితప్పి గరికివలస చేరుకున్నారు జామురాత్రివేళకి. శ్రాంతుడైన రాజు గుర్రాన్ని వీథిలో చెట్టుకి కట్టేసి ఒక బ్రాహ్మణ

యింటి అరుగుమీద కూర్చున్నాడు. ఆయింట్లో ఒక వృద్ధురాలుమాత్రం ఉన్నది. ప్రభువుని గుర్తించలేదు గాని ఇంటికివచ్చిన అతిథి అభోజనుడై ఉండటం ఆవిడ కిష్టంలేకపోయింది. ఇంట్లో కూరగాయలైనా లేని పేదరాలు. అతిథిసత్కారానికి మాత్రం దరిద్రమెరగని హృదయ మావిడది.

పెరట్లో పాముమీసాలవలె పెరిగిన గరికె యింత కోసుకొచ్చి పచ్చడిచేసి ఊరగాయతో భోజనంపెట్టింది అతిథికి. క్షుధార్తి రాచఠీవినిసహితం మరిపించేసింది. అవ్వ విశేషబలవంతం చెయ్యనక్కరలేకుండానే మహారాజు భోజనానికి లేచాడు.

కుచేలుడి అటుకులు శ్రీకృష్ణుడికి పూర్ణసంతృప్తిని కలిగించాయి. పశువులుతినే గడ్డికూడాసహితం రుచి పుట్టించగల వృద్ధురాలి పాకనైపుణ్యానికి మెచ్చింది పంచభక్ష్యాన్నములను మెచ్చని శ్రీమంతుడి జిహ్వ. చేతికి యెముకలేని దానకర్ణుడు మహారాజు. ఆగ్రామాన్ని అగ్రహారంగా దానపట్టా రాసి యిచ్చేశాడు. గరికిపచ్చడివల్ల పుట్టిందిగనుక "గరికివలస" అని పేరు.

ఇప్పుడా అగ్రహారంలో ఏడెనిమిది బ్రాహ్మణ కొంపలుమాత్రం మిగిలిఉన్నాయి. చదువులకీ, ఉద్యోగాలకీ, యాచనావృత్తికీ గరికివలసలోని బ్రాహ్మణ్యం అంతా దేశాంతరాలకి చెదరిపోయింది.

గరికివలసఅగ్రహారంలో అవధానులు గారి దొక్కాటే లోటులేని సంసారం. ఆయనకి సుందరమ్మ ఒక్కర్తే కుమార్తె. ఇంట్లో ఖర్చు తక్కువచేతా, ఆయనభార్య మహాలక్ష్మమ్మ తెలివితేటలచేతా అవధానులఆస్తి బాగా వృద్ధిపొందింది. ఆయన బతికిఉన్నప్పుడేనా ప్రతివిషయంలోనూ మహాలక్ష్మమ్మదే ఆఖరు మాటగా సాగింది.

మహాలక్ష్మమ్మ విశాఖపట్నంలో కోర్టాకంపెనీల యేజెంటుగా పనిచేసి విశేషధన మార్జించిన మహేంద్రసోమయాజులుగారి కుమార్తె. పట్నవాసపు పిల్ల. శక్తిసామర్థ్యములుగల మెదడు. అవధానులావిడ మాట కెదురుచెప్పలేకపోయేవాడు. ఏ వేదం చదువుకున్నవాడికో కూతురునిచ్చి పెళ్లిచేసి అల్లుణ్ణి యిల్లరికం తెచ్చుకోదలచుకున్న అవధానులు ఆవిడపట్టుమీదనే సుందరమ్మని అప్పటికి స్కూలుఫైనలు చదువుకుంటూన్న విశ్వేశ్వరశాస్త్రి కిచ్చి వివాహంచేశాడు.

అప్పులబాధతో కృశించిపోతూఉన్న తన ఆస్తికి అవధానులుగారి నిలవడబ్బు సంజీవనీఔషధంలాగు కనబడ్డాది సోమయాజులికి. పెళ్లిఅయిన సంవత్సరం నాడు సుందరమ్మ పెద్దమనిషయింది. ఇంతలో అవధానులు చనిపోయాడు.

తగినసమయం దొరికిందికదా అని మధ్యవర్తుల చేత సోమయాజి కబురు పంపాడు మహాలక్ష్మమ్మకి. ఆమెవద్ద ఉన్న నిలవసొమ్ముతో తన ఋణములు తీర్చ వలసిందని. ఉన్నఆస్తి ఏమాత్రమైనా కూతురుకీ, అల్లుడికేకదా ఇవ్వదలచుకుంది? అలాంటప్పుడు అల్లుడి భూములు అప్పులపాలై పోతూఉంటే కాస్తసహాయ పడమని కోరడంలో తప్పేమున్నది?

ఆమదిఅయినా మహాలక్ష్మమ్మ అంతసులభంగా లొంగిపోలేదు సోమయాజులుకి. కోరినట్లూ సొమ్ము రాకపోయినప్పుడు కోడలింక తనసుమ్మంతొక్కడానికి వీల్లేదనిఅతడు బెదిరించాడు. "నాఆస్తి నాకుమార్తెకి యిచ్చుకుంటానుగాని మీఋణాలన్నీ తీర్చడానికి నాకవసరములేదు. మీకు దయఉంటే కార్యంచేసుకొండి. లేకపోతే మాపిల్ల మాయింట్లోనే ఉంటుంది" అని ఆమె వియ్యంకుడికి జవాబుచెప్పింది.

తనపేరుచెబితే హేమాహేమీలు గడగడలాడుతూఉంటే కేవలం ఒకస్త్రీ, అందులోనూ పిల్లనిచ్చుకున్నది అల్లా యెదిరించడంచేత సోమయాజులశరీరం మండుకుపోయింది. తనమాటలేనిదే అత్తవారితో ఉత్తరప్రత్యుత్తరాలుగాని, వాళ్లయింటికి వెళ్లడంగాని జరగరాదని కుమారుడికి ఆర్డరిచ్చేశాడు.

౨

పైవిషయాలు జరిగి రమారమి రెండుసంవత్సరాలు గతించాయి. సుందరమ్మ వ్యక్తురాలయికూడా రెండేళ్లు దాటాయి. ఉన్న ఒక్కకుమార్తెవల్లనైనా,

అల్లుడు యింటికి రావడం పోవడం మొదలైన ముద్దు ముచ్చట్లు తీరలేదు మహాలక్ష్మమ్మకు.

వియ్యంకుడి మనస్సు తిప్పడానికి పెద్దమనుష్యులద్వారా అనేకసార్లు ప్రయత్నించింది. తను స్వయంగా కళ్లేపల్లిఅగ్రహారానికి వెళ్లి ప్రార్థించింది. సోమయాజులగుండె చలనమన్నదే యెరగని పాషాణము.

మహాలక్ష్మమ్మ తల ఆలోచనల పాతర. వియ్యంకుడి నిరాదరణతో ఆమె అధైర్యముపొందలేదు. విజయనగరంలో చదువుతూన్న అల్లుడికి గరికివలస ఒకసారి రావలెనని కబుర్లుపంపించింది. అతను రాకపోయినప్పటికీ పండుగపర్వాలకు బహుమతులకింద కొంతడబ్బు పంపిస్తూఉండేది.

నిరంకుశుడైన తండ్రికి జడిసి విశ్వేశ్వరశాస్త్రి అత్తవారింటికి వెళ్లడానికి సాహసించలేకపోయాడు. సంతతానందప్రదమగు యౌవనద్వారాన్ని సమీపించిందతని వయస్సు. నిత్యవసంతశుభోదయమున జీవితమధుర రసాస్వాదనమునకు త్వరపడుతూంది హృదయము అతని ప్రయత్నం లేకుండానే.

వివాహంలో ఏంచూశాడో అంతేగాని ఈనాలుగేళ్లా యీ శాస్త్రి మరి భార్యముఖమునుచూచి ఎరగడు. ప్రాపంచికకాలుష్య మేమాత్రమూ అంటని విశాల హృదయ మతనిది. ఉన్నతవిద్యావల్ల సంస్కారమును పొందిన జ్ఞానము. పవిత్రప్రేమమందు ఏ అభ్యంతరములనూ పాటించని నూత్నయౌవనము.

తండ్రికోరికలో ఉన్న అసందర్భాన్ని అతడు నిముషంలో గ్రహించాడు. అతని క్రూరత్వానికి అసహ్యించుకున్నాడుకూడా. కాని ఆచండశాసనుణ్ణి ఎదురుకునే ధైర్యంమాత్రం చాలదు.

పెళ్లిదుస్తులతో తీయించుకున్న సుందరంఫోటో అతనిపెట్టెలో ఉంది. అప్పటి కామె పదమూడేళ్ల పిల్ల. లక్ష్మీకళ లీనుతూఉండే పసుపుబట్టలూ, అమాయకత్వముస్ఫురించే ముఖమూ, నిష్కలుషమగు ప్రేమను ప్రతిఫలించే కాటుకకళ్లూ, బాల్యకాల చిహ్నముల పైని అప్పుడప్పుడే స్ఫురిస్తూఉన్న యౌవనముద్రలూ కలిగి ఫోటోలో ఉండికూడా సుందరిసౌందర్యము శాస్త్రి హృదయంపైని వశీకరణమంత్రాలను ప్రయోగించేది. ఆఫోటోలో ఉన్న పిల్ల యిపుడు యెదట నిలబడితే తాను పోల్చుకోగలడా? ఆమె యిప్పు డెలాగున్నాదో ఒకసారి చూడ్డానికైనా తనకి అవకాశం లేదుకదా అని అతను చాలా విచారించాడు

భార్య వ్యక్తురాలయి తన్ను కలియక పూర్వం అత్తవారింటి అనుభవముల మాధుర్యమును రుచిచూసిన వారకు లెంపరున్నారో తెలియదు. కాని ఆ ఆనందము అనిర్వచనీయము, అద్వితీయము. అది కరువైపోయింది శాస్త్రికి. రాత్రివేళ చదువుముగించి పక్కమీద శరీరం వాల్చినతరవాత నిద్రపట్టేవరకూ, ఆపిమ్మట స్వప్నవీథులలోనూ, భావనాప్రపంచంలోనూమాత్రం అతనికిసౌఖ్యం కొంత లభిస్తూఉండేది.

రమారమి ఏడాదినించి భార్యను ఒకసారి చూసి తీరాలన్నకోరిక అతనిలో గాఢంగా వేళ్లుపారింది. "తండ్రికి తెలియకుండా గరికివలస వెళ్లి అత్తవారింటి ముందునించే వెళ్లిపోతూ లోపలికి ఒక్కసారి చూస్తే సుందరం కనబడకపోతుందా? ప్రేమదేవత దివ్యవాణి ఆమె హృదయాన్ని ప్రమోగించడంచేత నేను వెళ్లేసమయానికి సరిగ్గా సుందరం వాళ్ల వీథిఅరుగుమీద స్తంభాని కానుకుని నిలబడి ఉంటుందేమో? నన్నావిడ గుర్తించకుండా నేనుమాత్రం ఆవిణ్ణి కళ్లారా చూసి ఏమీ యెరగనట్లు మళ్లీ వచ్చేస్తే తప్పేముందీ? తరవాత దైవకృపవల్ల యిద్దరమూ కలుసుకున్నప్పుడు ఆమెకీ సంగతి నేను జ్ఞాపకానికి తేవచ్చును. తాను నన్ను పోల్చుకో లేకపోయినందుకు వేళాకోళంకూడా చేయవచ్చు." ఇవీ ఆలోచనలు.

లేదా, అత్తగారంతప్రేమతో అన్నిసార్లు వర్తమానం చేస్తున్నపుడు ఒక్క సెలవురోజున వాళ్లింట్లో ఉండివస్తేమాత్రం ప్రమాద మేమిటి? ఇంతా తెగించి వాళ్ళ ఊరు వెళ్లి ఒక్కపూటైనా వాళ్ల యింట్లో ఉండకుండా రావడానికి వాళ్లుచేసినద్రోహ మేమిటి?

నాకు సుందరాన్ని చూడాలని ఎంత ఉందో ఆవిడకీ మాత్రం నన్ను చూడాలని అంత ఉండదూ ? దైవం మాత్రం అంగీకరిస్తాడా ? తీరా నేను వెళ్లేసరికి సుందరం వీధి అరుగుమీద ఉండకపోతే ? వాళ్ల వీథితలుపులు మూసేసిఉంటే? అంతా వృథాప్రయాసేగా? నాన్న ఏమనుకున్నా సరే. వెళ్లి తీరాలి"

సంవత్సరంనించి ప్రతిరాత్రీ ఈ నిశ్చయం చేసుకుని, అక్కడి కెళ్లిన తరవాత తను ప్రవర్తించవలసిన విధానమును గూర్చి ఊహించుకుంటూనే అతడు నిద్రపోతున్నాడు. మనసు తెగించడం లేదు.

## 3

శ్రావణపౌర్ణమి శుక్రవారంనాడు రావడంచేత శనివారాదివారాలతో కలిసి వరసగా మూడు రోజులు కాలేజీకి సెలవులు. ఈ రోజుల్లోనైనా తప్పకుండా అత్తవారింటికి వెళ్లాలని దృఢసంకల్పంతో చాలా రోజులనించీ ఎదురుచూశాడు శాస్త్రి.

అత్యాత్రముతో నిరీక్షించిన శ్రావణపౌర్ణమి వచ్చింది. విద్యార్థులు చాలామట్టుకు స్వగ్రామాలకు వెళ్ళినందువల్ల హాస్టలులో సమ్మర్దము తక్కువగాఉంది. గరికివలసప్రయాణానికిదే సమయ మనుకున్నాడు విశ్వేశ్వర శాస్త్రి.

ఉదయం ఎనిమిదిగంట లింకా కాలేదు. ఆకాశము నిర్మలమై, వినీలమై, తేజోవంతమైఉంది. అక్కడక్కడ స్వచ్ఛధవళములైన అంచులుగల మేఘాలు ఉన్నాయి. వాటిగర్భములందు మాత్రం కొంచెమంత నలుపురంగుగల నీటిజాడలు ఉన్నవి. త్వరలో వర్ష సూచనలు లేవు. జీవకోట్లకి ఉత్తేజమును ప్రసాదిస్తూంది ప్రకృతి యావత్తూను.

వైదికకుటుంబంలోవాడు కాబట్టి పౌర్ణమిపూటా గెడ్డం గీసుకోడానికి మొదట కొంత సందేహించాడు శాస్త్రి. కాని ప్రయాణం తలపుకి వచ్చినపుడు గెడ్డం చేసుకోకుండా వెళ్ళడానికి మనసు ఒప్పడంలేదు. మంగలివాడు ముట్టుకోకుండా ఉంటే తప్పులేదని మనసును సమాధానపరచుకుని తనే గెడ్డాన్ని శుభ్రపరుచుకుని స్నానంచేశాడు. బట్టలు కట్టుకోవడం అతడంత అలవాట్లన్ని అంతకుముందెన్నడూచేసి యెరగడు. ఆమట్టు పనికిరాదని యిదీ, ఈ ఖండువాని మెచ్చుకయింకొకటీ, పంచ బాగులేదని మరొయీ, అది నచ్చక మళ్లీ పంచా గంటసేపు పట్టింది డ్రెస్సువేసుకొని తయారయేసరికి.

ఉన్నత విద్య హృదయంతోపాటు వేషభావల నుకూడా సంస్కరించడంచేత శాస్త్రికి నాగరికుల్లో స్థానంలేకుండాపోలేదు. పల్లెటూరు ఆరోగ్యమూ, కాంతీ, అమాయకత్వమూ, పట్నవాసపు నాగరికతా, తెలివితేటలూ అతనిలో సౌఖ్యంగా మిళితమైపోయాయి.

అప్పుడే సింహాచలంనుంచి వచ్చిన పూలజాతులను కొనుక్కుని, దేపీదుకాణంమీద మిఠాయిపొట్లాం కట్టించి శాస్త్రి సైకి లెక్కేసరికి రమారమి తొమ్మిది గంటలయింది. బాగా శృంగారించుకుని పేరంటాళ్ళని పిలుచుకోడానికి పోతూఉన్న పదహారేళ్ళ అమ్మాయి ఒకర్తె అతని కెదురుగా వచ్చింది.

పట్టణం సరిహద్దులను దాటింది మొదలుకుని ప్రకృతి సౌందర్యములో మునకలేస్తూ ఉన్న పరిసరాల్లోనించి సాగుతుంది రోడ్డు. రెండు వేపులా పచ్చని కొండలు; మధ్యమధ్య గెడ్డలు; వంతెనలూ ఏళ్లూ దాటి శరవేగాన్ని పోతూంది సైకిలు.

అడావిడితో నిండి విసుగెత్తించిన పట్నం విడిచిపెట్టిన తర్వాత యీ ప్రశాంత ప్రకృతి సౌందర్యమతని హృదయానికి నిర్మలానందాన్ని సమకూర్చి, మార్గాయాసం తోచనియ్యలేదు అతని రిస్టువాచీలో పదిగంట లింకా కానేలేదు శాస్త్రి గరికివలస కోనేటి గట్టుమీద సైకిలు దిగేసరికి.

కోనేటికీ ఊరుకీ మధ్య రెండు ఫర్లాంగులకంటె యెక్కువ దూరం లేదు. బ్రాహ్మణకేవుల్లో ఒకరిద్దరు స్త్రీలు నీళ్లుముంచుకుంటున్నారు. చుట్టుప్రక్కల ఇతర జనసంచారం లేదు.

మఖకార్తెయెండ చుర్రుమంటూ తగిలినందుచేత శాస్త్రికి నుదుటిమీద చెమటపోసింది. కోనేట్లో

దిగి కాళ్లూ, ముఖమూ కడుక్కొని ఇన్నినీళ్లు తాగి తిరిగీ గట్టుమీద కొచ్చా డతను. జేబురుమాలుతో తడి ఒత్తుకుంటూ చల్లగాలి అనుభవిస్తూ నిలబడ్డాడు.

వివాహానికి వచ్చినపుడు వాళ్లు ఆ చెరువుగట్టు మీద, అతడు నిలబడిఉన్న మర్రిచెట్టుకిందనే ముందుగా బళ్ళతో దిగారు. ఆడపెళ్లి వారొచ్చి ఆహ్వానించేదాకా ఆచెట్లనీడలలో జంబుకానాలు పరిపించి భోగముమేళం చేయించారు. అతను నిల్చున్న చోటునుండీ అగ్రహారపు బ్రాహ్మణవీథి కనిపిస్తూనే ఉంది. పెళ్లి అయిదురోజులూ వాళ్లు విడిదిదిగిన బోర్డుస్కూలు బంగాళా చెరువుకీ ఊరికీ మధ్యదారిలో ఉంది. ఏనాళ్లకి వచ్చినపుడు అతడు బ్రాహ్మణరేవులోనే స్నానంచేసేవాడు.

నాలుగు సంవత్సరాలు గడిచిపోయినప్పటికీ ఈ స్థలాలన్నీ సుపరిచితములై కనబడి శాస్త్రిహృదయంలో తియ్యని భావాలను రేకెత్తించాయి. అత్తవారింటికి వెళ్లడమూ, మానడమూ అని అంతమూరంవచ్చాక అతని కొకసందేహం కలిగింది. కాని అది ఒక్క నిముషం మాత్రమే. ఖండువా మళ్లీ సరిచేసుకుని, నుదుటిమీద పడుతూ ఉన్న క్రాపింగును ఒక్క తలవిసురుతో వెనక్కి తోసేసి మళ్లా పైకిలెక్కాడు. బ్రాహ్మణవీథి మలుపుతిరిగి రెండుయిళ్లు దాటగానే అతని అత్తవారిల్లు వున్నది.

౪

విశ్వేశ్వరశాస్త్రి ఇంట్లో ప్రవేశించేసమయానికి సుందరమ్మ దేవుడిగదిలో లక్ష్మీపూజ చేసుకుంటూంది. పూజచేయించే బ్రాహ్మణుడు చదువుతూఉన్న మంత్రాలు సావిట్లో కూర్చున్న శాస్త్రికి వినబడుతూనే ఉన్నాయి. చాలాకాలంకిందట చూసినందుచేత మొదట అత్తగారు అతన్ని పోల్చుకోలేకపోయింది. కాని కొంచెంసేపటిలోనే గ్రహించి ఉచితరీతిని మర్యాదచేసింది. క్షేమసమాచారాలన్నీ మాట్లాడుకున్నారు. ఇంతలో వ్రతకల్పం చేత్తో పట్టుకుని లోపలనించివస్తూ బ్రాహ్మణుడు శాస్త్రివేపు వింతగా చూసి వీథిలోకిపోయాడు.

లక్ష్మీపూజని పూర్తిచేసి లేవగానే కుమార్తెకు అల్లుడు వచ్చినవార్తను మహాలక్ష్మమ్మ తెలియచేసింది. తల్లి వంటయింట్లోకి వెళ్లిపోనిచ్చి సుందరమ్మ మళ్లీ లక్ష్మీదేవిపీఠముదిక్కు తిరిగి జోడించిన చేతులతో, ఇనుమడించిన భక్తితో, కృతజ్ఞతాపూరితహృదయంతో రెండునిముషాలు ధ్యాననిమగ్న అయిపోయింది. ఆమె పూజ ఫలించింది.

భోజనంచేస్తున్నంతసేపూ పక్కనున్న గవాక్షములోనించి సుందరిదృష్టులు రాకరాకవచ్చిన భర్తను ముంచివేశాయి. ఆమెమనసులో సంతృప్తీ, ఆనందమూ, ప్రేమా వెల్లివిరిసిపోయాయి. సుందరి జ్ఞానవంతురాలు. భర్తరాక ఆమె కొక అనిర్వచనీయమగు మానసికోన్నత్యాన్ని కలిగించింది.

తనవిశ్రాంతికోసం యేర్పడిన పడకగదిలో డ్రాయరుమీద తమలపాకుల మడతలుంచి తిరిగీ పైకి వచ్చేటప్పుడు చూశాడు భార్యను మొట్టమొదటిసారి శాస్త్రి.

ఆమె కిపుడు పధ్ధెనిమిదో యేడు ప్రవేశించింది. వసంతరుతువున పల్లవితమైన లేమావిగున్నవలె ఆమె సౌందర్యము పరిపూర్ణమై నేత్రోత్సవ మొనగూర్చింది శాస్త్రికి. ఉదయాన్నే తలంటుకుందికామోసు వదులు వదులుగా ఉంది పొడుగైన జడ. ముంగురులు చెప్పిన మాట వినకుండా పసుపునిగ్గులుదేరిన ముఖంమీద పడుతున్నాయి. లక్ష్మీపాద సంస్పర్శచే ధన్యతనందినది ఒక్కటే గులాబిపుష్పము ఆమెసిగలో ఉంది. పూజా సమయాన్ని ధరించిన బనారసుచీరమీద ఉన్న జరీపనియును, ఇతరబంగారునగలును శరీరచ్ఛాయలలో కలిసిపోయి ఆమె నొకబంగారువిగ్రహంగా మార్చేశాయి. మెడకింద గంధపురేకలు, కళ్లని కాటుక, పాదాలకి పారాణి. ఆమెను చూచేసరికి శాస్త్రిహృదయం నిండి పొర్లిపోయింది.

గదిగుమ్మందాటగానే యిద్దరూ దగ్గిరైపోయారు. ఒకరినొకరు చూసుకోడానికి హృదయాలు తొందర పడ్డాయి. దృష్టులు హఠాత్తుగా కలుసుకున్నాయి. సుందరం తటాలున చూపు మళ్లించుకుని వెళ్లిపోయింది.

మధ్యాహ్నం నాలుగుగంట లవుతుంది. నిద్రలేచి ముఖంకడుక్కొని దక్షిణపువేపు గదిని ఆనుకొనిఉన్న

వసారాలో పడకకుర్చీమీద కూర్చున్నాడు శాస్త్రి. అతని కెదురుగా గోడపక్కని ఒక తుంగచాప పరిచి ఉంది. ఒకసారి చూస్తే చాలుననుకున్న అతనికోరిక లిప్పుడు మరికొంత ముందుకి సాగి సుందరితో సంభాషించడానికి కుతూహలపడుతున్నవి. కాని అది సాగే మార్గం ఏది?

ఇల్లా ఆలోచించుకుంటూ పరధ్యానంగా ఉన్నాడతను. ఇంతలో అతనిపక్కనే ఉన్న తలుపు మెల్లిగా తెరుచుకుంది. పకోడీలతో గాజుపళ్లెమూ, ఓవల్టయినుతో వెండిగ్లాసూ కల ఒక వెండికంచాన్ని అతని సమీపంగా పెట్టి సుందరి మందగమనంతో వెళ్లిపోయింది. సన్ననై, నున్ననై మద్రాసుగాజులతో అలంకరించబడిన ఆమెచెయ్యిమాత్రం శాస్త్రిని మురిపించింది.

మరి పావుగంట పోనిచ్చి మహాలక్ష్మమ్మ వచ్చి గోడప్రక్కనున్న చాపమీద కూర్చుంది. సోమయాజి దౌర్జన్యాన్ని ఆమె స్పష్టంగా విప్పిచెప్పేసింది. అన్నాళ్లు అల్లుడు రానందుకు విచారించింది. ఆవిడమాటలు విన్న శాస్త్రికి 'స్త్రీలలోకూడా ఇంత వ్యవహార జ్ఞానం కలవాళ్లుంటారా' అనిపించింది.

ఇలాగ పదినిముషాలు జరిగేసరికి గది తలుపువెనక నించి గాజుల చప్పుడువినబడ్డాది. మహాలక్ష్మమ్మ లోపలికిచూసి చిరునవ్వుతో "దా అమ్మా! యిలా వచ్చికూచో, పరవాలేదు. రా!" అన్నాది ప్రేమార్ద్రతతో. అల్లా రెండు మూడుసార్లు ఆమె నిర్బంధించిన మీదట సుందరం ఇంచుక సిగ్గుతో, వొయ్యారపు నడకలతో వచ్చి తల్లి పక్కనే కూర్చుంది.

ఈయేర్పాట్లన్నీ మహాలక్ష్మమ్మ ముందుగాఆలోచించి చేసినవే అని శాస్త్రికి తెలుస్తూనేవుంది. కాస్తంతసేపు నిలకడగా ప్రియురాలిని చూడ్డానికతనికప్పుడు కొంత అవకాశం కలిగింది. అత్తగారి తెలివితేటలకి మెచ్చుకుంటూ మనసులో ఆమెకు కృతజ్ఞతా పూర్వక నమస్కారము లర్పించాడు.

తరవాత అరగంటసేపు వారిసంభాషణ సాగింది. సుందరి వారిమాటలను నిశ్శబ్దంగా వింటూ మధ్యమధ్య భర్తవైపు చురుకు చూపులను ప్రసరిస్తూ ఉండేది.



"మధ్యమధ్య భర్తవైపు చురుకు చూపులను ప్రసరిస్తూ ఉండేది"

ఆమె మనసులో ఏ భావాలు రేకెత్తుతున్నాయో చెప్పడం కష్టం.

అయిదుగంటలుకానిచ్చి మహాలక్ష్మమ్మ వంటకి వేళయిందని లోపలికెళ్లడానికి లేచింది. ఆమెవెను వెనుకనే కుమార్తెకూడా లేచింది. వెళ్లిపోవస్తున్నావు కాని అతడు ఓవల్టయిను తాగలేదు. కాఫీకావాలేమో కాస్తచేసి ఇయ్యి. అలవాటైన వాళ్లకి కాఫీ లేకపోతే తలనొప్పి వస్తుంది యీ రోజుల్లో" అని కుమార్తెతో చెప్పింది మహాలక్ష్మమ్మ.

మరి పదినిముషాల్లో కాఫీచేసి తీసుకొచ్చింది సుందరి. కొంచెందూరంలో ఉండగానే ఆమెరాకని గ్రహించాడు శాస్త్రి. ఈసారిఅత్తగారుదగ్గిరలేదు గనుక ధైర్యం చేసుకొని భార్యతో మాట్లాడాలని నిశ్చయపరిచేసుకున్నాడు. కాని ఏమాట ముందు అనాలో స్థిరపడకముందే సుందరంవచ్చి కాఫీగ్లాసు అక్కడ ఉంచేసింది. ఏది ఆలోచించడానికి టైము లేదు. ఆలస్యం చేస్తే ఆవిడ లోపలి కెళ్లిపోతుంది. అందుచేత ఆ తొందరలోనే కొంచెంతడబాటుగా "కొంచెం మంచి నీళ్లుకూడా ఉంటే బాగుండును!" అనీశాడు.

ఆ తళుకు చూపులనుఒక్కసారి భర్త ముఖం మీదికి గురిచేసింది. మందహాసమొకటిఆవిశాలనేత్రాల్లో తొణికిసలాడింది. మంచినీళ్లు తేవడానికి లోపలికి వెళ్లింది సుందరం.

పైమూడుమాటలూ అన్నపిమ్మట ఎంతో పెద్ద పనిచేసి అలిసిపోయినవాడిలాగ శాస్త్రి ఒకనిట్టూర్పు పుచ్చి కుర్చీలో చేరబడ్డాడు. ఈ మంచినీళ్ళు యిచ్చేసి ఆమె లోపలికి మళ్లీ పారిపోతే ఏమిటిదారి? ఈసారి వచ్చేటప్పుడు ఈడొంకతిరుగుళ్ళు మానేసి స్పష్టంగా ఆగమని చెప్పెయ్యాలి. మొగమోటానికీ, మోక్షానికీ చాలాదూరం.

మంచినీళ్లు వచ్చాయి. కంఠం సవరించుకుని శాస్త్రి "కొంచెంసేపు యిక్కడ వుండకూడదేమిటి?" అని చివరమాటలు మింగేశాడు. లోపలకు పోబోతూ వున్న సుందరం నిలబడిపోయి "పకోడీలుకూడా తిన లేదేం?" అని గొణగేసింది. ఈ ప్రశ్నలు రెండూ అంతసందర్భంగా లేవు. కాని ఒకరితో ఒకరు మాట్లాడుకోందుకు యిద్దరికీ లోపలవున్న వుబలాటం మాత్రం స్పష్టపడిపోయింది.

కాఫీ పుచ్చుకుంటున్నంతసేపూ గోడకి జేర్లాబడి నిల్చున్న సుందరంవేపు చూస్తూనే ఉన్నాడుశాస్త్రి. పారాణి గురుతులుమాయని పాదాలపైని జరీఅంచులు చిందులాడేబట్లు గులాబీ రంగు చీరను కట్టుకుంది. పొట్టి చేతులుగల నల్ల సిల్కు రవిక బిగువైన శరీరానికి మరింత బిగువును కలిగించి మిసమిసలాడే యౌవనపుశరీరపు కాంతులను ప్రస్ఫుటపరుస్తూంది. విజయనగరంనుంచి శాస్త్రి తెచ్చిన పువ్వులు కళాదృష్టితో అర్ధచంద్రాకృతిగా అమర్చబడి ఆమెసిగను అలంకరించాయి. నాలుగైదు రకాల బంగారపుగొలుసులు ఆ నల్లనిరైకమీద ప్రకాశిస్తున్నాయి. ఎంతధైర్యవంతుడగు పురుషుని బింకమైనను శిరమువంచవలసిన మేలుజాతి సౌందర్యము ఆమెది.

"ఇల్లా కూర్చోకూడదూ?" అన్నాడు ముగుడై పోయి శాస్త్రి చాపను కుర్చీకి దగ్గిరగా లాగి"

చాపమీద కూర్చుంది సుందరం. అయిదు నిముషాలు నిశ్శబ్దం. చివరకి ఏమి అనడానికీ తోచక శాస్త్రి "నే నీవేళ వస్తానని అనుకున్నారేమిటి?" అని అడిగాడు.

ఎప్పటికప్పుడే అల్లా అనుకుంటున్నాం"

... ... ... ...

"యిన్నాళ్లకి దయకలిగింది కాబోలు?"

"మమ్మలిని ఎప్పుడైనా తలుచుకు నేవారా?"

"స్త్రీ తలుచుకుంటే మాత్రం ఏం లాభం ఉంటుంది? ఏంచెయ్యడానికీ స్వతంత్రురాలు కాదుకదా?"

"నామీద కోపంవచ్చిం దనుకుంటాను"

... ... ... ...

"నేనూ ఇంకా అస్వతంత్రుణ్నేకదూ"

"అయినా స్వతంత్రత కావాలన్నపుడు పొందగలరు మొగాళ్లు. ఇన్నాళ్లకేనా జ్ఞాపకానికొచ్చాం. అంతే సంతోషం"

"నేను తండ్రిచాటువాణ్ణవడంచేత యిక్కడికి రాలేకపోయినా, భగవంతుడి సాక్షిగా చెబుతున్నాను- నా హృదయం మాత్రం—" శాస్త్రి కుర్చీదిగి ఆమె సమీపానికి చాపమీదకి వెళ్లాడు. అతనిచెయ్యి ఆమె కంఠాన్ని పెనవేయబోయింది.

బెనుకుచూపులతో సుందరం సాభిప్రాయంగా వంటయింటివేపు దృష్టి తిప్పింది. "అమ్మ కేంగావాలో చూసి మళ్లావస్తాను" అంటూ లేచింది ఆమె.

ఆమెచెయ్యిపట్టుకుని కూర్చోపెట్టి నవ్వుతూ శాస్త్రి "పోనీ. కూర్చుంటేసరి. మరి నేను కుర్చీదిగను ఇంక" అన్నాడు.

అప్పటినించీ వారి సంభాషణ నిరంతరాయంగా సాగిపోయింది. సంధ్యచీకట్లు వసారా నాలుగుమూలలా ఆక్రమించుకుంటున్న సంగతి వారు గమనించనేలేదు.

౫

నారాయణమూర్తి విజయనగరంలో బాగా పేరుమోసిన వకీలు. బాగా చదువుకున్నాడు. విజయనగరానికి కొన్నాళ్లు చైర్మను పనిచేసాడు. కళాశాల వార్షికోత్సవాల్లోనూ, టౌనుహాల్లో జరిగే సభలలోనూ అధ్యక్షత వహించే టప్పుడు అతన్ని ఎరుగును విశ్వేశ్వర శాస్త్రి. అతడు శాస్త్రికీ మహాలక్ష్మమ్మకీ కూడా బంధుకోటిలోవాడు. మొగమోటమిచేత శాస్త్రి ఎన్నడూ నారాయణమూర్తియింటికి వెళ్లలేదు యీవరకు. కాని ఆయనయందు విశేష గౌరవం ఉంది అతనికి.

ఒకనాటిరాత్రి తొమ్మిదిగంటలప్పుడు శాస్త్రి గదిలో చదువుకుంటూ ఉండగా నారాయణమూర్తిగా రెందుకో రమ్మన్నారని నౌఖరు వచ్చి చెప్పాడు. కేవలం విద్యార్థి అయిన తనతో ఆయనకు పనియేమిటూ అని ఆలోచించుకుంటూ అతడు వకీలుగారి యింటికెళ్లాడు.

అప్పటికి నారాయణమూర్తి కచేరీ సావిట్లో పేపరుచూస్తూ కూచున్నాడు. తనకు నమస్కారంచేసి నిలబడిన శాస్త్రినిచూసి ప్రసన్నవదనంతో "ఏమోయ్! వచ్చావా? దా, మేడమీద కెళదాం. కొంచెం మాట్లాడాలి." అంటూ పైకి తీసుకుపోయాడు.

మేడమీద హాలులో ఇద్దరూ కుర్చీలలో ఆసీనులైనారు. నారాయణమూర్తిభార్య రాజేశ్వరమ్మకూడా వచ్చికూర్చుంది. అప్పు డాయన శాస్త్రివేపుచూసి యిల్లా చెప్పాడు." "అబ్బాయీ! నువ్వు ఈ కాలపు కుర్రవాడవైనా పెద్దతరహాబుద్ధి కలవాడ వని నాకు తెలుసును. మీతాతగారంటే నాకు గురుసమానులు. మీ నాన్నా, నేనూ చాలాకాలం కలసి చదువుకున్నాం చిన్నప్పుడు. నాయందు నీకు గల గౌరవభావాన్ని ఇదివరకనేకసార్లు నేను చూసేవున్నాను. మీకుటుంబంయందు నాకున్న అభిమానంచేతనూ, నువ్వు నా మాట వింటావనే నమ్మకంచేతనూ ఒకవిషయం నీతో చెబదామని నిన్ను పిలిపించాను. చెప్పమంటావా?"

వ్యవహారజ్ఞానంలో పండిపోయినశిరస్సూ, తీక్ష్ణములై కాంతివంతములైన కళ్లూ, వాటిపైని దీపపు కాంతిలో తళతళ మెరిసే బంగారపు కళ్లజోడూ, సుకుమారమై, గంభీరమై దబ్బపండుచాయశరీరమూ గలిగి నారాయణమూర్తిది యెదుటివారలగౌరవాన్ని ఆకర్షించే స్వరూపము. శాస్త్రి నమ్రశిరస్కుడై "సెలవియ్యండి. మీమాటకు అడ్డుచెప్పడానికి నేనెంతవాణ్ణి" అన్నాడు.

"ఆ నమ్మకంమీదనే కదూ కబురంపాను మరీ. అయితే సంగతి విను. మీ అత్తగారు మహాలక్ష్మమ్మ మొన్న నాదగ్గిర కొచ్చి విషయమంతా చెప్పింది. ఇల్లా మనలో మనం కలహించుకోవడం నాకు నచ్చలేదు. ఇందులోమీ నాన్న కేవలందౌర్జన్యంగాప్రవర్తిస్తున్నాడు గాని మరొకటికాదు. కొంచెం చదువుకున్న వాళ్లమైనందుకు మనం ఇలాంటి దౌర్జన్యాలని ధైర్యం వహించి అరికట్టాలి. లేకపోతే మన Education (విద్య) ఉత్త Waste (వ్యర్థము) అన్నమాట. అందులోనూ పాపం మొగదిక్కులేని స్త్రీని బాధపెట్టడం సోమయాజికి బాగులేదు.

"ఇప్పుడు నేను చెయ్యదలుచుకొన్న దేమిటంటే రేపువచ్చే బుధవారంనాడు మీనాన్నని ఇక్క-

డికి రమ్మని కబురుచేస్తాను. మీ అత్తగారుకూడా వస్తుంది. ఆవేళ సోమయాజికి నచ్చజెప్పి మీ రెండు కుటుంబాలనీ కలిపెయ్యాలని నాకోరిక. ఏం?ఇందుకు నీ కిష్టమేనా?" "చిత్తం. కాని మా నాన్న వినడేమో అని సందేహం."

"వినకపోతే దానికి తగిన మార్గం ఆలోచించే ఉంచాను. నేను చెప్పినట్లూ వింటానని నువ్వు వాగ్దానం చేస్తే చాలు నాకు. మిగిలిన విషయం నేను చూసుకుంటాను. నీ అభిప్రాయం చెప్పు."

అంత పెద్దమనిషి, ఊరంతకీ గౌరవనీయుడు చెబుతున్నప్పుడు కాదనడానికి మనసు ఒప్పలేదు శాస్త్రికి. "కానియ్యండి. మీ సెలవుప్రకారమే నడుచుకుంటాను. మానాన్నకి కోపంవస్తుందేమో అనే నా భయం" అన్నాడు.

"ఆ, పరవాలేదు. తరవాత అన్నీ అవే సర్దుకుంటాయి. నీకేబాధా రాకుండా చూసేపూచీ నాది." అని భార్యతో "చూశావా, నేను చెప్పావుకానూ, కుర్రాడు బహు యోగ్యుడు." అని మందహాసముచేశాడు."ఏమోయ్ శాస్త్రీ!ఆవేళ నువ్వు హాస్టలులో భోజనం చెయ్యకు. I request you to dine with me (ఆనాడు నువ్వు మాయింట్లో భోజనం చెయ్యాలని కోరిక) మనందరం కలిసి తిందాం." అన్నాడు.

శాస్త్రి సెలవుపుచ్చుకు నేసరికి పదిగంటలయింది.

* * * * *

బుధవారంనాడు తెల్లవారేసరికి మామిడితోరణాలతో,పసుపుకుంకుమలు పెట్టిన గుమ్మాలతో వకీలు నారాయణమూర్తియిల్లు లక్ష్మీకళ లొలుకుతూంది. దాసదాసీజనమంతా అడావిడిగా తిరుగుతూంది. వంటలక్క మామూలుకంటే పెందరాళేవచ్చి వంటశాలలో ప్రవేశించింది. బంట్రోతు అడిగినవాళ్ళందరితోనూ "అయ్యగారి పెద్దఅమ్మాయిగారి పుట్టినరోజు ఈ వేళ" అని చెబుతున్నాడు.

ఎనిమిదిగంటలకు నారాయణమూర్తిగారి నౌఖరు హాస్టలుకివచ్చి 'పంతులుగారు రమ్మన్నార' ని శాస్త్రికి జ్ఞాపకంచేశాడు. పెద్దవారింటికి కాస్త యిదిగానే వెళ్లాలని అతడు బాగా శృంగారించుకొని మరీ సైకిలుమీద వెళ్లాడు. గుమ్మంలో అతన్ని చూడగానే బంట్రోతు "అయ్యగారు మేడమీదికి దయచెయ్యమన్నారు." అని చెప్పాడు

మేడమీద హాలులో పేముకుర్చీలమీద నారాయణమూర్తీ, సోమయాజీ కూర్చునిమాట్లాడుతున్నారు. ఎదురుగా ఉన్న గది గుమ్మం లో మహాలక్ష్మమ్మ కూర్చుంది. ఆవిడవెనకని రాజేశ్వరమ్మా ఇంకా ఒకరిద్దరు స్త్రీలూ ఉన్నారు. తండ్రిని చూడగానే శాస్త్రి కొంచెం సందేహించాడు అక్కడికి వెళ్లడానికి. కాని నారాయణమూర్తి Come on, Please be seated (డా. కూర్చో) అని ఆహ్వానించి కూర్చోపెట్టాడు.

అప్పటికప్పుడే నారాయణమూర్తి సోమయాజితో వ్యవహారంఅంతా మాట్లాడేశాడు. తన సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించినప్పటికీ చిన్ననాటి స్నేహితుని మనస్సు తిప్పలేకపోయాడు వకీలుగారు. మహాలక్ష్మమ్మకూడా బతిమాలుకుంది. సోమయాజులు పట్టు విడవలేదు. పైగా అతనికి నారాయణమూర్తిమీద కోపంవచ్చిందికూడాను.

"నన్నింతా పిలిపించి ఇదటోయ్ నువ్వు చెప్పే న్యాయం? ఇంకా యెందుకో అనుకున్నాను నేను. నామాట జరక్కపోయినప్పుడు ఆలోచించుకుందాం లే" అంటూ కుర్చీమీదనించి లేచాడతను.

నారాయణమూర్తి ముఖముపై నున్న శాంతభావమేమీ చలించలేదు. సోమయాజికోపాన్నీ, పల్లెటూరు కేకలనీ చూసి నవ్వుతూ "పోనీ,నామాట వినకపోతే మానిపోయిందికాని యీ పూట ఇక్కడ ఉండిపోవయ్యా. మనం కలిసిభోంచేసి చాలకాలమైపోయింది." అని మరీమరీ చెప్పాడు.

"బావా! నన్నెందుకు బలవంతపెడతావు? ఇంటిదగ్గిర బోలెడంతవ్యవహారంమానుకునినీమాటతో సెయ్యలేక వచ్చేశాను- తిరుగుబస్సుమీద వెళ్ళిపోకతప్పదు. భోజనానికి మరిరానాయేమిటి?" అనుకుంటూ మేడదిగి పోయాడు.

నారాయణమూర్తీ, శాస్త్రీ అతన్ని వీథిగుమ్మందాకా దిగబెట్టారు. కుమారుడితో కుశలప్రశ్నలు మాత్రం జరిగించి, కొంత సొమ్ము అతనిచేతి కిచ్చి సోమయాజితో తొందర తొందరగా బస్సుస్టాండువేపుకి వెళ్లిపోయాడు. అతడు వెళ్ళగానే నారాయణమూర్తీ, శాస్త్రీ తిరిగి మేడ యెక్కారు.

అప్పుడు నారాయణమూర్తి "చూశావా? మా నాన్నకి చిన్నప్పటినించీ యిదే గుణం. పట్టావిడుపూ ఉండాలి వ్యవహారానికి. పోనీలే. ఇంక మనకి నిష్ఠూరం ఉండకుండా చేశానుకాని అతని పద్ధతి యింతేఅని నాకు ముందే తెలుసునులే. స్నానంచెయ్యి. భోంచేద్దాం" అని చెప్పాడు.



"నాస్నానం ఉదయాన్నే అయిపోయింది."

"అదిగాదు. ఈ వేళ మా పెద్దమ్మాయి జన్మదినం. ఇంటికివచ్చినచుట్టాలందరూ అభ్యంగనం చెయ్యాలి. అడ్డుచెప్పకూడదు. కాని ఇప్పుడే చెబుతున్నాను సుమా. ఏకంగా రాత్రికూడా యిక్కడే భోంచేసి వెళ్ళాలి నువ్వు We shall spend a holiday (మనం హాయిగా విశ్రాంతిగా గడుపుదాం)."

రాజేశ్వరమ్మ ఆజ్ఞాప్రకారం నౌకరు శాస్త్రీని స్నానశాలలోకి తీసుకుపోయాడు. కారాకిల్లీ నవులుతూ ఒడ్డిమంగలాడు తలంటేశాడు. స్నానంచేస్తున్నపుడు సుందరమ్మలాంటి ఒక అమ్మాయి లోపలద్వారంలోనించి కనబడ్డాది అతనికి. అత్తగారు ఆమెనుకూడా తీసుకొచ్చిందేమో అనుకున్నాడు. మళ్లీ "వకీలుగారి పెద్దమ్మాయి కాబోలు ఆవిడ. సుందరి యిక్కడికి వొస్తే అత్తగారు నాతో చెప్పకుండాఉంటుందా ?" అని సమాధానపడిపోయాడు తనలోతనే.

"శాస్త్రీకినోట మాట

మధ్యాహ్నం నాలుగుగంటలకి ఫలహారాలవనిచ్చి శాస్త్రిని కారులో కూర్చోపెట్టుకుని నారాయణమూర్తి ఊరుకి నాలుగుమైళ్ళదూరంలో ఉన్నతోటకి షికారు తీసుకుపోయాడు.



లేదు. పోతేవిగ్రహము."

రాత్రి భోజనాలైనతరవాత మేడయెక్కేసరికి హాలూ, దానిపక్కనున్న గదీ వింత వింత అలంకారాలతో, విద్యుద్దీపాలకాంతిలో మెరిసిపోతూ వాళ్ళకి క్రొత్తగా కనిపించాయి. శాస్త్రి ఆ గదిని అదివరకుచూసి ఉండలేదు. నారాయణమూర్తి స్వయంగా గదిలోకి వెళ్లి అలంకారాలను పరీక్షిస్తున్నాడు.

విశాలమైన నాలుగుకిటికీలతో ఆరోగ్యశాస్త్రవిధుల ననుసరించి కట్టిన గది అది. ఒకద్వారము హాలులోకీ, ఇంకొకటి డాబామీదకీ తెరుచుకుని ఉన్నాయి. గదిలో నాలుగుగోడలకీ నిలువుటద్దాలు. అనేకరకాల చిత్రాలు కళాకౌశలంతో అక్కడక్కడ తగిలించబడి ఉన్నాయి. కిటికీసమీపంగా పెద్దపందిరిమంచము, ఎత్తైన పరుపులతో ఒకవేపున ఉన్నాది. చెయ్యివేస్తే మురికిఅయిపోతుందేమో అనిపించేటంత తెల్లని దుప్పటి పరిచిఉంది. తలవేపున రెండుపూలదండలు. ఎదురుగా మేజామీద తాంబూలపుసామాను. అగరువత్తులు, అత్తర్లపెట్టె. గదికి మధ్యగా మిక్కిలి ప్రకాశమానమైన విద్యుద్దీపము పైకప్పునించి వేలాడుతూంది. గది అంతటా గమ్ముమని సెంట్లసువాసన తల దిమ్మెత్తిపోయే లాగున ఉంది.

"నారాయణమూర్తిగారు అదృష్టవంతుడు. గొప్ప అనుభవశాలి" అని నిట్టూర్పు పుచ్చి కుర్చీలోకూలబడ్డాడు శాస్త్రి ఈ వైభవమంతా చూసి. అంతలో మేడమీదకి వచ్చిన రాజేశ్వరమ్మని చూసి సాభిప్రాయంగా "ఎలాగైనా కలెక్టరుగారి కూతురువి. నీయేర్పాట్లు బాగుండక పోవడమేమిటి ?" అని నారాయణమూర్తి హాస్యోక్తులాడాడు. ఆవిడ మాత్రం మందహాసంచేసి బల్లమీద ఉన్న వాసననూనె సీసాను తీసుకొని మేడదిగిపోయింది.

కొంతసేపు సంభాషణ కానిచ్చి "సెలవిప్పిచ్చండి" అన్నాడు శాస్త్రి లేచి. నారా

యణమూర్తి "వెళ్లొచ్చులే. మరి యిప్పుడు వెళ్లిమాత్రం చేసే దేముంది, పడుకోవడమేకదా? ఒకసారి పద్యాలు వినాలని ఉంది. కాస్త వినిపిస్తావేమో అని. నువ్వు రాసిన ఇక్కడే పడుకుని పొద్దుటే వెళ్లు" అన్నాడు.

కోరేవాడుంటే చాలు కవులకి విసుకుపుట్టదు పద్యాలు వినిపించడానికి. అందులో అంత పెద్దవాడు కోరినపుడు ఇంక సందేహమేముంది? శాస్త్రి రాగజ్ఞానంతో మనోహరంగా తన పద్యాలనూ, ఇతరులు రాసినవాటినీకూడా చదివాడు గంటసేపు.

పదిగంటలు దాటలిచ్చి నారాయణమూర్తి "శాస్త్రి! అదుగో ఆగదిలో పడుకో. ఇప్పుడు హోస్టలు కెందుకు ఈ అర్ధరాత్రివేళ" అని అంతకు కొంచెంసేపుకిందటే శాస్త్రిలో అసూయను (Jealousy) పుట్టించిన ఆపడకగదినే చూపించాడు.

శాస్త్రి కొంచెం సందేహించాడు. "సందేహిస్తావేం? వెళ్లవోయ్. పరవాలేదు." అంటూ ప్రేమ వాత్సల్యము లుట్టిపడే కంఠస్వరంలో చెప్పి అతనిచేయి పట్టుకుని ఆగదిలోకి తీసుకుపోయాడు. అందులో గోడలపైనున్న చిత్రాలు కొన్ని వారిదృష్టిని ఆకర్షించాయి. అప్పుడు వాటిలో కొన్నిటి ప్రాశస్త్యాన్ని వర్ణిస్తూ, వాటిని రాసిన చిత్రకారులనూ, ఆచిత్రాలు పొందిన బహుమతులనూ, అవి ప్రదర్శింపబడిన స్థలాలనూ నారాయణమూర్తి శాస్త్రికి వివరించి చెబుతున్నాడు.

ఇంటివెనక ఉన్న పూలతోటపైనుండి చల్లగాలి ధారాళంగా వీస్తూంది. పైని మనోహరమైన చంద్రకాంతి జగత్తుపైని పాలవర్షము కురిపిస్తూంది. ఆకాశము స్వచ్ఛనీలమై, నిర్మలమై, ఉజ్జ్వలమై ఉంది.

ఒక్కక్షణముందుగా "ఈ గదిలోనిద్రించే నారాయణమూర్తిగారిదే అదృష్టము" అని నిట్టూర్పువిడిచిన కవికుమారుడికి ఇదంతా చూసి తానందులోనే పడుకోవడమని తెలిసినతరవాత ఆ గదిలోనే తాను తెల్లవార్లూ వేగించడమెల్లాగ అన్న బెంగకూడాపట్టుకుంది.

ఇంతలో గది ప్రధానద్వారముదగ్గిర కొంచెంసందడి వినబడింది. శాస్త్రి వెనక్కి తిరిగిచూశాడు అదియేమిటో అని.

అప్పటి అతని ఆశ్చర్యాన్ని వర్ణించడానికి తగిన వాగ్జాలము లేదు. లజ్జావనతవదనయై, అలంకృతయైన సుందరమ్మని చెయ్యిపట్టుకుని నడిపిస్తూ రాజేశ్వరమ్మ ప్రవేశించింది గదిలోకి ముందుగా. తరవాత నలుగురైదుగురు యువతులు శాస్త్రి ఎన్నడూ ఎరగనివారున్నారు. అందరికీ వెనక మహాలక్ష్మమ్మ హర్షాశ్రువులతో నిల్చున్నాది. రాజేశ్వరమ్మ భర్తతో "ఇంకా మీ సంభాషణ తేలలేదుకాబోలు?" అంది ఏమీయెరగనివాడిలాగ నారాయణమూర్తి నవ్వుతూ శాస్త్రితో "ఇదేమిటోయ్, ఆడవాళ్ల అధికారానికి అంతంలేనట్టుంది. ఇక్కడకూడా మనలని మాట్లాడుకోనియ్యరుకాబోలు" అన్నాడు.

శాస్త్రికి నోట మాటలేదు. పోతవిగ్రహము.

గదిఅవతలకి పోయే భర్తని చూసి రాజేశ్వరమ్మ "వెళ్లకండి కొంచెం ఆగండి" అని అధికారంతో అన్నది.

"అబ్బో! కలెక్టరుగారి అమ్మాయి మమ్మలిని ఖైదుచేస్తుందికాబోలు యీ గదిలో."

"హేమాహేమీలు శ్రీకృష్ణజన్మస్థానానికి వెళుతూ ఉంటే మీకు తప్పొచ్చిందాయేమిటి? మీకు పదినిముషాలూ, మీతోఉన్న అబ్బాయికి తెల్లవార్లూనూ ఈ గదిలో ఖైనుతప్పదు" అంది రాజేశ్వరమ్మ నవ్వుతూ.

"జైలుశిక్ష వేస్తే వేశావుకాని, ఏకాంతవాస శిక్షమాత్రం వెయ్యకు శాస్త్రికి నీపుణ్యముంటుంది."

"ఇంకొక అరగంటసేపు అతని నడవడికను చూస్తాము. ప్రవర్తన సరిగా ఉంటే ఈ అమ్మాయిని (సుందరాన్నిచూపిస్తూ) కూడా సహాయంపంపిస్తాంలెండి. మీ కెందు కంతవిచారం?"

రాజేశ్వరమ్మ సుందరాన్ని శాస్త్రికిసమీపంగా నిల్చుంపబెట్టింది. ఉదారహృదయులైన నారాయణ మూర్తిదంపతులు లజ్జావనతశిరస్కులైయున్న శాస్త్రి సుందరమ్మలపైని పవిత్రాక్షతలను జల్లి ఆశీర్వదించారు.

*   *   *   *   *

సోమయాజి నారాయణమూర్తితో జన్మవిరోధ మేర్పరిచేసుకున్నాడు. కుమారుడు సెలవులకింటికివచ్చి నపుడు అతనిముఖం చూడ్డానికి నిరాకరించేశాడు.

"సంఘంలో దురన్యాయాలు జరిగినప్పుడు చూస్తూఊరుకోవడం మనకి అలవాటైపోయింది. అందుచేతనే సంఘంలో కుళ్లు బలిసిపోయింది. మధ్యవర్తులైన వాళ్లు ధైర్యంగా న్యాయంవేపు నిలబడి పోరాడితేగాని దేశం బాగుపడదు. ఈవిషయంలో నేను కేవలం నావిధిని నిర్వర్తించాను అనే నానమ్మకం. ఇందులో ఎవరిమనస్సుకి కోపంకలిగినా నాకు లక్ష్యంలేదు." అంటూ నారాయణమూర్తి తనప్రవర్తనకు సమాధానం చెప్పేవాడు.

---

# అన్వేషణము

కోమఱ్ఱాజు వినాయకరావు
(నవ్యసాహిత్య పరిషత్తు)

రాధికా! రాధికా!
మాధవుడనే నేను!
కోపమేటికె? నిన్నె
కోరి వెదకెదనే.

మధుర బృందావనీ
మధుమాస సంఫుల్ల
మందార మృదు పథా
లందు జూచితినే!

ముత్యాల మల్లె పూ
మొగ్గ లరకనువిచ్చి
మురియు మంటపవితతి
మున్గి తేలితినే!

పక పక నగు కల్వ
పడతుల కొలకుల
కెలకుల నీపాద
ములె కంటబడెనే!

నీ యంఘ్రిముద్రలో
నే యడుగునిడికొంచు,
వేణువనమున దూరి
వేసారినానే!

నా కొరకునై యెంత
నవసి కృశియించితో?
నయనాల ధును లెన్ని
నాట్య మాడెనో కో?

ఎంతగా తపియించి
వంత యెదపూరించి,
వెఱ్ఱివై ప్రేమకై
వెదకులాడితివో?

అపరాధినే చెలీ!
యగు తప్పునాదె; నే
వచ్చెదనని రాక
వంచించినానే!

రాధికా! రాధికా!
మాధవుడనే నేను !



# ఆంధ్రాభ్యుదయము

డా. యం. వి. రాధాకృష్ణరావు, యం. బి. పి. హెచ్ డి.




‘ సర్కారులలో కాలేయ (Liver) వ్యాధులు ’ అను విషయమునుగూర్చి వీరు పరిశోధనలుచేసి నిర్ణయించిన సిద్ధాంతమునకు మెచ్చి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వీరికి పి. హెచ్ డి. (డాక్టరు) పట్టము నొసగిరి.

---

# ఇటలీదౌర్జన్యం: బ్రిటన్ ఫ్రాన్సుల వైఖరి

### నార్ల వెంకటేశ్వరరావు

[ "International politics is a morass of treachery, theft, broken promises, lies, evasions, bluff, trickiness, bullying, deliberate misunderstanding and shabby attempt to get an opponent into a false position" —A. A. Milne.]

[ "ద్రోహం, దొంగతనం, మాటతప్పడం, అబద్ధాలు, ముఖంతప్పించడం, బుకాయింపు, మోసం, అల్లరిపెట్టడం, కావాలని అపార్థంచేసుకోవడం, ప్రతికక్షిమీద నెపంవెయ్యడానికి తప్పుడుప్రయత్నం— ఇవి అన్నీ కలిసిన మురికిగుంటే అంతర్జాతీయ రాజకీయాలంటే!" —ఎ. ఎ. మిల్ని.]

బ్రిటన్-ఫ్రాన్సులు సంధికోసం, సమాధానం కోసం ఇంకా దేవులాడుతూనేవుండగా నానాజాతి సమితిసభలతో, సమావేశాలతో ఇంకా పెనుగులాడుతూనే వుండగా అక్టోబరు 3-వ తేదీని ముసోలినీ అబిసీనియామీదకు హఠాత్తుగా యుద్ధానికి దిగాడు.

ఆధునికయుద్ధపద్ధతులలో మహాఘోరమైనవని, అతిరాక్షసమైనవని ఎంచబడేవి ముఖ్యంగా రెండు: విమానాలమీదనుంచి బాంబులను విసరడం, విషవాయు ప్రయోగం చెయ్యడం. సంకోచం అణుమాత్రమైనా లేకుండా ముసోలినీ ఈరెండు పద్ధతులను ప్రస్తుత యుద్ధంలో విరివిగా వుపయోగిస్తున్నాడు!

అడోవా, ఆడిగ్రాట్ పట్టణాలమీద—నిరాయుధులయిన ప్రజలమీద - ఆబాలగోపాలంమీద - ముఖ్యంగా వైద్యాలయాలమీద-బాంబులను విసరడంతో అతడు యుద్ధాన్ని ప్రారంభించాడు. విషవాయు ప్రయోగాన్ని చేస్తూ, డండంతోటాలను వుపయోగిస్తూ పట్టువడిన పట్టణాలలోని ప్రజలను చిత్రవధచేస్తూ దాన్ని సాగిస్తున్నాడు!

ఇప్పటికతడు అబిసీనియాలో 1/8 వంతును ఆక్రమించుకోగలిగాడు! తక్కినఅంతటినీ ఆక్రమించుకోవాలని ఆతురపడుతున్నాడు! ఆక్రమణంలో ఆలస్యం అవుతున్నందుకు ఆగ్రహపడుతున్నాడు! జనరల్ (ఇప్పుడు మార్షల్) డి. బోనోను సర్వసైన్యాధిపత్యం నుంచి తప్పించి, అతనిస్థానంలో మరొకనిని నియమించడానికి అతని ఈ ఆగ్రహమే కారణం!

ఇటాలియన్ సామ్రాజ్యానికి చేరువలోవుండడం, సస్యశ్యామలంగా వొప్పారడం, సహజసంపత్తితో తులతూగడం, వీటినన్నిటినీమించి, ఇదివరకే ఏపాశ్చాత్య రాజ్యానికో తలవొగ్గివుండకపోవడం - ఇవే అబిసీనియా చేసిన పాపాలు, ఈపాపాలకే తాను శిక్షను విధిస్తానంటున్నాడు ముసోలినీ!

ముసోలినీ తలపెట్టిన ఈపని పట్టపగటి దోపిడీ! ఇందుకుగాను అతడు అవలంబిస్తున్న సాధనం భీషణ హత్యాకాండ!!

తన వుద్దేశాన్ని అతడు రహస్యంగా వుంచలేదు. పైపెచ్చు, ఏనాడో బాహాటంగా ప్రపంచానికి చాటాడు! వూరికే అయితే తన ప్రకటన అందరి చెవిని పడుతుందో, లేదో అని శతఘ్నులమీది కెక్కి వాటి ప్రళయగర్జనలమధ్య తన నిశ్చయాన్ని వెల్లడించాడు!

ఇంత ముందుగా, ఇంత ఖండితంగా ముసోలినీ నిశ్చయం తెలుసుగదా! అతని నిశ్చయం న్యాయానికి, ధర్మానికి, సభ్యతకు, మానవత్వానికి విరుద్ధంగా వెడుతున్నదనికూడా తెలుసుగదా! ఇదిఅంతా తెలిసి వుండికూడా అతన్ని ప్రతిఘటించడానికీ, అబిసీనియాను కాపాడడానికీ జరిగినప్రయత్నం ఏమిటి?

ఇటలీకి నానాజాతిసమితిలో సభ్యత్వంవుంది; అబిసీనియాకుకూడా వుంది. నానాజాతిసమితి నియమావళిప్రకారం ఇటలీ అసలు అబిసీనియాతో పేచీకి దిగడం తప్పు. దాన్ని ఆక్రమించడం అంతకన్న తప్పు!

ఇన్ని తప్పులను చేసిన - కాదు, చేస్తున్న - ఇటలీపై సమితి ఏమి చర్య జరుపుతున్నది?

నానాజాతిసమితిలో సభ్యత్వం కలిగివున్న దేశాలలో ఇటలీని మినహాయిస్తే ఎన్నదగినవి రెండే: బ్రిటన్, ఫ్రాన్సు. ఈ రెండుదేశాలవైఖరి ఎలావుంది?

ఈప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే, పాతగాథను కొంత తవ్వాలి, ప్రస్తుతవిషయాలను కొన్నింటిని వుదాహరించాలి, భవితవ్యాన్నిగురించి కొంత జోస్యం చెప్పాలి!

బ్రిటను, ఫ్రాన్సు దేశాలు చూచీచూడనట్టు వూరుకుంటాయని నమ్మకంకుదిరివుండకపోతే ముసోలినీ అబిసీనియామీద దూకడానికి ఇలా తొందరపడేవాడుకాడు. పూర్వం టర్కీదగ్గరినుంచి ట్రిపోలిటానియా, సైరినైకాలను-అంటే, ఇప్పటి లిబియాను - సంగ్రహించాలని దుర్బుద్ధిపుట్టినప్పుడు ఇటలీ ముందుగానే బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ మొదలైన దేశాల అభిమతాన్ని అడిగింది. ఇవిఅన్నీకూడా సరే అని కన్నుకొట్టినతర్వాతనే గాని ఇటలీ టర్కీమీదకు కాలు దువ్వలేదు.

ఆనాడు ౧౯౧౧లో ఏమి లాంఛనంజరిగిందో, ఈనాడు ౧౯౩౫ లో కూడా అదే జరిగింది. అబిసీనియా సరిహద్దులలో బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యాలు వున్నాయి. అందుచేత అబిసీనియా వుండటాన్నీ, వూడటాన్నీ గురించి ఎక్కువ శ్రద్ధ వహించేవి బ్రిటన్ ఫ్రాన్సు రాజ్యాలు. అబిసీనియాకు సంబంధించి బ్రిటన్-ఫ్రాన్సు-ఇటలీలు౧౯౦౬లో ఒకవొడంబడికను, బ్రిటన్-ఇటలీలు ౧౯౨౫ లో వేరుగా మరొక వొడంబడికను చేసుకున్నాయికూడా! ఈరెండు కారణాలనుబట్టి ముసోలినీ బ్రిటన్, ఫ్రాన్సులను కదిలించి చూచాడు.

వర్సైయిల్సుసంధిషరతులను ధిక్కరించి, జర్మనీ ఆయుధధారణచేయడంచూచి, దానిమీద తగినచర్య జరపడాన్నిగురించి యోచించే నిమిత్తం బ్రిటన్-ఫ్రాన్సు-ఇటలీ రాజ్యాల ప్రతినిధులు స్ట్రెసాలో సమావేశమయ్యారు. ఆ సమావేశానికి బ్రిటన్ తరఫున రీడింగ్, ఫ్రాన్సుతరఫున లావల్, ఇటలీతరఫున ముసోలినీ హాజరయ్యారు. వీరు ముగ్గురు జర్మనీని తీవ్రంగాఖండించడమే కాకుండా, తిరిగీ యిటువంటిదూకుడుపనిని చేస్తే, ఆర్థికంగా సాన్క్షన్సు అమలుజరుపుతామని బెదురు పెట్టారుకూడా! సాంక్షన్సుస్వరూపం మొదలయిన వివరాలను నిర్ణయించడానికి అప్పుడే ఒకఉపసంఘాన్ని కూడా నియమించారు. (అయితే ఈ ఉపసంఘం సమావేశమైనా కాలేదు.) స్ట్రెసాలో ఈసమావేశం జరిగేనాటికే అబిసీనియామీదకు దూకాలని ముసోలినీ సన్నాహంచేస్తున్నసంగతి బ్రిటన్, ఫ్రాన్సులకు పూర్తిగా తెలుసు! పైగా ఈ సంగతిని ముసోలినీ సూచాయగా అందించాడుకూడా! అప్పుడు బ్రిటన్, ఫ్రాన్సు ప్రతినిధు లిద్దరుకూడా వినీవిననట్టు నటించారు. దాన్ని చూచి వారిద్దరుకూడా అబిసీనియాఆక్రమణానికి అంగీకరిస్తారనీ, కనీసం, అడ్డురారనీ ముసోలినీ వూహించడం తప్పా?

స్ట్రెసాలో బ్రిటిష్ ఫ్రెంచి ప్రతినిధులు వహించిన అర్ధాంగీకారసూచకమైన మౌనమేకాకుండా, ముసోలినీసంకల్పం మరింతబలపడ్డానికి వేరేకారణాలు కూడా కలిసివచ్చాయి.

బ్రిటన్ స్ట్రెసాసమావేశంలో పాల్గొన్నప్పటికీ, జర్మనీవిజృంభణాన్ని ప్రతిఘటించడానికి ఏమంత పట్టుదల చూపించడంలేదని ఫ్రాన్సుకు అనుమానం తోచింది. అందుచేత-ఎందుకైనా మంచిదని-రుష్యాతో రాయబారాలను నడిపి, అవసరంకలిగితే సర్వవిధాలా పరస్పరసహాయంచేసుకునే షరతుతో ఒక వొడంబడికకు వచ్చింది. ఫ్రాన్సు - రుష్యాలు ఇలా వొడంబడికకు రావడంచూచి, ఇందుకు పైయెత్తుగా, బ్రిటన్ జర్మనీతో నౌకాసంధిని చేసుకుంది.

౧౮౭౦ లో జర్మనీ చేతిలో గట్టిదెబ్బను తిన్నప్పటినుంచీ ఆదేశాన్నిచూస్తే ఫ్రాన్సుకు చాలాభయం! ౧౯౧౪ లోనైనా బ్రిటన్ అడ్డు పడివుండకపోతే జర్మనీ ఫ్రాన్సు కుత్తుకను నులిమివేసేదే! హిట్లర్ విజృంభణంతర్వాత జర్మనీఅంటే ఫ్రాన్సుకున్న ఈభయం



సుందరమూర్తి నాయనారుచరిత్రలోని యోకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపూర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

హరార్ నుండి యుద్ధమునకు బయలుదేరుచున్న రాస్‌నసీబు సైనికులు

రాస్ గగ్సాగారి మకాలినగర ప్రవేశము. వెంట ఇటలీసైనికులు

ఇటలీ స్వాధీనమయినమారెబునదీతీరమందలి గ్రామములోని స్త్రీలతో ఇటలీసైనికుడు సంభాషించుట




అడోవాలో పట్టువడిన అబిసీనియా ఖైదీలు ఇటలీసైనికుల స్వాధీనమున యుద్ధరంగమునకు వెళ్లుచుండుట

# ముఖవర్చసుకు కాంతినిచ్చును

పటన్‌వాలా ఆఫ్‌గన్‌స్నోను తయారు చేసిరి. దీనియందు కేవలము వనస్పతులు నానా విధకుసుమముల సారములు చేరియున్నవి. దీనిని ప్రతిరోజు వాడుచున్నయెడల శరీరము మృదువుగానుండి మొఖములువలె అతి మనోహరముగా నుండును దేహము మీాదిమచ్చలు, మొటిమలు, కురుపులు వగైరాలు మానును. బుగ్గలు గులాబిరంగుపొందును.



## ఆఫ్‌గన్ స్నో

ప్రతిచోట దొరకును.

## యి. యస్. పటన్‌వాలా,

182, 84 అబ్దుల్ రహమాన్ వీధి,

బొంబయి 3




---

# చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ(గనేరియా)వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము




కృత్రిమములు చూచి మోసపోకుడు. "కోడి" మార్కు గమనింపుడు.

## గోనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము ఇంగ్లీషుమందులను దేశీయఔషధములను పుచ్చుకొనినను గుణముకలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభములేకపోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గోనోకిల్లరునుగూడ పుచ్చుకొని చూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగ సంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులకైనను స్త్రీలకైనను పురుషులకైనను గోనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడు కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళమునందలివాపుతీసిపోవును. శగవ్యాధి(గోనోకోకసు)వలన మూత్రముబొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, మూత్రద్వారముయొక్క వాపు, మూత్రద్వారముయొక్క చుట్టువుండు పొకయొక్క వాపు, మూత్రాశయముయొక్క వాపు లేక మూత్రతిత్తియొక్క వాపు, నరములజబ్బు, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గోనోకిల్లరువలన కుదురును. వీర్యము(సెమను)పోవుట, మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. ఖరీదు 50 మాత్రలుగల సీసా రు. 3-0-0. కృత్రిమములు చూచి భ్రమజెందవలదు. మా పుంజుమార్కు గమనింపుడు. వీ. పీ. ఛార్జీ ప్రత్యేకము అడ్రసు:—డాక్టరు డి. యన్. జస్సాని, గిర్‌గాను వెనుకరోడ్డు, బొంబాయి 4.

Dr D. N. JASANI, Girgaon Back Road, Bombay, 4
Madras Agents:—DADHA & Co., 52, Nainiappa Naick St, P. T. Madras

రెట్టింపు అయింది. ఇలాంటి సందర్భంలో బ్రిటన్, జర్మనీలు ఏకమైతే . . .

బ్రిటన్, జర్మనీలమధ్య జరిగిన సంధిప్రకారం బ్రిటిష్‌నౌకాదళంలో జర్మనీనౌకాదళం నూటికి 35 వంతులు వుండవచ్చును. ఇంతేకాదు. అవసరమనితోస్తే జర్మనీకోరినన్ని జలాంతర్గాములను నిర్మించుకోవచ్చును! ఈ పద్ధతిలో జర్మనీ నౌకాదళం, ఫ్రెంచిదళంతో సరిసమానంగా వుంటుంది. ఫ్రాన్సుకు కాపాడుకోవలసిన సముద్రపుసరిహద్దులు రెండువున్నాయి. ఇక జర్మనీ కిఒకవైపునే సముద్రం వుంది. పైగా, వర్తకవ్యాపారాలకు వుపయోగపడే స్టీమర్లు ఫ్రాన్సుకంటె జర్మనీకి చాలా అధికంగా వున్నాయి. ఈ స్టీమర్లను కావాలంటే అతిసులభంగా యుద్ధనౌకలక్రింద మార్చుకోవచ్చును. అన్నివిధాలా ఈ నౌకాసంధివల్ల జర్మనీకి విపరీతమైన బలం చేకూరుతున్నది!

పోనీ, తన నౌకాబలం—వాషింగ్టన్ నౌకాసంధి ఏర్వరిచిన పరిమితినిమించి — హెచ్చుగా వుండాలని ఫ్రాన్సు అంటే, సరిహద్దులోవున్న ఇటలీమాత్రం వూరుకుంటుందా? ఫ్రాన్సుతోపాటు తనకూ ఆసౌకర్యం కావాలని కోరుతుంది. ఫ్రాన్సు - ఇటలీదేశాలు రెండూ తమతమ నౌకాదళాలను వృద్ధిచేస్తే, ఏ రెండు యూరపియన్ రాజ్యాలకూ తనకంటె హెచ్చుగా నౌకాబలం వుండగూడదనే తనసిద్ధాంతంమీద బ్రిటన్ మరికొన్ని యుద్ధనౌకలకు ఆర్డరిస్తుంది. అప్పుడు బ్రిటిష్‌నౌకాబలంలో తన నౌకాబలం నూటికి 35 వంతులు వుండవచ్చుననే షరతును పురస్కరించుకుని జర్మనీకూడా మరికొన్ని యుద్ధనౌకలకు ఎగబడుతుంది. దీనికి అంతూ దరీ యెక్కడ?

వెర్సెయిల్సుసంధిని తృణీకరించినందుకు గాను స్ట్రెసాలో జర్మనీని ఖండించి, ఆజర్మనీతోనే లండన్‌లో—వెర్సెయిల్సు సంధికి భిన్నంగావున్న — నౌకాసంధిని చేసుకోవడం, ఆసంధిషరతులను ఇంత అనుకూలంగా ఏర్పాటుచెయ్యడం చూస్తే, బ్రిటన్ అంటే ఫ్రాన్సుకు కడుపు మండుకుపోవడమే కాకుండా స్వీయరక్షణకోసం ఇంకా జాగ్రత్తలుపడక తప్పదని తోచింది.

ఫ్రాన్సుకు జర్మనీదే పోటు! దీనినుంచి తప్పించుకోవాలంటే, ఫ్రాన్సు - జర్మనీ సరిహద్దులో యెక్కువ సైనికఎళాలను కాపుంచాలి. అయితే ఫ్రెంచిసైనికదళాలలో సగం ఫ్రాన్సు - ఇటలీ సరిహద్దులో వున్నాయి. వీటిని తరలించుకు రావాలంటే ముందు ఇటలీతో స్నేహంచెయ్యాలి.

ఈ విధంగా సరిహద్దులో హెచ్చుగా కాపలా వుంచడమేకాకుండా, జర్మనీ ఇంకా శక్తివంతం కాకుండా ప్రయత్నం చెయ్యాలి. ఆస్ట్రియాను కబళించాలని జర్మనీ ఉవ్విళ్లూరుతున్నది. ముసోలినీ అడ్డుపడివుండకపోతే ఈపరికి అది ఆస్ట్రియాను స్వాహాచేసి వుండేదికూడా! ఇప్పుడు — అవసరమైతే—ముసోలినీని మరికొంత హెచ్చరించి ఆస్ట్రియావిషయంలో బందోబస్తు చెయ్యాలి.

ఎటుచూచినా ఫ్రాన్సుకు ఇటలీతో గట్టిగా స్నేహంచెయ్యడం లాభదాయకమని తోచింది. అంచేత పోయిన జనవరి నెలలో ఫ్రెంచిప్రధానమంత్రి లావల్ రోంనగరం ప్రయాణంకట్టాడు!

ముసోలినీమనస్సు అంతా అబిసీనియామీద వుంది. అంచేత లావల్ పెట్టిన షరతులకు అన్నింటికీ అతడు అంగీకరించాడు. చివరకు టునీషియావిషయంలో తా మిక పట్టుపట్టమని కూడా వొప్పుదల అయ్యాడు. వాటి కన్నిటికీ బదులుగా అతడుకోరినది ఏమిటంటే, - ఇటలీ అబిసీనియాను ఆక్రమించుకోడానికి ఫ్రాన్సు అంగీకరించడం!

లావల్‌కు ఇది "బలే! మంచి బేరము" వలె తోచింది. తక్కినవాటిమాట ఎలావున్నా టునీషియా విషయంలో ముసోలినీ ఇంతసులభంగా అంగీకారానికి రావడం ఆశ్చర్యమే! టునీషియా ఆఫ్రికా ఖండంలోని ఒకరాష్ట్రం. ఇది ఇటలీకి చాలాచేరువగావుంది. ఇక్కడకు అనేకమంది ఇటాలియనులు వలసపోయారు. ఇక్కడి జనులలో హెచ్చుమంది ఇటాలియనులే! అం

చేత న్యాయంగా టునీషియా తనస్వాధీనంలో వుండాలని ఇటలీ చిరకాలంనుంచి ఆందోళన చేస్తున్నది. అయినా, ఇప్పుడిక టునీషియామాట యెత్తమని వొప్పుదలకావడం......

ఇటలీ అబిసీనియాను ఆక్రమిస్తే తమకు అభ్యంతరం ఏమీ లేదని లావల్ సంతోషంగా అంగీకరించాడు; తమ మిత్రత్వానికి, సహృదయత్వానికి నిదర్శనంగా జిబుతే—ఆడిస్ అబాబా రైల్వేకంపెనీలోని 3 వేల షేర్లను ఇటలీపేర మార్పించడానికి ఏర్పాట్లు చేస్తానన్నాడు!

ఇటలీసామ్రాజ్య నిర్మాణప్రయత్నాలకు మొదటినుంచీ అడ్డువచ్చింది ఫ్రాన్సే! టునీషియాను ముందుగా ఆక్రమించుకుని, ఆతర్వాత ఎంతగల్లంతుచేసినా కదలనన్నది. ౧౮౯౬ లో అబిసీనియాకు ఫ్రాన్సు తోడ్పాటు లేకపోతే, ఇటలీ మెనిలిక్ చేతిలో (అడ్వోవా దగ్గర) అంతఘోరంగా వోడిపోయేదికాదు. పోనీ, వెస్టు ఆఫ్రికాలో కామిరూన్సును మాకు కలిపితే లిబియా మొదలు డవులావరకు సామ్రాజ్యం ఏర్పడుతుందని ఇటలీ అడిగినా, ఫ్రాన్సు మొండికెత్తింది. ౧౮౯౬ లో బ్రిటన్ - ఇటలీలు అబిసీనియాకు సంబంధించి ఏదో వొకప్రయివేటు వొడంబడికను చేసుకుంటే, తన పుట్టి అంతా మునిగినట్టు ఫ్రాన్సు చాలా గోలపెట్టింది కూడా!

ఎప్పటికప్పుడు ఇలాఅడ్డుపడుతూవచ్చిన ఫ్రాన్సు ఈనాటికి తన అంగీకారాన్ని తెలిపితే ముసోలినీకి ఇంకా సంకోచం దేనికి?

ఫ్రాన్సు అంగీకరించింది సరే! మరి, బ్రిటన్ మాటో!

బ్రిటన్ - ఇటలీలమధ్య ఎప్పుడూ ఏమీ పేచీలు రాలేదు. పైగా, ఆరెండింటికీ మంచిస్నేహంవున్నది. బ్రిటిష్‌సామ్రాజ్యానికి మణిపూస ఇండియా! బ్రిటన్ ఇండియాను సురక్షితంగా వుంచుకోవాలంటే, బ్రిటన్-ఇండియాలమధ్య దారి ముందు సురక్షితంగా వుండాలి. జిబ్రాల్టర్, మాల్టా, ఈజిప్టు, ఏడెన్—ఇవి ఈ దారికి ఆయువుపట్టులు. ఇటలీకిపక్కగా — మెడిటరేనియన్ సముద్రంగుండా — ఈదారి వెడుతున్నది. అంచేత, బ్రిటన్ ఇటలీతో పేచీకిదిగడం చిక్కే! ఈ సంగతిని చక్కగా గ్రహించి, ౧౮౮౭ లో లార్డు సాలిస్‌బరీ ఇటలీతో ఒక వొడంబడికను చేసుకున్నాడు. అప్పటినుంచీ—అంటే, దాదాపు ఈ ౫౦సంవత్సరాలనుంచీ—మెడిటరేనియన్ విషయంలో బ్రిటన్‌కు దిక్కులేకుండా పోయింది.

ఈవిధంగానూ, తదితరవిధాలుగానూ బ్రిటన్-ఇటలీలకు చిరకాలంనుంచి మైత్రి! పైగా, బ్రిటన్‌కు బ్రహ్మాండమైన సామ్రాజ్యం వుంది. బ్రిటిష్‌సామ్రాజ్యపు విస్తీర్ణం ౧,౩౯,౦౯,౭౮౨ చదరపు మైళ్లు! ప్రపంచం మొత్తంలో ౧/౫ వంతు బ్రిటిష్‌పతాకంక్రిందే వున్నది! ఇంత పెద్దసామ్రాజ్యాన్ని తన వుపయోగంకోసం సంపాయించుకున్న బ్రిటన్, ఆఫ్రికాలో ఒక చిన్న భూభాగాన్ని—అబిసీనియాను ఇటలీ ఆక్రమిస్తే అందుకు అడ్డువస్తుందా? వస్తే, అది ధర్మమా?

జపానుసైన్యాలు చైనామీద పడి, రాష్ట్రం తర్వాత రాష్ట్రాన్ని కబళిస్తూవుంటే బ్రిటన్ చూస్తూ వూరుకుంది. అప్పటి బ్రిటిష్ విదేశాంగమంత్రి—సర్ జాన్ సైమన్—తొందరపడి ఏమీ చర్య జరపవద్దని నానాజాతిసమితిని పదేపదే హెచ్చరించాడు. తమను సమర్థిస్తూ సమితిలో ఇంతచక్కగా పనిచేస్తున్నందుకు ఆరోజుల్లో జపానుప్రతినిధులు సైమన్‌మంత్రిని అభినందించారుకూడా! చైనాపైన దౌర్జన్యానికి దిగి, జపాను నానాజాతిసమితి నియమావళికానేకుండా మరి రెండు సంధిపత్రాలను సయితం తృణీకరించినదని నిర్ణయించి, దాన్ని ఖండిస్తూ లీగ్ ఎసంబ్లీ తీర్మానించినపిదపకూడా, సాక్షన్సు ప్రకటించడానికి ససేమిరా వీలులేదని బ్రిటన్ గట్టిపట్టు పట్టింది! బ్రిటన్ - జపానులకు ఎంత స్నేహంవుందో అంతకంటె హెచ్చుగానే బ్రిటన్ ఇటలీలకు స్నేహంవుంది. అందుచేత బ్రిటన్ తమకుకూడా తోడ్పాటుగా వుండగలదని, కనీసం, తమకు ఎదురుతిరగదని ముసోలినీ ఆశించడం విపరీతమా?

వర్సైయిల్సుసంధిని త్రోసిపుచ్చి నానాజాతి సమితినిబంధాలకు భిన్నంగావెళ్లి జర్మనీ ఆయుధధారణ చేస్తే, బ్రిటన్ ఏమీ చర్యజరిపించలేదుసరిగదా, దానితో నౌకాసంధినికూడా చేసుకుంది ! జర్మనీని హర్షించిన బ్రిటన్ ఇటలీని ఖండిస్తుందా ?

ఏమీ అపకారంచెయ్యని అబిసీనియామీద—ఏదో వొక వెధవసాకును కల్పించుకుని—విరుచుకుపడ్డం అన్యాయమనో, అక్రమమనో, రక్తపాతంకూడదనో వెర్రిమొర్రిధర్మసిద్ధాంతలనా ఇక పరిగణించవలసింది ? ఎన్ని అన్యాయాలనుచెయ్యలిదే, ఎంత అక్రమానికి దిగందే, మరెంత రక్తపాతాన్నికావించనిదే ఏదేశం విపులసామ్రాజ్యాన్ని సంపాదించుకోగలిగింది ? పోతే, తానాసరస్సు నీటివిషయంలో తనకు ఏమైనా యిబ్బంది రావచ్చుననే భయంతో బ్రిటన్ కొంతవరకు అడ్డు పడవచ్చును. అయితే, ౧౯౦౬ లోనూ, ౧౯౨౫ లోనూ జరిగిన రెండు వొడంబడికలలోకూడా తానాసరస్సు విషయంలో బ్రిటన్‌కు అనుకూలంగా ఏర్పాట్లు చేయ బడ్డాయి. ఇప్పుడు ఆ యేర్పాట్లకు భిన్నం ఎందుకు వస్తుంది ? అవసరమైతే, బ్రిటన్‌కు అబిసీనియాలో రవ్వంతైనా నష్టంకలిగించడం మావుద్దేశంకాదని ఇటలీ నచ్చజెప్పవచ్చును !

ఈ అన్ని విధాలా ఆలోచించి, అబిసీనియాను ఆక్రమించడానికి ఇక తమకు 'లైన్ క్లియర్' అయినదని ముసోలినీ వుద్దేశపడ్డాడు! తర్వాత కొంతకాలం వరకు జరిగినతంతు అతని ఈవుద్దేశాన్ని ఇంకాబలపరచింది!

వల్‌వల్ సంఘర్షణ జరిగింది ౧౯౩౪ డిశెంబర్‌లోకదూ! ఆ సంఘర్షణఅయినవెంటనే—౧౯౩౫ జనవరిలో—ఇటలీచర్యలు అపాయంగా వున్నాయని అబిసీనియా నానాజాతిసమితికి విన్నపాన్ని పంపుకున్నది. ఈవిన్నపాన్ని సమితి లెక్కచెయ్యలేదు. ఆ తర్వాత మార్చినెలలో అబిసీనియా తిరిగీ అప్పీల్ చేసింది. సమితి ఈసారి ఏదో వొక అవకతవక మధ్యవర్తిసంఘాన్ని ఒకదాన్ని నియమించింది. జులై నెల వరకు ఈ సంఘం వృథాచర్చలతో కాలం వెళ్లబుచ్చింది. ఈలోపుగా ఫిబ్రవరిమొదలు దాదాపు ప్రతి వారమూ ఇటాలియన్ సైనికదళాలు, ఇటాలియన్ యుద్ధసామగ్రి ఆఫ్రికాకు వెడుతున్నాయి. ఇవి వెళ్లవలసింది సూయజ్‌కాల్వగుండా! సూయజ్‌కాల్వపైన పెత్తనం అంతా బ్రిటన్, ఫ్రాన్సు రాజ్యాలది. అంచేత ఎప్పుడెప్పుడు ఎన్నెన్ని ఇటాలియన్ సైన్యాలఓడలు వెడుతున్నదీ, ఏమేమి యుద్ధసన్నాహం జరుగుతున్నదీ ఆ రెండు రాజ్యాలకు తెలియకపోవడానికి అవకాశంలేదు. అయినా ఏదీకూడా పల్లెత్తుమాట అనలేదు. నానాజాతిసమితిలో ఏమీచర్య జరపడానికి అలా ప్రయత్నించకపోవడం, బ్రహ్మాండంగా యుద్ధప్రయత్నాలు జరుగుతూవుంటే ఇలా మూకీభావం వహించడం చూచినతర్వాత తన ప్రయత్నాలకు బ్రిటన్-ఫ్రాన్సులు అడ్డువస్తాయని ముసోలినీ యెలావూహిస్తాడు ?

లాంఛనానికి ఏవో సంఘాలు, ఉపసంఘాలు-సభలు, సమావేశాలు—తగవునుగురించి చర్చచేస్తూనే వుంటాయనీ, బహుశః తమచర్యలను ఖండిస్తూ ఒకటి, రెండు శుష్కతీర్మానాలనుకూడా చేస్తాయనీ, ఈనాటకం యిలాజరుగుతూనేవుండగా తాము అబిసీనియాను కబళించవచ్చునని ముసోలినీ చివరకు గట్టిగా నిర్ధారణ చేసుకుని, పూర్వంకంటె మిన్నగా యుద్ధసన్నాహాలను సాగిస్తూవుండగా—

బ్రిటన్‌కు హఠాత్తుగా ఒకఅనుమానం తోచింది. తానాసరస్సు నీటివిషయంలో ముమ్ముందు తగాయిదాలురావడం, రాకపోవడం మాట అలావుండగా, అబిసీనియాను జయించినమీదట ముసోలినీ అంతటితో ఆగుతాడా ? లిబియాలో తమసైన్యాలను ముసోలినీ చాలావరకు హెచ్చిస్తున్నాడు. అబిసీనియాకు బహిరంగంగా సైనికదళాలు వెడతూవుంటే లిబియాకు రహస్యంగా చేరుతున్నాయి ! లిబియాలో—అంటే, ఈజిప్టుసరిహద్దులో— ఇంత సైనికబలాన్ని కూర్చడంలో ముసోలినీ వుద్దేశం ఏమిటి ? అబిసీనియాఆక్రమణ పూర్తికాగానే అతను ఈజిప్టుమీదకూడా వురకాలని ఆలోచనచేస్తూవుండవచ్చును. పైగా, ఈజిప్టు

మీద ముసోలినీకి కన్నువున్నా లేకపోయినా నూయజ్ కాల్వ దరిదాపులను సామ్రాజ్యసంపాదనకోసం తహతహలాడుతూ, తన కోర్కెసాఫల్యానికి శతవిధాల ప్రయత్నించేస్తున్న ఇటలీని చేరనివ్వడం ఎప్పటికైనా ముప్పే !

బ్రిటన్‌కు ఈ అనుమానం తగలడమే తడవుగా దాని వైఖరి అంతా వుల్టాసీదా అయిపోయింది. అబిసీనియా పెడుతున్న మొరలంటే పూర్వంవున్న వుదాసీన భావం పోయి, ఎక్కడా లేని జాలిగుండెలు వచ్చాయి! అప్పటికి కొన్నిమాసాలనుంచి ఇటలీ యుద్ధసన్నాహాన్ని చేస్తున్నా, ఇది నానాజాతిసమితి సిద్ధాంతులకు విరుద్ధమని అప్పుడే ద్యోతకమైంది! ! సమితిని భగ్నంచెయ్యడానికిముందు జపానువిషయంలో, తర్వాత జర్మనీ విషయంలో తాను ఈషణ్మాత్రమైనా సంకోచించక పోయినా ఆ అంతర్జాతీయసంస్థప్రతిష్ఠకు కళంకం తేవడం ప్రపంచశాంతికి ముప తేవడమని అప్పుడే అర్థమయింది ! ! !

ముసోలినీ అబిసీనియాను ఆక్రమించడం ఎప్పటికైనా తనకు చేటని గ్రహించిన మరుక్షణం నుంచీ, బ్రిటన్ అతనిప్రయత్నాలను ప్రతిఘటించడానికి పూనుకుంది. బ్రిటన్ ఇలా హఠాత్తుగా యెదురు తిరగడం చూస్తే ముసోలినీకి కలిగిన కోపం యింతంతకాదు. ఆ కోపాన్ని పట్టలేక—తానే అందుకు పూనుకోవడం మర్యాదకాదుగనక—ఇటాలియన్ పత్రికలను అన్నింటినీ బ్రిటన్‌ను తిట్టమని ఉసుకొలిపాడు. డిక్టేటర్‌దగ్గర నుంచి ఆజ్ఞరావడమూ, దాని పరిపాలనంలో సంకోచమూనా! ఇటాలియన్ పత్రికలు అన్నీ కూడా ఒకదాన్ని మించిమరొకటి—ఒకదానికంటె తీవ్రంగా వేరొకటి—బ్రిటన్‌మీద విమర్శనలు, దూషణలు ప్రకటించ సాగాయి.

ఇటాలియన్‌పత్రికల ఈ విరోధభావాన్ని సాకుగా కల్పించుకుని, తమ సామ్రాజ్యానికి ఇటలీవల్ల ముప్పువాటిల్లే సూచనలు కనబడుతున్నాయనిచెప్పి, బ్రిటన్ మెడిటరేనియన్‌సముద్రంలో తన నౌకాబలాన్ని చాలాచేర్చింది! ఇలా చేర్చడంలో దాని వుద్దేశాలు రెండు: ఇటలీకి బెదురుపెట్టడం, ఈజిప్టుకు కొంత రక్షణకల్పించడం.

బ్రిటన్ – ఇటలీ రాజ్యాల సంబంధబాంధవ్యాలలో ఈమార్పువచ్చేసరికి ఫ్రాన్సుపని అడకత్తెరమధ్య చిక్కుకుపోయిన పోకచందం అయిపోయింది. బ్రిటన్ జర్మనీతో నౌకాసంధిని చేసుకున్న కొత్తరోజుల్లో దానిమీద కలిగిన అనుమానం, పొడసూపిన విరోధభావం ఫ్రాన్సుకు త్వరలోనే పోయాయి! జర్మనీ వర్సెయిల్సుసంధిని పాటించే ధోరణిలో లేదు. ఆ సంధి షరతులను దానిమీద అమలు జరపడానికి ప్రయత్నించేస్తే అది యెదురుతిరిగేస్థితిలో వుంది. అనవసరంగా దాన్ని రేగగొడితే, తిరిగీ యుద్ధం తప్పదు. ఈ సందర్భంలో దానితో ఏదైనా యేర్పాటునుచేసుకోవడం, ఒడంబడికకురావడం మంచిది.

తక్కినవారి అంగీకార,అనంగీకారాలతో నిమిత్తం లేకుండానే జర్మనీ ఆయుధధారణచేసింది. వున్న ఒక్క సంధినీ తృణీకరిస్తున్నది. పరిమితిలో వుంచడానికి వేరే కొత్తసంధి ఏదీ లేదు. అంచేత ఆయుధధారణంలో జర్మనీ విపరీతంగా వెళ్లింది. రేపు నౌకాదళనిర్మాణంలో కూడా జర్మనీ యిలాగే చేస్తుంది. దూరంగాత్రోసివేసి, జర్మనీని హద్దులేకుండా నౌకాదళనిర్మాణం చెయ్యనివ్వడంకంటె దాన్ని దగ్గరకు తెచ్చుకుని, ఏదో వొక వొడంబడికతో బంధించి, ఒక పరిమితిలో వుంచడం మంచిదికదూ! తాను జర్మనీతో నౌకాసంధిని చేసుకోడానికి ఇది కారణమనీ, ఫ్రాన్సు అంటే తనకు స్నేహభావం ఏమీ తగ్గలేదనీ బ్రిటన్ నచ్చజెప్పింది. అయితే, ఇప్పుడు ఫ్రాన్సు కర్తవ్యం? అటు బ్రిటన్ స్నేహం చెడగొట్టుకోవడమా? ఇటు ఇటలీనేస్తం కొట్టివెయ్యడమా?

ఈచిక్కునుంచి తప్పించుకోడానికి ఫ్రాన్సుకు ఒకటేమార్గం కనబడింది: అది బ్రిటన్, ఇటలీలమధ్య రాజీనిచెయ్యడం. అంచేత ఫ్రెంచి ప్రధానమంత్రి లావల్ బ్రిటన్‌ప్రతినిధి ఆన్‌తోనీ ఈడెన్‌నూ, ఇటాలియన్‌ప్రతినిధి బారన్ అలాయిసీనీ పారిస్ పిలిపించి,

సంప్రదింపులు జరిపాడు. ఆసందర్భంలో మీకోర్కెలు ఏమిటో తెలియజేయవలసినదిగా బ్రిటన్ - ఫ్రాన్సు ప్రతినిధులు ముసోలినీని అడిగారు. ముస్సోలినీకి వున్న కోర్కె ఒక్కటే! అది అబిసీనియాను పూర్తిగాఆక్రమించడం! ఈకోర్కెను బ్రిటన్—ఫ్రాన్సులు అంగీకరించే ధోరణిలో లేవని అతడు తెలుసుకున్నాడు. అందుచేత తన కోర్కెలు ఫలానాఅని విశదీకరించడానికి వీలుపడదన్నాడు. ఆపైన ఫ్రాన్సు — బ్రిటన్‌లు తమంతట తామే కొన్ని రాజీపరతులను ఏర్పరిచి, వాటిని ముసోలినీకి తెలియజేసాయి. ఈషరతులు ముసోలినీని కొంత కట్టబెట్టినట్లూ, అబిసీనియాకు కొంత న్యాయంచేసినట్లూ పైకికనబడుతున్నాయి. కాని, లోతుకుదిగిచూస్తే వీటివల్ల లాభంకలిగేది బ్రిటన్‌కు, ఫ్రాన్సుకు! ముసోలినీ ఈరాజీషరతులను నిరాకరించాడు; అబిసీనియాకూడా ఇవి తనకు అన్యాయంగావున్నాయని ప్రకటించింది!

బ్రిటన్‌విదేశాంగనీతిలో ఒక కిటుకువుంది. మొన్నటి ఐరోపామహాసంగ్రామాన్ని వుదాహరణంగా తీసుకుంటే ఈకిటుకు బోధపడుతుంది. ఆయుద్ధానికి ముందు జర్మనీరాజ్యం విపరీతంగా వృద్ధిపొందింది. ఆజర్మనీ ప్రతిభముందు బ్రిటన్ తేజోవిహీనం అయిపోయింది. అంచేత జర్మనీని ప్రతిఘటించడం, దాన్ని వోడించడం బ్రిటన్‌కు తప్పనిసరిఅయింది. కాని, తనకుగల ఈఅవసరాన్ని "అల్పరాజ్యాల స్వాతంత్ర్య రక్షణ" అనేసాకుతో కప్పిపుచ్చి, ప్రపంచాన్ని ఉద్ధరించడానికే తాను రణరంగాన నిలిచినట్లు బ్రిటన్ చాలాచక్కగా నటించింది.

ఈ కిటుకునే బ్రిటన్ తిరిగి వుపయోగానికి తెచ్చింది. దానికి కావలసింది అబిసీనియా క్షేమంకాదు! అబిసీనియా క్షేమాన్ని కోరేదే అయితే ౧౯౦౬ లో ఫ్రాన్సు—ఇటలీలతోనూ, తిరిగీ ౧౯౩౫ లో ఇటలీ ఒక్కదానితోనూ ఆప్రయివేటువొడంబడికలను చేసుకునేదికాదు! పైగా వల్‌వల్ దగ్గర ఈతగవు పుట్టగానే త్రుంచివేసేదికూడా! బ్రిటన్‌కు కావలసింది తనసామ్రాజ్యరక్షణ! ముసోలినీవల్ల తనసామ్రాజ్యానికి అపకారం జరగదనినమ్మకంవుంటే, అబిసీనియా ఏగంగనుకలిసినా బ్రిటన్ లెక్కచేసేదికాదు. ... యుద్ధంకోసం తొమ్మిది మాసాలకుపైగా బ్రహ్మాండంగా సన్నాహంచేసి, ఇప్పుడు చల్లగా సర్దుకోడానికి ముసోలినీ ఎలాగూ అంగీకరించడు. పోతే- ముసోలినీని తాను బహిరంగయుద్ధంలో ఎదిరిస్తే చాలాచిక్కులువస్తాయి. అంచేత దానికి మందు ఏమిటంటే—నానాజాతిసమితి ప్రతిష్ఠను కాపాడితీరాలి. లేకపోతే ప్రపంచానికి ముప్పుతప్పదని ఆందోళన చేయడం!

ఈ ఆందోళన మొన్న సెప్టెంబర్‌లో జరిగిన నానాజాతిసమావేశంలో ప్రారంభం అయింది. ఆసమావేశంలో బ్రిటిష్ విదేశాంగమంత్రి సర్ సామ్యూల్ హోర్ వుపన్యసిస్తూ, నానాజాతిసమితి లేకపోతే, ప్రపంచశాంతి లేదనీ, ముసోలినీ సమితిప్రతిష్ఠను భగ్నంచెయ్యడానికి పూనుకున్నాడనీ, అవసరమైతే ఇటలీమీద సాంక్షన్సునుఅయినాసరే ప్రకటించి, సమితి పరువును నిలబెట్టాలనీ హెచ్చరించాడు. ఈవ్యవహారంలో బ్రిటన్‌కు స్వార్థచింత ఏమీలేదని ఒకసారికి రెండుసార్లు నొక్కిచెప్పాడు. ఇటలీమీద చర్యజరపడానికి తక్కిరాజ్యాలు కలిసిరాకపోతే, బ్రిటన్ అసలు సమితినుంచే తప్పుకుంటుందని ఒక బెదిరింపుకూడా అలా విసిరాడు.

ముఖ్యంగా ఫ్రాన్సును వుద్దేశించే, ఈబెదిరింపు. "ఇటలీపక్షానికి వెడతావా? నాపక్షానికి వస్తావా?" అని. ఇది బ్రిటన్ ఫ్రాన్సుకువేసిన ప్రశ్న. ఈప్రశ్నకు ఖండితంగా ఏమీ జవాబుచెప్పలేక, లావల్ గోడమీద పిల్లివాటంగా ప్రవర్తించాడు.

జర్మనీవిజృంభణాన్ని అరికట్టడమే ఫ్రాన్సు ఆశయం! అందుకు ముసోలినీ తోడ్పడతానని మాటయిచ్చాడు. అంచేత ఫ్రాన్సు ముసోలినీపక్షాన చేరింది. ఇప్పుడు బ్రిటన్ అదేమాటను యిస్తే, బ్రిటన్‌పక్షానికి తిరగడానికి ఏమీ అభ్యంతరం లేదు. బ్రిటన్—ఇటలీలలో, బ్రిటన్ ఎక్కువశక్తిమంతమైనరాజ్యం, అంచేత బ్రిటన్‌స్నేహంవల్లనే యెక్కువలాభం వుంటుందికదూ! అయితే బ్రిటన్‌చేత జర్మనీవిషయంలో వాగ్దానాన్ని

చేయించుకోవడంఎలా? ఏముంది? రాజకీయపరిభాషలో ఒకప్రశ్న అడగడం ?

"ఆస్ట్రియాను కబళించడానికి, ఏరాజ్యమైనా దౌర్జన్యానికి దిగితే, ఆదేశంమైనకూడా సాంక్షన్సును ప్రకటించడానికి బ్రిటన్ అంగీకరిస్తుందా ?" అని ఫ్రాన్సు బ్రిటన్‌ను అడిగింది. ఇందుకు జవాబుగా "నానాజాతిసమితికివిరుద్ధంగా ఏరాజ్యంవెళ్లినా దాని మీద సాంక్షన్సును ప్రకటించవలసిందే!" అని బ్రిటన్ జవాబుచెప్పింది.

దానితో బ్రిటన్‌అంటే ఫ్రాన్సుకున్న సందేహం తీరిపోయింది. మరి బ్రిటన్‌కుమాత్రం ఫ్రాన్సు మీద సందేహాలు వుండకుండావుంటాయా ? తిక్కపుట్టి, ఇటలీ ఏదో వొకక్షణంలో బ్రిటన్‌మీదకు ఎదురుతిరిగితే, ఫ్రాన్సు వేళకు ఆదుకుంటుందా ? లేక రెండావులదూడవలె పరివర్తిస్తుందా ? ఈసందేహాన్ని తీర్చుకోడానికి బ్రిటన్ ఫ్రాన్సుకు ఒక ఎదురుప్రశ్న వేసింది.

"సాంక్షన్సును అమలుజరుపుతూవుండగా ఏదయినాదేశం బ్రిటన్‌ను ఎదిరిస్తే, ఫ్రాన్సు బ్రిటన్‌కు సహాయంవస్తుందా ?" ఇందుకు తప్పకుండా సహాయానికివస్తానని జవాబుచెబుతూ, ఫ్రాన్సు ఏవో కొన్ని షరతులనుకూడా పెట్టింది. ఈ ప్రశ్నోత్తరాలతో ఫ్రాన్సు బ్రిటన్‌వైపుకే యెక్కువమొగ్గడం జరిగింది. అయితే, ఇటలీఅంటే ఫ్రాన్సుకు కొంతభయం లేకపోలేదు.

ఒకవైపున జర్మనీశత్రుత్వంనుంచి తప్పించుకోవాలని ప్రయత్నంచేస్తూ, మరోవైపున ఇటలీశత్రుత్వాన్ని క్రొత్తగా సంపాయించుకోవడం మంచిదా ? ఒకవేళ హిట్లరు ముసోలినీలు ఏకమైతే, మధ్య ఫ్రాన్సుపని ఏమాతుంది. పైగా, మొన్న జనవరిలో లావల్ ముసోలినీతో రహస్యపువొడంబడికకు వచ్చాడుకదూ! ముసోలినీ ఈ వొడంబడికషరతులను ప్రకటిస్తే, ఫ్రాన్సుపని నసుబాట్లుకాదా ? ఇంతేకాకుండా ఈ అబిసీనియా వ్యవహారంలో ఇటలీ చితికిపోతే, బ్రిటన్ జర్మనీలు మరింతశక్తివంతం అవుతాయి. అది వాంఛనీయం కాదుగా! అంచేత బ్రిటన్‌కు 'పక్కతాళంవేస్తూ, లోపాయికారీగా ఇటలీకి సహాయంచెయ్యడం వుత్తమమని ఫ్రాన్సు నిర్ణయించుకుంది. ఈ నిర్ణయంప్రకారమే ఈరోజువరకు నడుచుకుంటున్నదికూడా!

నానాజాతిసమితి నియమావళిప్రకారం సమితి సభ్యులు ఏకగ్రీవంగా తీర్మానిస్తేనేగాని, సాంక్షన్సు ప్రకటించడానికి వీలులేదు. దాన్ని ఆధారంగాతీసుకొని, ఆస్ట్రియా — హంగరీ — అల్బానియాల చేత వ్యతిరేకంగా వోటుచేయించి, అసలు సాంక్షన్సు ప్రకటనజరగకుండా చెయ్యాలని ఫ్రాన్సు శతవిధాల ప్రయత్నించింది. అయితే, లీగ్‌కౌన్సిల్ ఏకగ్రీవంగా ఆమోదిస్తేచాలు; లీగ్‌ఎసంబ్లీ వోటుతో నిమిత్తంలేదని చెప్పి బ్రిటన్ ఈయెత్తును సాగనీయలేదు.

ఆతర్వాత సాంక్షన్సుస్వరూపాన్ని నిర్ణయించవలసివచ్చినప్పుడు బ్రిటన్ కొంచెం దూకుడుగా వెళ్లాలని ప్రయత్నంచేస్తే ఫ్రాన్సు యెప్పటికప్పుడు కళ్లెం బిగలాగి, వీలైనంతవరకు ఇటలీకి చిక్కుతప్పించడానికి పాటుపడింది.

మొదట్లోవున్న దూకుడు, తర్వాతతర్వాత బ్రిటన్‌కుకూడా లేకపోయింది. ఇటలీదౌర్జన్యాన్ని ఉపన్యాసాలద్వారా తీర్మానాలరూపంలో ఖండించుతూ వున్నంతవరకు సమితిలోని అల్పరాజ్యాలు ఒకదానికంటె ఒకటి మిన్నగా వెళ్లింది. కాని, కార్యరంగానికి దిగవలసినతరుణం వచ్చేసరికి, తమకు ఆ యిబ్బందులు వున్నాయనీ, ఈకష్టాలువున్నాయనీ సాకులుచెప్పి, ఒకదానికంటె ఒకటి యెక్కువగా మినహాయింపులు కోరాయి. "చిరకాలంనుంచి మేము ఇటువంటి తగాయిదాలలో తటస్థంగా వుంటున్నాము; అందుకు భిన్నం రాకుండా వుండే పద్ధతిని మేము సాంక్షన్సుకు అంగీకరిస్తాము" అని స్విట్జర్లాండు చెప్పింది. అంటే, జర్మనీనుంచి, స్విట్జర్లాండుగుండా యుద్ధసాధనాలను దిగుమతి చేసుకోవచ్చునన్నమాట! ఇలాగే రుష్యా, ఇలాగే రుమానియా, ఇలాగే ఆర్జన్‌టైనా, ఇలాగే తదితర దేశాలు మినహాయింపులను కోరాయి.

ఇంతేకాకుండా, సాంక్షన్సును అమలు జరపడంలో తమకుకలిగేనష్టానికి ఏదైనా పరిహారంకావాలని దాదాపు అన్నిరాజ్యాలూ కోరాయి. స్వార్థచింత లేకుండా మేము ఈవ్యవహారంలోకి దిగినామని బ్రిటన్ ఎంత నొక్కి చెప్పినా, ఇందులో బ్రిటన్‌కు వున్నదే స్వార్థచింత అని గ్రహించి, ప్రతిదేశమూ సాంక్షన్సును అమలుజరిపినందుకు, బ్రిటన్ తమకు ఏమి 'బక్షీస్' ఇస్తుందని అడగసాగింది. దాన్ని చూచి బ్రిటన్ చాలవరకు బెదిరిపోయింది.

స్వలాభంకోసం ఈరాజ్యాలు ఎంతగా దేవులాడినాయో చూపించడానికి ఒక్క వుదాహరణం చాలును. రుమానియా కొన్నిమాసాలక్రితమే ఇటలీకి పెట్రోలును పంపడం మానుకుంది. ఇటలీ బాకీని సరిగా చెల్లించకపోవడమే ఇందుకు కారణం. అయినా, సాంక్షన్సును గురించి చర్చలు జరుగుతున్నప్పుడు ఇటలీకి మేము పెట్రోల్ ఎగుమతి ఆపివెయ్యడంవల్ల వచ్చేనష్టానికి ఎవరు పూచీపడతారని అడిగింది!

ఇటలీ దురాశవల్ల, అబిసీనియా దురదృష్టంవల వచ్చిన ఈ అవకాశాన్ని పురస్కరించుకుని ఎవరి లాభాన్ని వారు పొందాలనే ఈదుర్బుద్ధి చివరకు ఎంత వరకు పోయినదంటే, — తనకు లాభదాయకంగా వుండే సాంక్షన్సుకు ఫ్రాన్సు సిఫార్సుచేస్తే, తనకు అనుకూలంగావుండే సాంక్షన్సుకోసం బ్రిటన్ పెనుగులాడింది.

బేరసారాలు చాలా సాగినతర్వాత ఇటలీకి ఆర్థికంగా సహాయంచెయ్యరాదనీ, అసలు దానితో ఆర్థికంగా వ్యవహరించడంకూడా పనికిరాదనీ ఏవో కొన్ని సరుకులను ఇటలీకి ఎగుమతిచెయ్యగూడదనీ, ఇటలీసరుకులను అసలు కొనరాదనీ, దానికి ఆయుధాలను అమ్మగూడదనీ నిర్ణయంజరిగింది! పోనీ, ఈనిర్ణయానికైనా త్వరగా రావడం, వచ్చినవెంటనే దాన్ని అమలుజరపడం వున్నదా? ఎలా వుంటుంది? ఎవడికి పుట్టినబిడ్డ వెక్కి వెక్కి ఏడ్వటానికి అన్నట్టు అబిసీనియాసంగతి నిజంగా ఏవరికైనా పడితేగా! యుద్ధం అక్టోబర్ ౩-వ తేదీని ప్రారంభం అయితే సెప్టెంబర్ ౩౦-వ తేదీనగాని ఎగుమతి — దిగుమతులనిషేధాన్ని గురించి నిర్ణయం జరగలేదు. తర్వాత సెప్టెంబర్ ౧౮-వ తేదీని గాని ఈనిర్ణయం అమలులోకి రాలేదు.

ప్రకటించిన ఈఅవకతవక సాంక్షన్సునుఅయినా అమలు జరపడంలో ఎంతోమోసం జరుగుతున్నది! సూయజ్ కాల్వగుండా వెడుతూన్న ఇటాలియన్‌యుద్ధ నౌకలకు, అవి చెల్లించవలసిన సుంకాన్ని ఈరోజువరకు ఫ్రెంచిబ్యాంకుల్సు ఇస్తున్నాయి! అంటే, ఇవి ముసోలినీకి అప్పుపెడుతున్నవన్నమాటేగా! పారిస్ బ్యాంకుల్సు ఇటీవలనే X కోట్లడాలర్లను ఇటలీకి అప్పుగా యిచ్చాయని అదేదో పత్రిక ప్రకటించింది. దాన్ని ఇంతవరకు ఎవరూ 'లే'దన లేదుకూడా!

బ్రిటన్ ప్రవర్తనకూడాఇంతలక్షణంగానేవున్నది. పెట్రోల్ ఎగుమతి నిషేధింపబడనిమాట నిజమే! అయితే, పెట్రోల్ ఆధునికయుద్ధానికి అత్యవసరమైనట్టిది! అంచేత దాన్ని-నిషేధంవున్నా, లేకపోయినా-ఇటలీకి ఎగుమతిచెయ్యడం తప్పు! పోనీ, వ్యక్తులుఎవరైనా ఈ పనినిచేస్తే సహింపవచ్చునుగాని, ప్రభుత్వమే ఇందుకు లోబడితే, అది క్షంతవ్యము కాదు. అయినా, బ్రిటన్ ఈ తప్పును చేస్తున్నది! ఆంగ్లో - పర్షియన్ ఆయిల్‌కంపెనీ ఈ రోజువరకూ ఇటలీకి విరివిగా పెట్రోల్ సప్లయిచేస్తున్నది! ఈ కంపెనీలోని షేర్లు అధికభాగం బ్రిటిష్‌ప్రభుత్వానివే?

ఇలా ఇటలీకి పెట్రోల్ ఎగుమతిచెయ్యడం తప్పుకాదా అని ఎవరో అడిగితే, బ్రిటిష్‌ప్రభుత్వంచెప్పిన జవాబు ఇది: "మేము పంపకపోతే మరొకరు పంపుతారు. మేముమాత్రమే మడికట్టుకుని, ఆ లాభాన్ని కాస్తా పోగొట్టుకోవడం ఎందుకు?" (!)

ఇప్పటివరకును నిర్ణయించిన సాంక్షనును సవ్యంగా అమలుపరచినా వాటివల్ల ఏమంత లాభంవుండదు. నానాజాతిసమితిని పాటించక, ఈ సందర్భంలో ఇటలీపక్షాన వున్న ఆస్ట్రియా, హంగరీ, అల్బానియాల సహాయంతోనూ, నానాజాతిసమితితో అసలు సంబంధం

లేని అమెరికా - జర్మనీ - జపానుల తోడ్పాటుతోనూ ముసోలినీ ఈ యిబ్బందిని ఏదోఒకవిధంగా గడుపుకో గలడు. అమెరికా తాను తాటస్థ్యంగావుంటానని చెప్పి, ఆయుధాలను, మరికొన్ని వస్తువులను ఇటలీకి ఎగుమతి చేయగూడదని ప్రకటించినమాట నిజమే ! అయితే, ముందుగానే రొక్కం చేతిలో వేయించుకుని అమెరికన్ వర్తకులు వాటిని - ఆయుధాలను మినహాయించి - ఎగుమతిచెయ్యడానికి అవకాశంవుంది. అందుచేత అమెరికా నిషేధం ఇటలీకి అంతగా అడ్డురాదు. జర్మనీకూడా కొన్నిఎగుమతులను ఇటలీకి నిషేధించింది. అయితే, ఇదికేవలం బ్రిటనును సంతోషపెట్టడానికి చేసినపని. బ్రిటను ఇటీవల ఫ్రాన్సువైపుకు కొంచెం ఎక్కువగా మొగ్గడంచూచి, హిట్లర్ తిరిగీ బ్రిటన్ సదభిప్రాయాన్ని సంపాయించుకోడానికిగాను ఈ నిషేధాన్ని ప్రకటించాడు. ప్రస్తుతం జర్మనీ ఆర్థికపరిస్థితులు నానాటికీ తేరాగా వున్నాయి. దానికి ఎక్కడా అప్పుకూడా పుట్టడంలేదు. అందుచేత, ఈ అవకాశాన్ని చేయిజారిపోనీయకుండా, ఇటలీతో విరివిగా వ్యాపారంచేస్తే ఆ చిక్కులనుంచి బయటపడవచ్చును. పైగా, నిషేధాన్ని ప్రకటించినా, లోపాయికారీగా జర్మనీ తప్పకుండా ఇటలీతో వ్యాపారంచేస్తూనే వుంటుంది. ఇందుకు నిదర్శనం కావాలంటే, ఈ క్రింది విషయాన్ని గమనించండి: ఇటలీనుంచి ఏమీ దిగుమతి చేసుకోగూడదని కదూ నానాజాతిసమితి ప్రకటించింది. ఈ బహిష్కరణాన్ని దాటడానికి ఇటలీ ఒకయెత్తు యెత్తవచ్చును. తన సరుకులను ముందు ఏ ఆస్ట్రియాకో, హంగరీకో, లేకపోతే, జర్మనీకో పంపడం; అక్కడినుంచి వాటిని ఆదేశపు సరుకులే అని, ఇతర దేశాలకు అమ్మడం ! ఇలాఅయితే సరుకులు కొంచెం చుట్టుతిరిగి వెళ్లాలన్న యిబ్బంది తప్పితే, వాటి అమ్మకానికి ఏమీ పేచీలేదు. ఈపద్ధతిని ఇటలీ తప్పకుండా అవలంబిస్తుంది కూడా. దీనికి వీలులేకుండా, బ్రిటన్ ఒకజాగ్రత్తను చెయ్యాలని యోచించింది. ప్రతిదేశమూ, తన సరకుమీద తన పేరును నమోదుచేస్తే, ఇటాలియన్ సరుకులను కొంత వరకు పట్టివెయ్యవచ్చును. ఈ వుద్దేశంతోనే జర్మనీని తనసరుకుమీద తనపేరును నమోదు చేస్తూవుండమని బ్రిటన్ అడిగితే, మన యిద్దరిమధ్య జరిగిన వర్తకపు వొడంబడికలో ఈ షరతు లేదే! అని జవాబుచెప్పింది!

సాన్‌క్షన్సును అంగీకరించిన రాజ్యాలు వాటిని చిత్తశుద్ధితో అమలుజరిపినా, పైనచెప్పినట్టుగా ఇటలీ ఏదో వొకవిధంగా నెట్టుకురాగలదు. ఇక, సాన్‌క్షన్సును అమలు జరపడంలో ఇంత స్వార్థం, మోసం వుండగా వేరే చెప్పాలా ?

క్రొత్తసాన్‌క్షన్సునుగురించి యోచించడానికి సెప్టెంబర్ ౨౮వ తేదీని నానాజాతిసమితి నియమించిన అదేదోకమిటీ సమావేశం కావాలని మొట్టమొదట నిర్ణయింపబడింది. కాని క్రొత్త సాన్‌క్షన్సును ప్రకటించడం ఫ్రాన్సుకు యిష్టంలేదు. వాటివిషయమై తొందరపడ్డం అసలే యిష్టంలేదు. అందుచేత తనకు జాతీయ వ్యవహారాలు ఏవో వున్నందువల్ల తాను ఆసమావేశానికి రాలేనని లావల్ కబురుపంపించాడు. దానితో ఆ సమావేశంకాస్తా వెనక్కువెళ్లింది. ఆమధ్య ఒకప్పుడు బ్రిటీష్‌విదేశాంగమంత్రిని కలుసుకోడానికి యిష్టంలేక, తనకు పడిశంపట్టినదని హిట్లరుపెట్టిన వంకవలెనే వుంది, ఇప్పుడు లావల్ చెప్పినసాకుకూడా !

ఇంతకూ ఫ్రాన్సుకుగాని, బ్రిటన్‌కుగాని ముసోలినీ పూర్తిగా వోడిపోవడం సుతరామూ, యిష్టంలేదు. అవి కోరేది ఏమిటంటే, - ముసోలినీ ఈ యుద్ధంలో దెబ్బతినగూడదు. అలాఅని అతడు జయాన్నీ పొందగూడదు. ఏదో కొంతరాజ్యాన్ని ఆక్రమించుకోవాలి; కొన్ని చిక్కులలోపడాలి; తమవద్దకు సంధికోసం రావాలి. అప్పుడు తాము నాటకంఆడాలి. ఇదే వాటి కోర్కె !

బ్రిటన్ కొంచెం బెట్టుచేస్తూవుంటే, లావల్ మధ్యవర్తిహోదాతో సర్దిచెప్పినట్టు నటిస్తూ, ఇటలీతో ఎలాగైనా రాజీకుదర్చడానికి ప్రయత్నంచేస్తున్నాడు. ఈమధ్య లావల్‌కూ, పారిస్‌లోవున్న ఇటాలియన్ రాయబారికీ మధ్య ఎన్నోసంప్రతింపులు జరిగాయి. ఈసంప్రతింపులఫలితంగా ఫ్రాన్సు—ఇటలీలు క్రింది యేర్పాటుకు వచ్చాయట !

ఇటలీ అబిసీనియాను పూర్తిగా జయించడానికి ప్రయత్నించగూడదు! ముఖ్యంగా తానాసరస్సు ప్రాంతాన్ని ఆక్రమించుకొని బ్రిటన్‌కు కోపం తెప్పించగూడదు.

ఇంత అట్టహాసంచేసినతర్వాత నానాజాతిసమితి కనీసం ఏఅవకతవక సాఙ్క్షన్సుఅయినా ప్రకటించకపోతే దాని పరువు దక్కదుగనక, సాఙ్క్షను ప్రతిఘటించడానికి దుడుకుగా ఇటలీ యుద్ధానికి పూనుకోకూడదు.

నానాజాతిసమితి యుద్ధరూపంగా సాఙ్క్షను ప్రకటించకుండా బ్రిటన్ ఫ్రాన్సులు జాగ్రత్త చెయ్యాలి. ఈ నాటకం అంతా ఒకదారికి వచ్చిన తర్వాత, బ్రిటన్ — ఫ్రాన్సు — ఇటలీలు వాటివాటి యోగ్యతలనుబట్టి అబిసీనియాను (ఆర్థికంగానూ, తదితరవిధాలా లాభంపొందడానికిగాను ) పంచుకోవాలి.

లావల్ చేసిన ఈ యేర్పాటు ప్రకారమే మరి ఏ మూడునాలుగు నెలలలోనో తప్పకుండా పంపకాలు జరుగుతాయి !

... ... ... ...

ఇప్పుడు వ్యాసం మొదటలోవున్న మిల్నీవాక్యాన్ని చదవండి. చదివి, అందులో అత్యుక్తివున్నదీ, లేనిదీ మీరే నిర్ణయించండి ! [25-11-35]

---



"నే నొంటరిగా ఉండలేను"　　A. A.

# మందులేనిపిచ్చి

కుందుర్తి నరసింహారావు

నీ వటులు చూచుచుందుము, నెచ్చెలీ! మ
దీయకంఠబిలమ్మున తీవ్రగాన
గర్భమున గాఢవాంఛామ్మగ మ్మొకండు
కన్నుల దవాగ్నివిస్ఫులింగములతో, భ
యంకర విరావకంపితాశాంతముగ, ని
లాతలి విలంఘించి ప్రళయలీలావిలోల
తాండవము సాగించి భూతప్రపంచ
మల్లకల్లోల మొనరించి అయ్యయో! ని
మేషమున నిన్ను నన్నును మ్రింగివైచు,
అపుడు నీకండ్లు చల్లగా హాయిపడును,
చూచుచుందుము నీ వట్లె సుందరీ! స
రే—

* * * *

ఇందుకా నా కమృతభాండ మందకుండ
ముం దపహరించి తీవు, పూర్ణేందువదన?
దీనికై రేబవల్లు యత్నించి యెటులో
కడకు నిను జేరగల నను కరుణవలన?

ఏను వృద్ధుడనై పోదునేమొ, అమృత
మొల్లనో అప్పటికి, తద్వియోగ వహ్ని
పాపచిహ్నాలతోడనే భస్మ మగుదు
నో భవద్దర్శనానర్హతాభయమున—

ఎట్టులౌనో యెరుంగనే, యిందువదన!
కఠినచిత్తము కాలమ్ము గడిచిపోవు,
నేడె కలిగింపరాదటే నిన్ను గలియ
వచ్చు నన్నరవంత విశ్వాసమేని?

* * * *

ఈసుగంధప్రసవమాల వేసికొనుము
వైదలీ! నీగళ మ్మహఃప్రభలు జిమ్మ:
దరియ దపు డస్మదీయనేత్రద్వయమ్ము
దూరముగ నిల్చి నీకు జోహారు లిడును.

అంత, లలితమ్ముగా మందహాస మొకటి
నీపవిత్రాననమ్మున నిలువనిమ్ము:
మందగమనము వీడి నామానసమ్ము
పొంగి ముల్లోకముల భవన్మూర్తి నిలుపు.

ప్రణయపరిపూర్ణమగు నొక్క పలుకు పలికి
ఐక్య మయిపొమ్ము నీవు నా అంతరాత్మ:
అపు డనంతజీవభ్రాంతి నావహించి
ప్రజ్వరిల్లు నీ ఆత్మ విరావవహ్ని.

* * * *

ఇవి సుఖస్వప్నములు నాకు సృష్టికర్త
యెంచలేనన్నిగా ప్రసాదించినాడు,
వీనిలో విహరించి జీవింపు మనియె,
ఇవి యథార్థస్థితిని లభియింప వనియె;
వీనిలో నీప్రణయ మొండు వేరుజేసి
దానినే జపియింతు నిత్యత్వ మెరిగి
ఈతపోదీక్ష కదియె లభించునేని,
ఏమనును చెప్ప మప్పుడు సృష్టికర్త!

* * * *

నేను పూదోట కీనాడు పోను, నిజము;
త్రాచుపగవోలె సంపెగతావి యిటులు
తానె నాపయి దండెత్తబూనె నకట,
ఈహృదయరాగ మెంత హరించునో యిది!

ఏల పుట్టినదే యిట్టి పూలతావి:
నీకొఱకు స్వచ్ఛముగ నేను నిలుపుకొన్న
అంతరంగరాగము కొంత అపహరించు
నీవులేని కొఱతదీర్ప నేర్తు ననుచు—

అక్కటా, నీవె నాజీవితాధికారి
ణివిగదే, యేల యేతెంచి నిలుపుకొనవు?
భవదమోఘ ప్రణయగంధబాణ మొకటె
పట్టరానిసంపెగతావి పారదోలు.

* * * *

నేను వీరుడనై ధారుణీవిలాస
బంధములు త్రెంచుకొని మోక్షపథము బట్టి
జీవకోటికి మార్గదర్శి నగువాడ
నని యొనర్చినశపథ మేమయ్యె నిపుడు?

నేడెటులు మారిపోతినో చూడవే, భ
వత్పదసరోజపూజకై ప్రాణమేసి
ఇచ్చివేయుదు ననుచు నర్థించుచుంటి,
జీవులను మోక్షమును మరచితిని చెలియ!

ముక్తి లభియించు ననిన సమ్మోదమెంతొ
నీవు లభియింతువనిన నంతేముదమ్ము,
ఈయవస్థలు రెండు భావించి యిటులు
బాధపడుచుంటి కర్తవ్యబోధలేక.

* * * *

కట్టతెగిన ప్రవాహమ్ముగతి, సతీ, మ
దీయహృదయమ్ము చించి యేతెంచు దుఃఖ
మిటులు గీతమ్ములగు, ఫలమేమొ యెరుగ:
ఇమ్మహాసృష్టికిని ఫల మేమొ యెరుగ.

ఇంతలో చీకటులు వెల్గు లింతలోనె
క్షణములో ప్రళయములు భూకంపములును,
ఎరుగరాదు ప్రయోజన మించుకంత
ఇంతటి విచిత్రమగు జగత్సృష్టియేల?

నిష్ఫలమ్మగు సృష్టిపై నిలిచియున్న
నవ్యము ననంతమైన సౌందర్యమట్లు
జీవితేశ్వరి! నాదుఃఖభావరేఖ
దివ్యవర్ణ మొకటి నీవు దిద్దినావు.

* * * *

పండువంటివెన్నెల యెట్లు మండిపోవు
చున్నదో చూడవే నేడు, నిన్ను దలచు
కలత పంచేంద్రియమ్ములు నిలిచిపోయె,
మధురఫలరాశి విషమయ మయ్యె నకట.

దేవి, హృదయము బ్రద్దలై దిక్కులెల్ల
తేరిపారజూచెద శూన్యదృష్టితోడ
నీనమాగమ మిక లేదనే స్వనమ్ము
దిశలు నిర్దయరీతి ప్రతిధ్వనించు.

ఇక వదలిపోని దొక్కటే, హృదయరాజ్ఞి!
ఆశయను నీవుపంపిన ప్రాణమిత్ర
మండమై కొండవోలె ధైర్యమ్మొసంగు
జీవిత మనంతమను మోహ మావరింప:

ఎన్నడో ఒకనాడు నాహృదయగీతి
నీచెవిని జేరు లోకమ్ము నిర్జితమగు
ఇచటివిషమెల్ల నమృతమై, యెండలెల్ల
వెన్నెలలు గాయునని చెప్పుచున్నదిపుడు.

* * * *

నీతనువు కేతకీపల్లవాతికోమ
లమ్ము నందనసౌరభాలంకృతమ్ము,
ఇట్టినీపయి గాలి నాహృదయసీమ
పట్టపగ్గము లేని తుపాను రేపు;

ఎగురవైచి నాప్రాణమ్ము నెందుటాకు
చందమున, మానవులదృష్టి కందరాని
సత్పథమ్ముల నాడింపజాలునే మొ
ఇచ్చవచ్చినతీరున నీతుపాను.
నీశరీర పరిమళమ్ము రాశియైన
మారుతతరంగముల మయిమరచినపుడు
దొరకినవి సత్పథమ్ములో దుష్పథమ్ము
లో లవమ్మె నెరుంగరాదే, లతాంగి.

*    *    *    *

నీరమణీయమూర్తి, తరుణీ,
కనరాదని ఆశ వీడుచు
న్నారు ప్రజల్, త్వదీయసుగుణప్రభ
మామకనేత్రమేనియుఁ
దేరియు చూడరా దకట,
దృక్పథవర్తిని వీవు నా కిటుల్,
వీరికి నీచరిత్ర వినిపించుట
యెట్లిక చెప్పవే సఖీ?

*    *    *    *

బంగరునాణెముల్ గల
ప్రవాహము నాకొకవంక బారు; వే
దాంగరహస్యసాధన
సుఖామృత మింకొకవంక బారు; నీ
మంగళమందహాసరుచి
మధ్యగతిఁ బ్రవహింపజూచి ఉ
ప్పొంగి యిదే నిధాన మని
మున్గ ని దేటికి నామన మ్మిటుల్?

*    *    *    *

రాల శయించి అశ్రువులు
రాల్చుచు కాలము వెళ్లబుచ్చు గో
పాలుడ, నీపొలాల నడుమఁ
వెలలేని కడానితూగుటు
య్యాల లభించు నంచు
కలనైన దలంతునె వింతవింత వే
షాలకు మూలమైన
దొరసానివి నీదయ లేకయున్నచో?

*    *    *    *

ఏనిక కానికాలము గతించె
నటం చెద సంతసించుచు
న్నాను, చెలీ, గతించిన
దినమ్ములు లెక్కకురావు లెమ్ము; నా
కీ నవడోలికావిహారణేచ్ఛయె
స్వర్గసుఖమ్ము; దీనిపై
మానవకోటి నీ మధుర
మార్గము జేరగ నూచిపోయెదన్.

చెన్న రాజధానియందు 1934-వ సంవత్సరము ఏప్రిల్ ప్రారంభము మొదలు జూను తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

155

## ఆరోగ్యశాస్త్రము

స్వస్థవృత్తము అను ఆరోగ్యశాస్త్రము — డి. సూర్యనారాయణశర్మ

## కథలు — ఐతిహాసికములు, పౌరాణికములు

అర్జునుడు—యం. సీతారామరావు

కుచేలోపాఖ్యానము—(ప్ర) ఆర్యన్ బుక్ డిపో, రాజమహేంద్రవరము

## —కల్పితములు

అరేబియన్ నైట్సు కథలు — (ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము

కాశీరామేశ్వరమజిలీకథలు—పురాణంపిచ్చయ్యశాస్త్రి

## కల్పములు

భారతసమాజీయ నిత్యపూజావిధానము—(ప్ర) భారత సమాజ్, అడయార్

సత్యనారాయణవ్రతం — (ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో., మద్రాసు

## కావ్యములు

కొండవీటివిజయము—బి. మల్లయ్యశాస్త్రి

## గణితశాస్త్రము

ఆరంభగణితము—పి. వి. శేషుఅయ్యార్, వి. వెంకటసుబ్బయ్య

పసిడికాలపు గణితము—టి. యన్. రాఘవఅయ్యార్

## గేయములు

ఆత్మతత్త్వవేదాంతకీర్తనలు—పి. మునిస్వామి

ఆత్మారామతత్త్వామృతము—యస్. వరదదాసు

కనకవల్లిపాటలు—(ప్ర) కె. సీతారామయ్య, కడప

కలియుగ కలికాల వినోదచిందు—ఎ. నరసింహదాస్

కామమ్మకథ—(ప్ర) యం. వి. రుద్రయ్యనాయుడు, తిరుపతి

గోవిలాపము—జి. ఇందుమతిదేవి

గ్రామఫోను ప్లేటులలో పాడిన నూతన నవీన నాగరీక పాటలు, పద్యములు—(ప) యం. వి. రుద్రయ్య నాయుడు, తిరుపతి

దేశింగురాజుచరిత్రము — (ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో., మద్రాసు

నవకుంజరాంతక చిన్మయరహస్యార్థ తత్త్వమృత్యుంజయము—యం. వెంకటదాస్

నూతన గ్రామఫోనుపాటలు — (ప్ర) జి. పుల్లయ్య, కడప

నూతనగ్రామఫోన్ హాస్యంపాటలు — (ప్ర) డి. వి. గుప్త, విశాఖపట్టణము

పాండురంగ భజనకీర్తనలు — (ప్ర) ఆర్. వెంకటరత్నం, బెజవాడ

పాండురంగ భజనకీర్తనలు—యస్. సుబ్రహ్మణ్యం

పాటలు—కె. సత్యనారాయణశర్మ

ప్రణవనాదామృత రసతత్త్వకందాలంకారదరువులు — యన్. లింగరాజయోగి

భజనకీర్తనలు—సుబ్బరాయ కవిసోదరులు

శుద్ధనిర్గుణతత్త్వకందార్థములు, దరువులు — భ. కృష్ణదాస్

శ్రీకృష్ణుని జననము — (ప్ర) యం. సత్యనారాయణ, కాకినాడ

శ్రీపాండురంగబృందావనభజనకీర్తనలు — (ప్ర) జి. పుల్లయ్య, కడప

శ్రీపాండురంగవిఠల్‌భగవాన్ భజనకీర్తనలు, భా. 1, 3 —(ప్ర) టి. రామకృష్ణయ్య, చిలకలపూడి

---

* ఈపట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## చరిత్ర (దేశ)



## చట్టము



## జీవితములు



## నవల



## నాటకములు



## నీతి



## పరిశిష్టము

తిరుపతిగంగజాతరపచ్చవేమపుకథ—కె. మునిరత్నం
తేనెచినుకులు—నాళం కృష్ణారావు
దూదేకుడు—ఏ. కామేశ్వరరాయకవి
దేవీవాచకము, తరగతి ౨—డి. సూర్యనారాయణ మూర్తి, ఏ. శేషాద్రిశాస్త్రి, టి. తిరుమలరావు నాయుడు
నవగ్రహచింతామణి — (ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో., మదరాసు
నూతనపద్ధతి ఆంధ్రవాచకము, తరగతి ౫ — ఏ. వి. నరసింహంపంతులు
పురుషార్థములు—డి. గోపాలకృష్ణయ్య
ప్రారంభోపన్యాసము—(ప్ర) పి. పెద్దిరాజు, తెనాలి
భట్టిప్రోలు తూనుగుంటవారివంశచరిత్ర— (ప్ర) కాశీ సేవాసంఘము, భట్టిప్రోలు
భారతదేశమున గురువాదము—వేదానందస్వామి
భారతవర్ష పునర్నిర్మాణము—వేదాంతస్వామి
భావనామసంవత్సరవర్షచర్య అర్ఘ ఫణి — జె. సత్య నారాయణశాస్త్రి
బొమ్మల బాలశిక్ష—(ప్ర) వెంకటరాం అండ్ కో., ఏలూరు
మాతృభూమి—డి. పరిపూర్ణయ్య
రంగూన్ మజా—అబ్దుల్ కరీంసాహెబ్
రంధ్రాన్వేషికి గారుడమహామంత్రప్రయోగము—(ప్ర) పి. పెద్దిరాజు, తెనాలి
వయోజనవిద్య—యస్. సుబ్బరావు
వర్తకమర్మములు—పురాణం పిచ్చయ్యశాస్త్రి
విలయమాధుర్యము—డి. రాజశేఖరకవి
వివేకవతికథలు—(మిసెస్) మార్లర్
వేణీవాచకము, తరగతి ౧, ౨—వి. వేణీశ్వరరావు
వేయిస్తంభాలగుడి శాసనము—కే. అప్పన్నశాస్త్రి
వైజయంతి—సి. సరస్వతిదేవి
వైశ్యవిద్యాభానూదయము—(ప్ర) యు. వెంకటేశ్వ రులు, మచిలీపట్నము
శ్రీకృష్ణ గీతివ్రాతము—శ్రీ విక్రమదేవవర్మ
శ్రీ భజన రామాయణము—(ప్ర) శంకరశర్మ, పత్తి కొండ
శ్రీరామదండు—డి. గోపాలకృష్ణయ్య

## పురాణము

చెన్నబసవ పురాణము—పి. నాగభూషణరావు

## ప్రకృతి శాస్త్రము

ఎలిమెంటరీ సైన్సుపాఠములు, తరగతి ౫—యం. ఎస్. సుబ్రహ్మణ్యం.
ప్రకృతిశాస్త్రవాచకము సెం, ౫. వి.—వరాహ నర సింహం
శాస్త్రవాచకము ఫారం ౨—యం. అబ్దుల్ కరీమ్

## భూగోళ శాస్త్రము

కాళహస్తి జమీను భూగోళశాస్త్రము—పి. కె. నారా యణ అయ్యంగారు.
పలమనేరితాలూకాభూగోళము— పి. కె. నారాయణ అయ్యంగారు
ప్రపంచభూగోళము—పి. సూర్యనారాయణ
భూగోళశాస్త్రము— (ప్ర) ఇండియన్ పబ్లిషింగ్ హౌస్ లిమిటెడ్, మద్రాస్
మొదటిభూగోళము —యం. సీతారామరావు
వాయల్పాడుతాలూకా భూగోళశాస్త్రము—పి. కె. నారాయణఅయ్యంగారు

## మతము — హిందు

ఆరువ్రతాలు— (ప్ర) యన్. వి. గోపాల్అండ్ కో., మదరాసు
కపిలదేవహూతి సంవాదము — (ప్ర) రామకృష్ణ పూజామందిరము, గుంటూరు
నాయుద్యమపద్ధతి—వివేకానందస్వామి
నారదభక్తిసూత్రములు— (ప్ర) శ్రీరామకృష్ణపూజా మందిరము, గుంటూరు
యల్లాజీయం—(ప్ర) పి. త్యాగరాయశెట్టి, మదరాసు
వైశ్యలఘు సంధ్యావందనము — (ప్ర) ఏ. సుబ్బరావు గుప్త, బెజవాడ
హరివాసరము—కె. వి. రామానుజాచార్యులు

## —ఇతరములు

అవతారము—(ప్ర) లిటరేచర్ కమిటి, ఆంధ్ర ఎవాం జెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
అవర్ణనీయమైన క్రైస్తవమాతృత్వముద్వారా క్రైస్తవ నాయకత్వమునకైన తర్బీయత్—గ్రేస్ జోషి
ఉత్తరించు ఆత్మలయొక్క స్మరణమాసము — (ప్ర) రెవరెండ్ చ. ఆలన్, నెల్లూరు

పదియాజ్ఞలు—(ప్ర) హేన్రి జె. సడ్డర్, పలమనేరు
పాపవిమోచనరక్షకుడు—(ప్ర) హెన్రి, జె. సడ్డర్, పలమనేరు

## మంత్రశాస్త్రము

గాయత్రీమంత్రార్థవివరణము—ప్రణవానంద

## వేదాంతశాస్త్రము

ఉపదేశసాహస్రి—శ్రీ శంకరాచార్య
గీతాప్రబోధము—ఆర్. వెంకటహనుమయ్య
నిష్కామయోగము—(ప్ర) డి. పుల్లయ్య, గుంటూరు
భజగోవిందము—(ప్ర) సి. సత్యనారాయణశర్మ, చినకొండకుండ్ల
బ్రహ్మజ్ఞానరసాయన పంచీకరణవచనము — శ్రీరామకృష్ణానందస్వామి
బ్రహ్మానందము—స్వామిరామతీర్థ
యోగసంకలనము—అరవిందఘోష్
శ్రీమద్భగవద్గీత—జె. రామచంద్రరావు, రామచంద్రపురం
సత్య ఆనందబోధ అను గురుశిష్యసంవాదము—సి. వెంకటరామరాజు
సంయమనీపురం హైకోర్టు వేదాంత విచారణ సివిల్ కేసు ౧,౨ వ ఇష్యూలు—సత్యధ్యానతీర్థశ్రీపాదులు

## వైద్య శాస్త్రము

సన్నిపాతజ్వరము—డాక్టరు రాజకుల సూర్యనారాయణరావు
సర్వవైద్యవిజ్ఞానము, భా. ౩-౪—సోమయాజిశాస్త్రి
సారూప్యావధశాస్త్రము—డాక్టరు యల్. రామారావు

## వ్యాకరణశాస్త్రము

చిన్న వ్యాకరణము తరగతి ౫—యస్. సూర్యనారాయణమూర్తి

## శతకములు

ఓంకార శివలింగశతకము—బల్లె వెంకన్న
చెన్నకేశవ శతకము—జి. కృష్ణమూర్తి
బెజవాడ కనక దుర్గాంబ శతకము, గ్రహరాజ శతకము—యస్. లక్ష్మీనరసింహరాజు.
నరసింహ శతకము—భ. వీరరాఘవరావు
శతకరత్నాకరము—ఎ. భూపతికవి, ఏ పెద్దయ్యకవి
శనైశ్చర శతకము—వి. జానకిరామమూర్తి
శ్రీదీనకల్పద్రుమశతకము—జి వీరరాఘవశాస్త్రి
శ్రీమహాత్మాగాంధిశతకము—డి.యల్.గంగాధరశ్రేష్ఠి
శ్రీరామమంత్రార్థశతకము—ఒ. నారాయణప్ప
శ్రీరామరామశతకము—టి. వెంకటప్పలరాజు
శ్రీవెంకటేశ్వరశతకము — వి. సూర్యనారాయణశాస్త్రి
సద్గురుమూర్తిశేఖరశతకము — పి. వెంకటనరసింహారావునాయుడు

## స్తోత్రములు

అంబాసువర్ణమాలా—ఆర్. నరసింహశాస్త్రి
గోపికాగీతలు—(ప్ర) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు
దేవకీనందనతారావళి—భ. సీతారామశర్మ
నవగ్రహస్తోత్రం, నారాయణకవచము— (ప్ర) జి. పుల్లయ్య, బళ్ళారి
ముకుందస్తవరాజము—ఏ. కామేశ్వరరాయకవి
యాగంటీశ్వరగాయత్రీమాల—వి. జానకిరామమూర్తి
శ్రీకృష్ణాష్టోత్తరశతనామావళి — భట్టరాజు రామకృష్ణయ్య
శ్రీప్రార్థనరత్నములు—(ప్ర)వి.శంకరశర్మ,పత్తికొండ
శ్రీ ముకుందమాలా—(ప్ర) యన్. సి. స్వామి అండ్ సన్స్, మదరాస్
శ్రీరామధ్యానము—(ప్ర) పి. త్యాగరాయశెట్టి అండ్ సన్స్, మదరాస్
శ్రీ శివధ్యానము—(ప్ర) త్యాగరాయశెట్టి అండ్ సన్స్, మదరాసు
శ్రీ సువర్ణమాలాస్తోత్రము—శంకరాచార్య

## హరికథ

చిరుతొండ నంబిచరిత్రము, హరికథ—యం. గురుబ్రహ్మశర్మ

---



M. V.

గోవిందరాజస్వామి దేవాలయము, కొలను - తిరుపతి

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు



(యువసంవత్సర కార్తిక-మార్గశీర్ష మాసములు)

ఉత్తరము




దక్షిణము

[ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను. ఇందున్నట్లు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| డిసంబరు | 8 | తేదీని | రాత్రి | 8-50 గంటలకును, | డిసంబరు | 15 | తేదీని | రాత్రి | 8-22 గంటలకును | నక్షత్రాదులు |
| ,, | 22 | ,, | ,, | 7-54 ,, | ,, | 29 | ,, | ,, | 7-28 ,, | కనబడును.] |
| 1936 జనవరి | 5 | ,, | ,, | 7- ,, | | | | | | |

And vivid moons and stars that keener play with doubled lustre from the glossy world.

(హిమపాతముచే) తళతళలాడు భూమ్యుపరి భాగమునుండి ప్రతిఫలితమై ద్విగుణీకృతమై తోచు రమ్యతర తేజముతో మెఱయు నక్షత్రకోటులతోను, దినదినము స్వచ్ఛమై ప్రకాశించు చక్కని చంద్రబింబముతోను కూడుకొని ఈ రాత్రులు మిక్కిలి శోభాయమానము లగుచున్నవి.

ఈ డిసెంబరు 8-వ తేదీమొదలు 1936 సంవత్సరం జనవరి 8-వ తేదీవఱకు రాత్రితొలిజామున తోచు ఖగోళదృశ్యము నారయుదము.

## (The Milky Way)

## పాలవెల్లి

Vision of Beauty ! there floats not a cloud over the blue vanet of Heaven thy glory to shroud. The star-gemmed horizon then spannest sublime, Like a path to a better and lovelier clime.

సౌందర్యదృశ్యమా ! నీకాంతి మందముచేయు మేఘములిపు డడ్డురాకుండుటచేత వినీలాకాశమున నీదగు సంపూర్ణతేజముతో నీవిపుడు ప్రకాశించుచు రమణీయతరమైన ఉత్తమలోకమునకు మార్గ మిదిగోనని చూపుచున్నట్లు నక్షత్రరత్నభూషితమై తేజరిల్లు దిక్చక్రమునకు ఒకకడనుండి మరొకకడకు వారధినిర్మించినట్లున్న నీమహనీయస్వరూపముచే నేత్రపర్వము చేయుచున్నావు.

ఈ మాసమునందు ఈ రమ్యదృశ్యము తూర్పుకొననుండి పడమటిసమీపపు వాయవ్యదిశకు పైనివర్ణింపబడినట్లు ధనురాకృతితో వ్యాపించియున్నది. శ్వాన-పూర్వశ్వానముల మధ్య చిన్న సెలయేటివలె సన్నమైయున్న యీ పాలవెల్లి వాయవ్యమునకు పోవుకొలది విస్తరించుచు ఆర్ద్ర, పునర్వసు నక్షత్రములమధ్యగా వెడలి మరల సన్నగిలి, సారథిమండలమును భేదించుకొని పోవుచు మరల విస్తరించి, భృగుపరశుమండలమును గడచి దేవాంగనలం దగుపుచు, ఊర్వశీపురూరవసుల స్పృశించి, శ్యామసీమలం జేరి, రెండుపాయలై పడమటకు వ్రాలుచున్నది. ఆపాయలమధ్య ఛాయాపథము స్ఫుటమగుచున్నది.

### First Magnitude Stars.

తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రము లీమాసపు తొలిజామున తొమ్మిదిమాత్ర మగపడుచున్నవి. అవేవి యనగా:—

1. పడమట అస్తమింపనైయున్న గరుడమండలములో శ్రవణము. (Altair in Aquila).
2. నైరృతిదిశనుఇంద్రద్యుమ్నుడు.(Fomal-haut-సోమలో.)
3. శంతనుడు. (Acherner.)
4. రోహిణి. (Aldebaran.)
5. రిగెల్. (Rigel)
6. ఆరుద్ర. (Betelgeaux.)
7. బ్రహ్మహృదయము. (Capella in Auriga)
8. మృగవ్యాధుడు. (Sirius)
9. పూర్వశ్వానము. (Procyon.)

### గ్రహములు

శని శతభిషమందే యున్నాడు. కుజుడు ఈ మాసమున శ్రవణ, ధనిష్ఠ నక్షత్రములలో సంచారము. (గురుడు జ్యేష్ఠలోనుండుటను ఇపుడు కానరాడు. శుక్రుడు గురుని సమీపించుచు, స్వాతి, విశాఖ, అనూరాధ నక్షత్రములలో సంచారముచేయుచున్నాడు. గురుశుక్రులాహేతువుచేత సాయంకాలము కానరారు. సూర్యోదయమునకు పూర్వము తూర్పున కానరాగలరు.)

### ఉత్తరమున

నరకు డించుమించుగా అస్తమించినాడు. ధ్రువు డించుమించుగా నభోమధ్యరేఖ నున్నాడు. చిన్నఎలుగు

పడమటకు వ్రాలియున్నది. తోకచివర ధ్రువుడును, తోకలో కశ్యపమహేంద్రాగ్నులును, మిగిలిన శరీరములో మిత్ర, ధాత, విధాతనక్షత్రములును మెఱయుచున్నవి. ధ్రువునికెగువ ఊర్వశీపురూరవసులు పాలవెల్లిలోనికి వ్యాపించియున్నారు. ఈశాన్యవాయవ్యముల యందీసమయమున నక్షత్రములు లేక, ఆప్రాంతములందు ఆకాశము ఖాళీగా కనబడుచున్నది.

### పడమట

శ్రవణము అస్తమింపనైయున్నది. దాని కీవల ధనిష్ఠయున్నది. నైరృతిదిశను కుంభమును అస్తమింపనైయున్నది. ఆక్రిందను ఇంద్రద్యుమ్న మహారాజు తనమిత్రులగు నాళీకజంఘబకము, ప్రావారకర్ణఘూకము, యుగంధరకమఠములతో మెఱయుచున్నాడు.

### దక్షిణాకాశమున

వల (Reticulum) శరావి మండలములును, ఎగువ యమునప్రక్క శంతనుడును, వీరలకు పడమట అద్రికయును కలరు. అద్రిక ఉపరిచరవసు వీర్యము గ్రహించినది. ఉపరిచరవసునుపాశ్చాత్త్యులు "Coelem" అందురు. Coelem అనగా Sculptors' tools ప్రతిమాశిల్పియొక్క పరికరములు అని కొందరు అర్థము చెప్పుచున్నారు. కాని అది సరికాదు. Coelum అను లాటిన్ పదమునకు స్వర్గము అనికాని, ఆకాశము అనికాని (Heavens) అర్థముచెప్పుట ఉచితము. చూడుడీలాటిన్ వాక్యమును Fiat justitia ruat Coelum.- Let justice be done even though the Heavens Fall-మిన్ను విరిగి మీదపడిననూ న్యాయమే చేయవలెను. కాబట్టి Coelum అనగా Heavens-మిన్ను అని అర్థముచెప్పుట సరియగును. మింటవిమానముతో సంచరించువాడు కావున ఉపరిచరవసుఅయ్యెను. ఆతనివీర్యము మ్రింగిన అద్రిక వలబడి మానుషప్రసవంబగుట లోనగు విషయములు భారతప్రసిద్ధములు.

### తూర్పున

పునర్వసు ఉదయమైనది. పునర్వసుచుక్కల రూపము పలువురు పలువిధముల వర్ణించిన సంగతి మన మీవరకు చూచినాము. ధనుస్సువంటి రూపమని కొందరును, నౌకాకారమని కొందరును తెలుపగా, శ్రీనాథుడు ఆ చుక్కలు పోకచెట్టునకు వ్రేగిలిన ముత్యాలహారమని వివరించెను. వాల్మీకి శ్రీమద్రామాయణములో సీతాసందర్శనముచేసి లంకకాల్చివచ్చు హనుమంతుని నౌకతో పోల్చుచు, ఆకాశమును సముద్రముగా వర్ణించుపట్టున చంద్రుని, మరికొన్ని నక్షత్రములను ఇట్లువర్ణించినాడు:-

"సచన్ద్రకుముదం రమ్యం సార్కకారణ్డవం శుభమ్, పునర్వసుమహామీనం లోహితాఙ్గమహాగ్రహమ్. ఐరావతమహాద్వీపం స్వాతీహంసవిలోలితమ్ ..."

పునర్వసు మహామీనమని వాల్మీకి వర్ణించినాడు. రామాయణమునందు పెక్కుచోట్ల వాల్మీకి ఖగోళసంబంధమైన ఉపమానములు చక్కగా రచించినాడు. నక్షత్రవేధచేయువారీ ఉపమానముల సాదృశ్యమును గ్రహించి మిక్కిలి సంతసింతురు. గొప్పచేపవంటి ఆకారముగల పునర్వసు ఇప్పుడే ఉదయించినది. అది 'భోగికంకణు తలపూలదండ' అనికొందరు కవులు వర్ణించిన ఆకాశగంగాప్రవాహము ఒడ్డుననున్న పెద్దచేపవలె మనకు కానవచ్చుచున్నది. ఆ ప్రక్కనే పూర్వశ్వానమును, పూర్వశ్వానమునకు దక్షిణముగా మృగవ్యాధుడును ఉన్నారు.

### మధ్యను

'నభో రమా వక్షోజ హారలతిక' అని కవులచే వర్ణింపబడు పాలవెల్లి తూర్పుఉత్తరదిశలకు వ్యాపించి నభోరంగమును చక్కగా విభజించుచున్నది. అందు ఉత్తరభాగముననున్న ౧/౩ పాలునందుగల నక్షత్రముల నారసితిమి. మిథునమునకు ఈవల సారథిమండలములో బ్రహ్మహృదయము ఎంతో చక్కగా మెఱయుచున్నది. ఈశాన్యమున విఘ్నేశ్వరుని మూషకము మించుకకనబడుచున్నది. ఇక మధ్య నక్షత్రముల నారయుచో పాలవెల్లినంటుచు పడమటగా మృగశిరస్సుతోను, ఆర్ద్ర, పరివృక్త అను బాహువులతోను, గొల్లకావిడి పటకాతోను, అటనుండి వ్రేలుఖడ్గముతోను, రిగెల్ పాదముతోను జగముమ్రింగ నప్పళించునట్లు వృత్రుడు ఉద

యమయి ప్రకాశించుచున్నాడు. వానిధాటి కోడి ఇంద్రాదులు (జ్యేష్ఠ మొదలగు నక్షత్రములు) మరుగు పడినారు. రిగెల్ సమీపమున జనించిన ట్లగపడుయమున ఎన్నో వంకలు తిరిగి దక్షిణమునకు పోవుచున్నది. రిగెల్ దిగువ క్రమముగా శశకపోతములు కలవు. మృగశిరకు పడమట ఎద్దుకన్నువలె రోహిణి ఎఱ్ఱగా మెఱయుచున్నది. రోహిణికెగువపాలవెల్లిలోనే అగ్ని-బీటా B.Taurus- ఉన్నది. దానికి పడమట 'పూచినకొఅవి పూవు'లట్లు కృత్తిక చుక్కలు మిలమిలలాడుచున్నవి. కృత్తికలకు ఉత్తరముగా భృగుపరశుమండలము పాలవెల్లిలోనికి వ్యాపించినది. ఆ దిగువ గ్రుడ్లుమిటకరించుకొనుచు పులోమరక్కసుడును, పులోమునికి పడమరగా ఇంద్రమద ఉత్తరాభాద్రకు వ్యాపించినది. అశ్విని నభోమధ్యరేఖపై నించుమించుగా నున్నది. అశ్వినికితూర్పుగా భరణియు, పడమరగా ఉత్తరభాద్రాదు లునున్నవి. దిగువ శింశుమార మున్నది. అశ్వినుల కొకప్రక్క వృషభమును, రెండవప్రక్క శింశుమారమును ఉండి వారిరథమునకు వాహనములై లాగుచుండుట గగనమధ్యమున నిపుడు చక్కగా చిత్రింపబడినట్లు కానరాగలదు. పులోమ భీతయైన ఇంద్రమదయొక్క గర్భచ్యుతిచే జనించిన చ్యవనుడు అశ్వినులపై నున్నాడు. పేద్యఘాశ్వము(Pegasus) చతురస్రమునకు దక్షిణముగా నొకటియు, ఉత్తరభాద్రకు తూర్పున నొకటియు- మత్స్యద్వయం - రెండుచేపలును మీనరాశిలో మెఱయుచున్నవి. శింశుమారముదిగువ ఘంఘుడు సముద్రవాలుకాపులినతలమున జ్వాలామయుడై యున్నాడు.

## పరమక్షయ దినము

సంవత్సరమంతలో తక్కువ పగలున్న దినము ఈ మాసములో డిసెంబరు ౨౧ తేదీ అయియున్నది.

## ఉల్కలు

కుఱుచలు, వేగవంతములు నైన చిన్నఉల్కలు డిసెంబరు ౧౪ వఱకు పునర్వసు సమీపమునుండి రాలును. చిన్నఉల్కలు సప్తఋషిమండలములో ౧౯-౨౨ తేదీలను, నరకునిలో ౨౯ తేదీవఱకును రాలును.

# * శ్రీరామకృష్ణలీలామృతము

'హంసపోతము'

పుట్టినదా వంగదేశములోని యొకమాఱుమూలపల్లెటిసీమ! కుటుంబమా బీదబ్రాహ్మణకుటుంబము! పాండిత్యమా బహుస్వల్పమైన వంగభాషాజ్ఞానమే కాని సంస్కృతాంగ్లములందు వర్ణక్రమమైనను తెలియదు! ఉద్యోగవైభోగమా చెప్పనక్కరలేదు; సామాన్యముగా జననిరసనమునకు గుఱియై లోకోక్తుల లోనికిఁగూడఁ బ్రాఁకిన నంబిపని! బిరుదములా, 'ఖాన్‌బహదూర్', 'దివాన్‌బహదూర్', 'కవిసార్వభౌమ', 'తర్కకేసరి' మొదలగు నామబహుమానములు గాని, స్వర్ణ,రజతపతకాది వస్తుబహుమానములుగాని యేవియు లేవుసరికదా 'పిచ్చిపూజారి' యనుముద్దుపేరు వరరత్నమాణిక్యమై తలకు బాగుగా అమరినది! శరీరదార్ఢ్యమా, తఱచుగ అజీర్ణవ్యాధికి లోనై బాధపడుచుండు కోమలగాత్రము! ఈ సామాన్యమానవుఁడు తాను బ్రతికియున్నకాలములో వంగదేశవిద్యాధికులే కాదు, కోటీశ్వరులేకాదు, సర్వప్రజలచేఁ బ్రత్యక్షదైవమువలె నారాధింపఁబడినాఁడు. ఇట్టివ్యక్తిపేరిట నొక మహాసంస్థ బయలుదేఱి, సనాతనధర్మవిజయధ్వజమును నవనాగరకతాదుర్గము లనఁదగు పాశ్చాత్యముఖ్యపట్టణములందెల్ల స్థాపించుచు ప్రపంచమంతట వ్యాపించుచున్నది; స్వదేశమందేకాక పెక్కువిదేశములందుఁ గూడ దేవాలయము లెన్నియో వెలయుచున్నవి; లక్షలాదిగ విలువగల స్థిరచరాస్తులు చేరుచున్నవి. ఇది యేదియో పుక్కిటిపురాణగాథకాదు. నేఁడు మనకండ్లయెదుట జరుగుచున్న యథార్థవిషయము. ఈ మహాద్భుతసంఘటనకుఁ గారణభూతుఁడైన యుగపురుషుని గాంధిమహాత్ముఁ డిట్లు ప్రశంసించుచున్నాఁడు. "ఈ మహనీయునిచరిత్ర చదివినతరువాత భగవంతుఁడే నిత్యము, తక్కినదెల్ల ననిత్యమను నిశ్చయమెల్లరకును గలుఁగఁగలదనుట సత్యము. రామకృష్ణులవారు మానవాకృతిని దాల్చిన దివ్యత్వము!"

ఇట్టిమహాత్ముని జీవితచరిత్ర శ్రద్ధతోఁ బరిశీలించి యందలి సారాంశమును గ్రహించుట బుద్ధిమంతులకెల్లరకు విధాయకధర్మము. బాలబాలికలకుఁగూడ సులభముగ నర్థమగు తేటతెనుఁగుమాటలలో ఈ చరిత్రానువాదమును బ్రచురించి, ఆంధ్రదేశమునకు మహోపకారమొనర్చిన చెన్నపురి శ్రీరామకృష్ణమఠ నిర్వాహకులెంతయుఁ బ్రశంసనీయులు. పుస్తకముతీరును, ముద్రణమును మిక్కిలిచక్కగ నున్నవి. అనువాదము సరళమై యొకనవలవలె పాఠకుల నూతనోత్సాహపరవశులఁ గావింపఁగలదని శ్రీరామకృష్ణులజీవితమనఁ బారమార్థికప్రజ్ఞాస్వరూపనిరూపణ మని చెప్పవచ్చును. భారతనాగరకతయొక్క విశేషము పారమార్థికప్రజ్ఞయందే కలదు. కేవలబుద్ధిబలముచే నవీనపాశ్చాత్యశాస్త్రజ్ఞులు కూడ నొప్పుకొనిన సర్వభూతాంతర్గతము, అవాఙ్మనసగోచరమునగుపరాశక్తి శాశ్వతత్వమును, సర్వాధిక్యమును, సర్వతంత్ర స్వాతంత్ర్యవిస్ఫూర్తిని కరతలామలకముగావించుకొని, తదనుగుణముగ జీవితమును గడపుటయే ఆర్యవిజ్ఞానలక్ష్యము. క్షణక్షణమును మార్పునొందుచున్న భౌతికసంఘటనలకెల్ల నాధారభూతమగు నేకైకసత్యముయొక్క అపరోక్షానుభూతియే భారతజాతీయమహాదర్శము. ఈసత్యమే భగవంతుఁడని, ధర్మ

---

* "శ్రీరామకృష్ణజీవితచరిత్ర" యను నాంగ్లగ్రంథమునకు అనువాదము. వెదురుమూడి కృష్ణరావు పంతులుగారిచే రచింపబడి, చెన్నపురి శ్రీరామకృష్ణ మఠమువారిచే బ్రకటింపబడినది. పు-878. డెమ్మీసైజు. వెల. రూ. 5-0-0 లు. వలయువారు 'మానేజర్' శ్రీరామకృష్ణమఠము, బ్రాడీస్ రోడ్డు, మైలాపురం, మదరాసు అని వ్రాయవలయును.

మని, పరాశక్తియని, విష్ణువని, శివుడని, అల్లాయనీ, పరబ్రహ్మమని వివిధమతములవారిచే వేర్వేఱురీతులఁ జెప్పఁబడుచున్నది. భక్తి, జ్ఞాన, కర్మాది యోగము లీ యాదర్శసిద్ధికి సాధనములు. వీనికెల్ల త్యాగమే పునాది. హైందవజీవితవిధానమెల్ల దేదీప్యమానమైన త్యాగసాధన యని చెప్పనొప్పు. పారమార్థికవిశ్వాసలోపమే భారతీయుల త్యాగజీవనమును గుంటుపఱచి,ధర్మపతనమునకు దారితీసి, జాతి నధోగతికిఁ దెచ్చినది. ఈలోపమును దొలఁగించి త్యాగాదర్శమును మరలఁ బ్రజాజీవితము నగా శ్రీరామకృష్ణధార్మికోద్యమమును దేశమందెల్లెడల వ్యాపింపఁజేయ సమకట్టెను. పరమార్థమును విస్మరించి, త్యాగజీవనము దగ్ధము గావించి, నానావిధభోగములఁ దగుల్కొని రాజకీయపరిణామములకై తగనిపరువు లెత్తుట భారతీయులకు నేల విడిచినసాము, ప్రాజ్ఞలోకమున నగుబాట్లకుఁ గారణమగును. సరియైన పునాది లేనిచో మహానిర్మాణము లెట్లు నిలువఁగలవు ?

మర్త్యుఁడమృతత్వమును సాధించుటకు త్యాగముకంటె వేఱొకమార్గ మేమియు లేదని వేదము లుద్ఘో



శ్రీ రామకృష్ణ దేవాలయము - బేలూరు మఠమువద్ద కట్టబడుచున్నది

(దీనికి ౭ లక్షల ధనము పట్టును. ఇందధికభాగము పాశ్చాత్త్యులచే నొసగబడెను.)

నందుఁ బ్రజ్వలింపఁజేయుటయే శ్రీరామకృష్ణుల పావన జీవితప్రయోజనము. ఇది జరిగినఁగాని భారతజాతీయ సముద్ధరణము సాధ్యము కానేరదు. తన గురుదేవుని యాంతర్యమును బాగుగ గ్రహించిన శ్రీమద్వివేకానంద స్వామి, మహోజ్జ్వలత్యాగజీవితమే భారతజాతికి తారకమంత్రమని బోధించి, ఆమంత్రసిద్ధికిఁ దగిన సాధ షించుచున్నవి. హైందవజాతీయప్రాణ మనఁదగిన త్యాగశీలము శ్రీదక్షిణేశ్వరసాధుపుంగవుని కాలమునాఁటికి మిక్కిలికొఱవడియుండెను. త్యాగము నీచయాచకవృత్తికి మాఱుపేరైనది. మానవజీవితసమస్యల నెదుర్కొనుటకు శక్తిలేక వెనుదీసిన నిష్ప్రయోజకులని, పాషాణహృదయులని త్యాగశీలురను లౌకికులు హేళన

చేయ నారంభించిరి. స్వమతవిశ్వాస శూన్యులై, హైందవవిద్యార్థులు పరమతముల స్వీకరింప నారంభించిరి. ముక్తిసామ్రాజ్యమును జూఱగొనఁజాలు త్యాగజీవనము పిడుగులుపడుచున్నను చలింపని మేరు గిరిసమానధైర్య సంపదగల శూరాగ్రేసరుల సొమ్ముకాని, భీరువులకుఁ గాదని ఋజువుచేయవలసిన సమయ మాసన్నమైనది. శ్రీబుద్ధభగవానుని, శ్రీశంకర, రామానుజ, మధ్వాద్యాచార్యపురుషులను, శ్రీచైతన్య,కబీరులవంటి భక్తాగ్రగణ్యులను గన్న భారతమాత యీసారి యారుజువును శ్రీరామకృష్ణులవారి దివ్యజీవితరూపమున మానవలోకమునకుఁ బ్రకటించినది. శ్రీవిశ్వేశ్వరీ సందర్శనమునకై పరితపించిపరితపించి, కన్నులు నిజముగా కాయలుగాచిఅహోరాత్రము లేడేండ్లు నిజమనోరథ మీడేరువఱకు నిద్రించియెఱుఁగని వజ్రసంకల్పుని ధీరోదాత్తుఁ డనుటకు సందేహమేల ? భగవద్దర్శనభాగ్య మెట్టివారికిఁ గలుగునో మహాకవిధూర్జటి యిట్లు చెప్పుచున్నాఁడు :

“ సంపద్వర్గముఁ బాఱఁద్రోలి, రిపులన్
జంకించి యాకాంక్షలన్
దంపుల్ వెట్టి, కళంకముల్ నఱకి, బంధక్లేశదోషంబులన్
జింపుల్ చేసి, వయోవిలాసములు సంక్షేపించి, భూతంబులన్
జెంపల్ వేయక నిన్నుఁగాన నగునా ?”

అనఁగా భగవంతునంతవారు కావలెనన్నమాట !

త్యాగశీలురు దయాశూన్యులు కారు. సర్వసంగపరిత్యాగుల యనన్యదివ్యశక్తివాహిని నిరంతరము మానవాభ్యుదయమునకే యెట్లు వినియోగమగుచుండునో శ్రీరామకృష్ణులవారి జీవితచరిత్రయందు కానవగును. ఈ యద్భుతపురుషుని పాదస్పర్శచే నిసుకయెడారులనఁదగు మనఃప్రపంచములు వెలలేని బంగారుపంటలతో ముద్దులుగులుకు నందనవనము లైనవి ; కఠినపాషాణహృదయకుహరములనుండి అమృతనదు లుద్భవించి ముక్తిపిపాసుల నెందఱినో తృప్తిపఱచినవి. అన్నవస్త్రములకు దూరులై చిక్కి యెముకల పంజరములుగా మాఱిన దీనులను జూచి కన్నుల నీరునించి “ నారాయణుని సేవింప గుడులకుఁ బోనేల ? కాశిమున్నగు తీర్థముల కరుగనేల ? ఈదీనుల రూపమున మీ ముంగిలిలో నిలిచి నారాయణుఁడే మీసేవల నర్థించుచున్నాఁడు. భక్తితో శిర్షములను వంచి వీరికి మీశక్తికొలఁది సేవఁజేసి, చిత్తశుద్ధిని బడసి తరింపుఁడు. పూటకి మొగమువాచిన నిరుపేదలకు వేదాంతబోధలవలన లాభమేమి ? ముందు వారి యాఁకలిమంట నార్పి పిమ్మట వారికి జ్ఞానోపదేశముఁ గావించెదరు గాక!” యని సోదరదేశీయులను హెచ్చరించిన విశ్వజనీనప్రేమమూర్తి శ్రీపరమహంస! కనుకనే “ఆత్మనో మోక్షార్థమ్ జగద్ధితాయచ (ఆత్మముక్తికిని జగత్కల్యాణమునకును మానవులు కృషిచేయవలయును)” అను మహావాక్యము నేఁటి శ్రీరామకృష్ణధార్మికోద్యమమునకెల్ల నాధారమై వెలయుచున్నది. ఈ యుద్యమము వ్యాపించుతావులందు జ్ఞానవికాసమునకు సాధనభూతములగు మఠములతోపాటు దీనసేవాశ్రమములుకూడ నెలకొనుట కిదియే కారణము.

భారతయువకుల నిరర్థకజీవితములను జూచి ఈ నిర్హేతుకజాయమానకారుణికమూర్తి తనగృహస్థశిష్యుల నిట్లు హెచ్చరించినాఁడు. “ పదునాలుగుపదునైదేండ్లు నిండీనిండకమునుపే బాలురకు పెండ్లిళ్లు చేయుచున్నారు. ఇరువది యేండ్లకే వారు పిల్లలతండ్రులై తమస్వల్పవేతనములతో కుటుంబమును పోషించుకొనఁజాలక కొట్టుమిట్టాడుచుందురు. పారమార్థికకృషి సల్పుట కిట్టివారికి వ్యవధి యెట్లుకలుగును, జవసత్త్వము లెక్కడనుండివచ్చును ? జాతి నిర్వీర్యమైపోవుచున్నది. ఇద్దఱుముగ్గురు శిశువులఁ గన్నపిమ్మట భార్యాభర్తలు సోదరీభావమువహించి తమజీవితములను బరమార్థసిద్ధికై గడపవలయును. గృహస్థాశ్రమము లోకహితార్థముగాని నీచపశువులవలె కామపరితృప్తి గావించుకొనుటకుఁ గాదు. పుత్రులయెడల తల్లిదండ్రులు నిర్వహింపవలసినధర్మమేమి ? పుత్రులు తమసొంతకాళ్లపై జీవింపఁగలుగునట్లు వారికి శిక్షణమిచ్చుటేకాని, పనిపాటులు లేక సోమరులై తమకును, సంఘమునకును ముప్పు దెచ్చికొనుటకు వీలగునట్లు లక్షలకొలఁదిధనమును వారికై

నిలువఁజేయుటకాదు. పశుపక్ష్యాదులను జూడుఁడు. అవి తమపిల్లలు స్వయముగ నాహారము సంపాదించుకొనఁగలుగువఱకే వానిని బోషించును. ఈ హితమును భారతగృహస్థులెల్లరు పాటించి తదనుగుణముగఁ బ్రవర్తించలేని సంఘమునం దెంతసౌష్ఠవమైన సంస్కారము జరుగునో విజ్ఞు లాలోచింపఁదగును. ఇఁక స్త్రీలవిషయమున శ్రీపరమహంసయభిప్రాయములను పరిశీలించెదము. బ్రహ్మచర్యమునం దేమి, పారమార్థికసాధనయం దేమి భారతనారీమణులకు పురుషులతో సమానమైన స్వాతంత్ర్యమిచ్చి, వేదకాలమునాఁటి వారి యౌన్నత్యమును పునరుద్ధరించిన అపరబుద్ధదేవుఁడని చెప్పవచ్చు శ్రీరామకృష్ణులను. వీరియుద్యమమున స్త్రీలకు ప్రత్యేకముగ మఠము లిప్పుడిప్పుడు బయలుదేఱుచున్నవి. వీనియందు శిక్షణముం బడసిన యోగినులు ప్రాచీనగురుకులపద్ధతుల ననుసరించి బాలికలకు విద్యగఱపుచుందురు. ఈ గ్రంథమున భక్తురాండ్రనుగూర్చిన యధ్యాయమును శ్రద్ధతో నాంధ్రనారీమణులెల్లరును పఠింతురుగాక! భావిభారతసంతతికి త్యాగబుద్ధి నుగ్గుపాలతోఁ బోసి బ్రహ్మచర్యాదివీరగుణములను వారియందు బెంపుచేసి నూతనజాతిని నిర్మింపవలసిన భారము ముఖ్యముగ స్త్రీలది. తమ్ము తన పరదేవతాస్వరూపిణులుగ నారాధించిన శ్రీపరమహంసవిశ్వాసమును సార్థకపఱుచు ధైర్యస్థైర్యములు వారికలవడునుగాక!

పరమార్థసిద్ధియే ప్రపంచమందలి సర్వమతముల పర్యవసానమని యింతశ్రమపడి మున్నేయవతారపురుషుఁడుగాని, మతప్రవక్తగాని నిరూపించియుండలేదు; మానవులదివ్యాంశమందు నిశ్చలవిశ్వాసముంచి, మానవసేవయే భగవత్సేవయను సందేశ మింతకంఠోక్తిగాఁ బ్రకటించియుండలేదు. ఈసందేశము నేఁటికిని జాతిమతభేదములను నంతరాయములఁ బాటింపక ఖండఖండాంతరములందుఁ బ్రతిధ్వనించుచు విశ్వజనహృదయము నెట్లు కైవసము చేసికొనుచున్నదో, క్రీ. శ. ౧౯౩౬ ఫిబ్రవరి నెలలో రవీంద్రునివంటి సుప్రసిద్ధుల యాజమాన్యమున ప్రారంభమై ప్రపంచమంతట నొకసంవత్సరమువఱకు జరుగనున్న శ్రీరామకృష్ణశతవార్షికవర్ధంతి మహోత్సవము విశదముచేయఁగలదు. ఈ సందర్భమున బేలూరు మఠములో నొకయాదర్శదేవాలయనిర్మాణమునకై అమెరికాదేశమందలి యొకసాధ్వీమణి అయిదులక్షలరూప్యములవిరాళ మిచ్చినది. విదేశీయులే శ్రీపరమహంస నిట్టి శ్రద్ధాభక్తులతో సేవించుచుండ, భారతీయులు, ముఖ్యముగ నాంధ్రులెల్లరు నీపావనజీవితలీలామృతమును గ్రోలి, విశేషత్యాగవైభవోపేతములగు బహువిధసేవలచే శతవార్షికవర్ధంతి నాంధ్రదేశమున జయప్రదముగ జరిపి, ఆత్మీయవిముక్తికిని, జగత్కల్యాణమునకును దోడ్పడి తప్పక ధన్యులయ్యెదరని మాదృఢవిశ్వాసము!

---

# హెమోద్రాక్సోమాల్ట్

## జీవితమును ఎక్కువ ఆనందమయము గావించును.

హెమో ద్రాక్షోమాల్టు బలప్రవర్ధకౌషధము లన్నిటిలోను ఉత్తమమైనది. జీర్ణశక్తి బాగుగా కలుగజేయును. ఆకలినిపుట్టించి అలసిపోయిన అవయవములకు నూతన శక్తి, పటుత్వము చేకూర్చును.

హెమో ద్రాక్షోమాల్టులో రక్తవృద్ధిగావించు హైమోగ్లోబిన్, ద్రాక్షపండ్లరసము, మాల్టుసారము యింకను యితర అమూల్యములయిన వస్తువు లనేకములు చేరియున్నవి. మన హిందూదేశశీతోష్ణపరిస్థితులకనుగుణముగా నుండునట్లు తయారుచేయబడియున్నది. అదిమీకు తప్పక గుణము కలుగజేయును. అందువలననే విదేశపు మందులకు బదులుగా దీనినే విశేషము వాడుచున్నారు.

నేడే ఒక సీసాకొని వాడుడు.

హెమో ద్రాక్షోమాల్టువలన మీకు జీర్ణశక్తి ఆకలి యే విధముగాకలుగునో తెలియగలదు.




## ఇది అలెంబిక్ సరకు

# ఎక్స్‌కిరణములు

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

ఎక్స్‌కిరణములు ఎటువంటివి? అవి ఎట్లు పుట్టును? రేడియము అననేమి? ఇవి మానవునికి ఎంతమట్టు కుపయోగకరములు? వీని లక్షణము లెట్టివి? స్వభావ మెట్టిది? అనునంశములు మన కందరికి తెలియవలెను. ఏలయన, వైద్యశాస్త్రమునకును, శస్త్ర చికిత్సా శాస్త్రమునకును వీని యుపయోగము అత్యధికము.

ఎక్స్‌కిరణములతో తీయు ఫోటోలనుగూర్చి మనలో చాలమంది వినియుందురు. ఇవి నిజముగా ఛాయా చిత్రములుకావు. ఒక కామెరాను తీసికొని ఏవీథిలోనో, లేక ఏఇంటిలోనో ఫోటోతీయునంత సులభముగా, ఒక ఎక్స్‌కిరణముల ఫోటోను తీయుటకు సాధ్యము కాదు. మామూలు ఫోటోలో వెలుతురు కిరణములు వస్తువుమీద ప్రతిఫలించుటవలన చిత్ర మేర్పడుచున్నది. ఈ ఎక్స్ కిరణచిత్రమందు అట్లుకాక ఈ కిరణములు వస్తువుగుండా సంపూర్ణముగ పోలేకపోవుటవలన పలుచని నీడ లేర్పడి చిత్రము తయారగుచున్నది: అనగా ఎక్స్‌కిరణములు మన దేహభాగముగుండా దూరి ఫోటోనెగటివుమీద పడునప్పుడు మన దేహభాగముల మందము, పలుచదనములనుబట్టి వాని కాంతి తక్కువ ఎక్కువలై ఫోటోనెగటివ్ మీద వస్తువునీడ దట్టముగనో, పలుచగనో నిల్చును.

ఈ కిరణముల తీక్ష్ణత తగ్గుటకు వానిని అడ్డగించు పదార్థముల సాంద్రతయే కారణము. పదార్థముల యందలి కణములు దగ్గరదగ్గరగ నున్నకొలదిని ఈకిరణముల వేధకశక్తి తగ్గును. చర్మమునకన్న కండరములును, వానికన్న ఎముకలును ఎక్కువ సాంద్రతగలవి కాన ఎక్స్‌కిరణముల ఫోటోయం దెప్పుడును ఎముకలు ఎక్కువనలుపుగను, కండరములు కొంచెమునలుపుగను కనబడును. కనుక ఒక్క ఎముక విరిగినను, వంగినను, అది ఏవిధముగ నుండునది ఎక్స్‌కిరణముల ఫోటోవల్ల మనము సులభముగను, చక్కగను తెలిసికొని తగుచికిత్స చేయవచ్చును. విరిగిన ముక్కలను సరిగా లాగిపెట్టి అవి దినదినము ఒకదానితో నొకటి ఎంతమట్టుకు కరుచుకొని ఏకమగుచున్నవను విషయమును ఎక్స్‌కిరణములతో పరీక్షించవచ్చును. మనదేహమునందు ప్రవేశించిన ఏవస్తువునైనను ఎక్కడ నుండునదియు మనము ఎక్స్‌కిరణముల ఫోటోవలన సులభముగ నిర్ధరించవచ్చును.

ఈ ఎక్స్ కిరణముల ఫోటో శస్త్రచికిత్సకు ఎంతఉపయోగమో చెప్ప సాధ్యముగాదు. ఈకిరణములను కనిపెట్టినకొలదికాలముననే అవి ఇట్టివిషయములకు ఉపయోగపడునని తెలియవచ్చెను. తుపాకిగుండు ఒకని కాలిలో “టిబియా” “ఫిబులా” అనబడు క్రిందిరెండు ఎముకలమధ్యను చేరుకొనెను. అది ఎక్కడనుండునది, దానిని బయటకు తీయుటకు ఎక్కడశస్త్రము చేయవలసినది తెలియక శస్త్రవైద్యుడు ఆకాలిభాగమును ఎక్స్‌కిరణములఫోటో తీసెను. గుండు మొదట ప్రవేశించిన స్థానమునకును చికిత్సచేయునప్పుడు అది ఉన్నస్థానమునకును సుమారు ౧౧ అంగుళములఎడ ముండెను. ఇంత దూరము వైద్యుడు శస్త్రముచేయ నక్కరలేకయే ఎక్స్ కిరణముల సహాయమున రెండంగుళముల లోతువరకు మాత్రమే ఛేదించి గుండును తీసివేయుటకు అవకాశము కలిగెను. జర్మనుయుద్ధమునందు ఎక్స్‌కిరణముల ఉపయోగము వర్ణనాతీతము.

ఎక్స్‌కిరణములను తయారుచేయు యంత్రసామగ్రిలో వృద్ధికలిగినకొలదిని రోగనిదానమునందు వీని ఉపయోగము హెచ్చుచువచ్చెను. నేడు ప్రతి గొప్ప వ్యాధికినిగూడ ఎక్స్‌కిరణములు రోగనిదానమునందో, చికిత్సయందో తోడ్పడుచున్నవి.

హృదయమునకు సంబంధించినట్టియు, రొమ్మునకు సంబంధించినట్టియు, జీర్ణకోశమునకు సంబంధించినట్టియు, మూత్రపిండములకును కాలేయమునకును సంబంధించినట్టియు వ్యాధులను, ఇంకను ఎన్నెన్నో

ఇతరవ్యాధులను ఎక్స్‌కిరణముల సహాయమున పరిశోధించి, ఇదమిత్థమని తేల్చవచును. జీర్ణకోశమునందలి ప్రతిభాగముగుండా ఎక్స్‌కిరణములు అవలీలగ దూరిపోగలవు. అట్లుకాక బిస్మత్ (Bismuth) వంటి లవణములో కలిసిన పదార్థమును తినిపించి ఎక్స్‌కిరణముల ఫోటోను తీసినయెడల, బిస్మత్ (Bismuth)యొక్క సాంద్రత ఎక్కువగనుక ఎక్స్‌కిరణములను నిరోధించి నల్లగ నీడను విడుచును. తిన్న ఆహారము పోవలసిన మార్గమునపోక తప్పుమార్గ మనుసరించినను, లేక ఎచ్చటనైన కొన్ని భాగములను అతుకుకొనిపోయినను, లేక జీర్ణకోశమునందలి ఏ భాగమునందైనను నియమిత కాలమునకన్న నెక్కువకాల మున్నను దీనిని బట్టి వ్యాధి ఫలానిదని వైద్యులు నిర్ధరింతురు.



ఎక్స్‌కిరణ ఛాయాచిత్రము తీయుటకు నిలబెట్టిన స్త్రీ.

ఇట్లే మూత్రపిండములను, కాలేయమును ఫోటో నెత్తుటకు పూర్వము దానిలో ప్రవేశించి నీడపడునట్లు చేయగల వస్తువులను తినిపించి ఎక్స్‌కిరణముల ఫోటో తీయుదురు. అట్లు చేయనిదే మూత్రపిండములందు కాని, కాలేయమునందు కాని రాయి (Stone) ఉన్నదని నిర్ధరించుటకు గాని, చికిత్సచేయుటకు గాని ఇప్పటి వైద్యులు సమ్మతింపరు. రాజయక్ష్మము అను వ్యాధిని గూర్చి పరీక్షించునప్పుడు ఎక్స్‌కిరణముల ఫోటో మిక్కిలి ఆవశ్యకము. ఈ వ్యాధియందు కొన్ని క్రిములు (Germs) దేహమునందు ప్రవేశించి ఒక్కొక్క భాగమును తినివేయుచుండును గాన ఈ వ్యాధిని నిర్మూలముచేయుట అతిదుష్కరమును, అత్యావశ్యకమునుకూడ. ఈ పురుగులు తినివేసిన భాగమంతయు తెల్లతెల్లనిమచ్చలవలె ఎక్స్‌రేఫోటోలో కనబడును. గనుక దానివల్ల ఈ వ్యాధి ఉన్నదా లేదా అను విషయమేకాక ఎంతమట్టుకు వ్యాపించినది అను విషయము కూడ విశదమగుచున్నది.




ఆ స్త్రీ యొక్క ఎక్స్‌కిరణ ఛాయాచిత్రము.

ఇక చికిత్సకు ఎన్నివిధముల ఈకిరణములు ఉపయోగపడునో గమనింతము. అన్నివ్యాధులకన్నను మిక్కిలి భయంకరమై ప్రపంచమునందంతటను వ్యాపించి మానవులను భయకంపితులను జేయుచున్న

క్యాన్సర్ (Cancer), సార్కోమా (Sarcoma) అను విష్రవణములు ఎక్సుకిరణములవల్లనో, రేడియమువల్లనో తప్ప మరి ఏవిధముగను నివారణగావు. ఈవిష్రవణవ్యాధినిగూర్చి పరిశోధించి, దీనిని నిర్మూలము గావించుటకు ప్రపంచమునందలి ముఖ్యమైన దేశము లన్నిటియందును విష్రవణనివారకసభలు ఏర్పడియున్నవి. మూడుసంవత్సరముల కొకపర్యాయము ఒక అంతర్జాతీయరేడియము శాస్త్రజ్ఞమహాసభ (International Rediological Conference) సమావేశమగును. ప్రతి




ఫోర్సెల్, గూస్టా　　　　బెక్లేర్, ఎంటాయిన్
రెండవ, మూడవ అంతర్జాతీయ రేడియము శాస్త్రజ్ఞ మహాసభల అధ్యక్షులు.

సారియు నొక్కొక్క దేశమునందు ఈసభ సమావేశమైనపుడు ఆయా దేశములందలి విష్రవణనివారకసభల తరఫున వచ్చినవారు తమతమ దేశములందు ఈవిష్రవణములను నిర్మూలనము చేయుటకు ఎట్టిపని జరుగుచున్నదో విశదీకరింతురు. రేడియము, ఎక్సుకిరణములుతప్ప మిగిలిన వేవియు విష్రవణములను నిర్మూలింపలేవని నిర్ధారణయైనది కావున వీని నేవిధముగ నుపయోగించినయెడల వ్యాధి త్వరలో కుదురునను విషయముననే యీసభలును, ఈఅంతర్జాతీయసమావేశములును యోచించుచున్నవి. విష్రవణరోగులలో చాలమందికి ఈ ఎక్సుకిరణములు, రేడియముమాత్రమే కాక శస్త్రచికిత్సకూడ యావశ్యకమేకాని, శస్త్రచికిత్స చేసినను చేయకున్నను ముఖ్యచికిత్స వీనివల్లనే. ఈ రోగము ప్రారంభమైన కొద్దిరోజులకే ఈ చికిత్స ప్రారంభించినయెడల పూర్తిగ కుదురుననియు, ఎక్కువ ఆలస్యముగ ప్రారంభించినప్పటికి రోగికి చాలమేలు కలిగించి ఆసన్నమరణమును మరికొంతకాలమువరకు నిలుపగలదనియు వాని ప్రయోగానుభవముచే వల్ల వైద్యశిఖామణులు తెల్పియున్నారు.

లూకీమియా (Leukeamia) అను నింకొక గొప్పరోగము కలదు. ఈ రోగము వచ్చినయెడల ప్లీహము ఉబ్బి రక్తమునందలి శ్వేతకణములు (White blood corpuscles) అత్యధికములై రోగిని బాధించి చంపును. ఇట్టిరోగి ఎక్సుకిరణములవల్లనే మేలు పొందగలడు. హాడ్జ్ కిన్సు వ్యాధి (Hodgkins disease) అని పిల్లల కెక్కువగ బాధించు వేరొక్కవ్యాధి కలదు. ఈరోగము వచ్చినయెడల శరీరమునందంతటను క్రిమినాశకగ్రంథులు ఉబ్బి మెడక్రింద ఎక్కువగ పైకి ఉబుకుచున్నట్లు గన్పించును. ఈవ్యాధికూడ ఎక్సుకిరణములవల్లనే నివారణమగును. తామర (Ringworm) అను చర్మవ్యాధి ఎక్సుకిరణములవల్లనే బాగుపడును. బహిష్ఠ కాక యుండుట, ఋతురక్తము అత్యధికముగ పోవుట మొదలగు గర్భకోశసంబంధము లగు అనేక రోగములు ఎక్సుకిరణముల వల్లనే బాగుపడుచున్నవి. ఎక్సుకిరణములును, రేడియమును ఏయేవ్యాధులందు ఉపయోగపడునది, ఏయే వ్యాధులను కుదుర్చునది తెల్పు ఒకపట్టిక నీయ సాధ్యముకాదు. ఇది యది యననేల, మానవుని రోగచికిత్సయందు ఎక్సుకిరణములును, రేడియమును అత్యధికముగ నుపయోగపడుచున్న వన్న చాలు. దినదినమును వీని ఉపయోగము ఎక్కువగుచున్నది.

ఎక్సుకిరణములు వైద్యమునందువలెనే పరిశ్రమలయందును ఎక్కువగ ఉపయోగపడుచున్నవి. పరిశ్రమలయందవి వైద్యశాస్త్రమునందువలె గాక అపాయకరము లగు స్థితిగతులు కలుగకుండను, ప్రాణోపద్రవము సంభవింపకుండను నివారించుటకొరకే ముఖ్యముగ నుపయోగపడుచున్నవి.

జనసమ్మర్దమైన గొప్పపట్టణముల నడుమనుండు యంత్రశాలలందలి ఒకానొక కాగు (Boiler) తటా

లున ఫట్‌మని పగిలిపోయిన దనుకొందము. మూడంగుళ ముల మందము కలిగి ఒక్కొక్కచదరపు అంగుళమునకు నూర్లకొలది శేర్ల ఒత్తిడిగల ఉక్కుతో తయారయిన ఒకకాను (Boiler) ఉన్నట్టుండి ఆకస్మికముగ పగిలిన యెడల ఎందరికి ప్రాణాపాయము కలుగునో, ఎంత ద్రవ్యము నాశనమగునో చెప్పనలవికాదు. కాన అట్టి కానునందు ఏలాటి దోషమును ఉండరాదు. కాను తయారైనపిమ్మట అంతనికరముగ దానిని పరీక్షించుటకు ఎక్సుకిరణములకేకాని సాధ్యముగాదు. ఈకిరణములద్వారా అట్టికాను అంతర్భాగసంయోజనము సరిగానున్నది లేనిది నిష్కర్షగావించుకొనుట ఇటీవల సర్వసామాన్యమైనది.

ఇంజనీయర్లు చేయగలిగిన మానవాతీతము లనదగు పనులలో ఒకటి అమెరికాయందుండు బోల్డర్ కట్ట. ౭౦ అడుగులనుండి ౩౦ అడుగులవరకును వ్యాసమును (Diametre), ౨౩ అంగుళముల మందమును, ౧౩,౦౦౦ అడుగుల పొడవును గల ఉక్కుగొట్టములతో ఈకట్ట నిర్మితమయినది. ఈగొట్టముల నొకదానితో నొకటి అతికించిచూచినయెడల వీనిపొడవు రమారమి ౨౦ మైళ్లవరకు నుండును. ౫౫,౦౦౦ ల టన్నుల ఉక్కు ఈపనికై ఉపయోగింపబడెను. ఇట్టికట్ట తెగినచో ఎంతటి యుపద్రవకరమైన జలప్రవాహము ఉద్భవింపగలదో, అట్టిప్రళయమునందు ఎందరుజనులు నశింతురో, ఎంతద్రవ్యము నాశనమగునో ఊహింప నలవికాదు. ఈ కట్టయందలి ప్రతియంగుళభాగమును పరీక్షించుటకై ఎక్సుకిరణముల ఫోటో తీయబడెను. అందునిమిత్తము ఉపయోగించిన ఫిల్ము మొత్తపుపరిమాణము సుమారు కొన్నిమైళ్లు ఉండియుండును.

ఎక్సుకిరణములను కనుగొన్న వెనువెంటనే పరిశ్రమయందు (Industry) వాని కెన్నియో ఉపయోగము లేర్పడెను. ఎక్సు కిరణములను కనుగొన్నపిమ్మట ఒకసంవత్సరము లోపుననే అమెరికా సంయుక్త రాజ్యములలోని ఏల్ విశ్వవిద్యాలయము నందలి ఎ. డబ్ల్యు. రైట్ (A. W. Wright) అను ఆచార్యుడు టంకముతో నతికించిన ఒక లోహపు ముక్కను ఎక్సురేఫోటో తీసెను. టంకపు అతుకు స్థూలదృష్టికి ఏమాత్రమును కానరాకయుండినను ఎక్సుకిరణములద్వారా పరీక్షించిన వెంటనే ఆ లోహపు ముక్క ఎచ్చట విరిగియుండినదియు విశద మాయెను.



దోషపరిశీలనము నిమిత్తమెత్తిన ఇనుప చక్రభాగపు ఎక్సుకిరణ ఛాయాచిత్రము.
(బాణపుగుర్తున్నచోట ఇనుప చక్రము లోపలిభాగమున గల దోషము మరకవలె గానవచ్చును.)

ఎక్సుకిరణములవల్ల ఫిరంగులు మొదలగునవి బాగుగ పరీక్షింపవచ్చుననియు, యంత్ర అంతర్భాగములందలి గుప్తదోషములు ఈ కిరణములవల్ల తేటతెల్లముగ గానవచ్చుననియు ప్రభుత్వమువారు కనుగొనిరి. ౧౯౨౭ సంవత్సరమునందే ఫ్రెంచి ప్రభుత్వమువారు నేలబొగ్గులోని మాలిన్యమును పరీక్షించుటకును, లోహములలోని గుప్తదోషములను కనుగొనుటకును ఈ కిరణములను ఉపయోగించిరి.



నిర్దుష్టమయిన ఇనుపచక్రపు ఎక్సుకిరణ ఛాయాచిత్రము.

అమెరికాయందలి సాన్‌ఫ్రాన్సిస్కో (Sanfrancisco) యందు చక్కెరలో ఇసుకయు, గోధుమపిండి యందు సీమసున్నమును కలిపి వర్తకులు చేయుచున్న మోసమును ఈకిరణములద్వారా కనిపెట్టిరి. ముత్యపు చిప్పను తెరువకయే దానియందు ముత్యముండునదియు, లేనిదియు వీనివలన కనుగొనిరి. కొన్నినగరములలో బట్టలయందు పైకి కనుగొనరాని లోహసంబంధమైన పదార్థమును చేర్చి వర్తకులు బట్టలబరువు నెక్కువ చేయగా ఆకిటుకు ఈకిరణములద్వారా వెల్లడియైనది. ఒకపార్సిల్ విప్పకయే దానియందుండు వస్తువులను ఈ కిరణములద్వారా కనుగొనవచ్చును. అందుప్రమాదకరము లగు వస్తువులే కలవో, నిషిద్ధవస్తువులే కలవో ఈకిరణ ములద్వారా కనిపెట్టవచ్చును. విద్యుత్తంతులచుట్టు నుండు అపాయనివారకవస్తువగు ఇన్సులేషన్ (Insulation) సరిగ నున్నదో లేదో వీనివల్ల తెలిసికొన వచ్చును.



ఇనుపనాళపు కడ్డీయందలి దోషమును జూపించు ఎక్సుకిరణ ఛాయాచిత్రము. (నల్లని బాణపు గుర్తున్న చోటగల నల్లనిమరక గాంచనగును.)

జర్మనుయుద్ధమునందు ఫిరంగులు మొదలగు యుద్ధ సామగ్రి చావరకు ఎక్సుకిరణములతో పరీక్షింప బడెను. శత్రువుల యుద్ధసామగ్రి దొరకినచో దానిని ఎక్సుకిరణములతో పరీక్ష గావించి దాని అంతర్నిర్మాణ మును శోధించి స్ఫోటద్రవ్యము (Combustible materia) ఎచ్చట నుండునదియు నిశ్చయించువరకు దానిని ఏమియు చేయువారుకారు.

ఇటీవల ఎక్సుకిరణముల నెన్నెన్ని విషయము లకో ప్రయోగించుచున్నారు. వీని సహాయముతో నేల బొగ్గునందు భస్మపదార్థ మెంత యుండునదియు, గోల్ఫు (Golf) ఆటయందుపయోగించు బంతియొక్క అంతర్భాగమున బీటలు మొదలైనవి లేక సరిగా నుండు నదియు, లేనిదియు నిర్ధారించుచున్నారు. వజ్రముల విలువ ఈ ఎక్సుకిరణముల సహాయమువల్ల నిర్ధారణమగు చున్నది. అసలైన వజ్రము ఈ కిరణములకు ప్రకాశక భేద్యమగు వస్తువు. కృత్రిమవజ్రమున కట్టి ప్రకాశక భేద్యతలేకపోవుటవలన ఫోటోలో నల్లని నీడ పడును. వెల యధికమగు పొగాకుచుట్టలును, పొగాకును ఎక్సు కిరణములవల్ల క్రిమిరహితములుగ చేయబడుచున్నవి. వాయువిమాన నిర్మాణమునందు ఎక్సుకిరణము లత్యంతో పయోగకరములు. ప్రతి సంవత్సరమును ఇంగ్లాండు మొదలగు దేశములయందు జరుగు కృత్రిమయుద్ధక్రీడయందు ఉపయోగించు మందుగుండు అంతయును, అపాయసందేహనివృత్తికై ఎక్సుకిరణముల ద్వారా పరీక్షించి నిజమైన మందుగుండు ఏమాత్రమును అందు లేదని నిర్ధారింపబడిననే గాని ఉపయోగింపరు. పాశ్చాత్యదేశములందలి పురాతన చిత్రపటములకు నమ్మ రాని వెలయిచ్చికొనెదరు. అందువల్ల కొందరు ప్రాచీన చిత్రము లనుభ్రమ కలిగించునట్లు చిత్రములురచించి అమ్మజూపెదరు. అవి నిజముగ పురాతనపువా, అధు నాతనచిత్రకారుల మోసములా అనువిషయ మెన్నియో సారులు ఎక్సుకిరణములవల్ల నిర్ధారణమయినది. కార్నెలి యస్ ఎంగల్ బ్రెక్ట్సన్ (Cornelius Engel brechtsen)అను సుప్రసిద్ధ జర్మను చిత్రకారుని "క్రూసి ఫిక్షన్" (Crucifixion) అను చిత్రపటమునందిపుడు కానవచ్చు ఒకానొక స్త్రీచిత్రము అసలు స్త్రీ చిత్రము కాదనియు,అంతకుమును పది ఒకపురోహితచిత్రమనియు ఎక్సుకిరణములవల్ల గుర్తింపబడినది. ఆధునిక చిత్రరచన యందు వాడు నట్టిరంగులన్నియు నేలబొగ్గుతారు నుండియే తయారైనవి. కాన యెక్సుకిరణములు నిరభ్యంతరముగ వీనిగుండా పోగలవు. కాని పురాతన కాలపు రంగులన్నియు ఎక్సుకిరణముల ఫోటోయందు

నీడనిల్చునట్లు చేయును. చాలయంత్రముల అంతర్నిర్మాణము క్లిష్టమై లోహపుగొట్టములయం దమర్పబడి యుండును. ఒక్కొక్కయంత్రమునందలి వేర్వేరుభాగములను సంయోజనముచేసి యవి సురక్షితముగ నుండుటకై ఆసంయుక్తయంత్రము నొక లోహఖండమునందు జాగ్రత్తపరిచియుంచెదరు. లోపలనుండెడి యంత్రభాగములన్నియు సరిగ నొకదానికొకటి యతుకుకొని యంత్రమంతయు సుస్థితియం దున్నదో, లేదో తెలిసికొనుటకు దానిని ఎక్స్కిరణములద్వారా పరిశోధింతురు.

ఉంగరమును మ్రింగిన ఒకానొక ఏనుగుయొక్క ఎక్స్ కిరణముల ఫోటో తీసినట్లుకూడ మనకు తెలియవచ్చుచున్నది.

అదృష్టములైన విషయములను అగుపడునట్లు చేయు విచిత్రమైనట్టియు, అమూల్యము లైనట్టియు, అత్యంతోపయోగకరము లయినట్టియు ఈ కిరణముల స్వభావ మేమి? వీని ధర్మము లేవి? అనునంశము లిక తెలిసికొందము.



రాంజను ఎక్స్కిరణములను కనిపెట్టుటలో నుపయోగించిన ఎక్స్కిరణపు గొట్టములు.

స్క్రూమేకులు మర లోచట్టులలో సరిగ బిగువుగ అమరినదియు, లేనిదియు ఎక్స్కిరణములద్వారా తెలిసికొందురు. కడకు మనము స్పెన్సరుకంపెనీయందు విలువగల బూట్సులను కొన్నను కూడ ఆబూట్సులు సరిగా మనకాళ్లకు సరిపోయినదియు, లేనిదియు ఎక్స్ కిరణములవల్ల మనమే కన్నులార చూడవచ్చును.

జంతుచికిత్సా శాస్త్రమునకు ఎక్స్కిరణములు ఎంతవరకు ఉపయోగకరము లను నంశమున చెప్పవలసిన పనియే లేదు. గుఱ్ఱముల యెముకల వ్యాధులను, దొరలుపెంచు పెంపుడుకుక్కలు, పిల్లులు మ్రింగివేసిన అపాయకరమైన పదార్థములను ఎక్స్కిరణములవల్లనే పరిశోధించి కనిపెట్టుచున్నారు. ఒక

ఎక్స్కిరణములు సాధారణకాంతికిరణములకంటె భిన్నములని వీనిని కనుగొన్న ప్రప్రథమమున చెప్పుకొనుట వాడుకగ నుండెను. సూర్యకిరణములను పరావర్తింపజేయుటకును, వక్రీకరింపజేయుటకును, కేంద్రీకరింపజేయుటకును సాధ్యముకాగలదు. కాని ఎక్స్కిరణములను మాత్రము కేంద్రీకరింపను, వక్రీకరింపను, ప్రతిఫలింపజేయను శాస్త్రజ్ఞుల కప్పటికివారికి తెలిసిన యంత్రసామగ్రితో సాధ్యము కానందున ఎక్స్కిరణములు సామాన్యమయిన ఇతర వెల్తురుకిరణములవంటివి కావు అను ప్రతీతి బయలుదేరెను. కాని పరిశోధన జరిగిన కొలదిని ఈకిరణములు కూడ అన్ని విషయములందును మిగిలిన కాంతికిరణములవంటివే యని తెలియవచ్చెను. క్రొత్తక్రొత్త యంత్రములవల్ల వీనిని కేంద్రీకరింపను,

వక్రీకరింపను సాధ్యమయ్యెను. ఈ కిరణములు కూడ సూర్యకిరణ ప్రసారవేగముతో, అనగా ఒక సెకనుకు ౧౮౬,౦౦౦ ల మైళ్ల వేగముతో వ్యాపించునని తెలియ వచ్చెను. ఈ రెంటికిని గల భేదమంతయు ఒక్క కెరటపు నిడివి (Wavelength) యందు మాత్రమే.

ఒకజ్యోతి యందలి తేజఃకిరణములు (Light -corpuscles) మనకంటివరకు ప్రసరించుటయే కాంతి యని ఒకప్పుడు భౌతికశాస్త్రవేత్త యగు న్యూటన్ (Newton) కూడ తలచెను. కాని ఈ సిద్ధాంతము తరువాతి పరిశోధనలవలన తప్పని తెలిసినది. కాంతిప్రవాహమెప్పుడును అలలవలె ప్రసరించునని ఇప్పుడు సిద్ధాంతమైనది. చలనములేని జలాశయమునందు ఒకచిన్న రాయి వేసిన ఏమగును? రాయి నీటిని తాకినస్థలమునుండి చిన్న చిన్న అలలు ప్రారంభమై గట్టువరకును వ్యాపించును. ఈ అల లెట్టివి? ఎట్లు కలుగును? అని పరీక్షించినయెడల ఈ అలలు నీటిప్రవాహమువలన కలిగినవి కావనియు, తరంగరూపముగ గట్టువరకు ప్రయాణించినది రాయి నీటికి తగిలినప్పుడు ఉత్పత్తిచెందిన శక్తి (Energy) మాత్రమే యనియు మనకు తెలియును. అట్లే మన కంటివరకు ప్రసరించునది తేజఃకణప్రవాహము కాదు; వానినుండి కలుగు తరంగరూపమైన శక్తిమాత్రమే. ఈ తరంగపంక్తియందలి ఒకతరంగపు అగ్రమునుండి దాని ప్రక్కతరంగపు అగ్రమువరకు గల దూరమునకే తరగ(కెరటపు) నిడివి (Wavelength) యందురు.

తేజస్సిద్ధాంతముల నన్నిటిని ఇచ్చట వివరింప సాధ్యముగాదు. కాని వివిధవర్ణములు గల కాంతులు కలసి తెల్లరంగగుననియు, సూర్యకాంతి నిజముగ ఇంద్రధనుస్సునందు గోచరించు సప్తవర్ణముల సమాహారమే యనియు సిద్ధాంతమైనది. ఒకత్రిఫలకపట్టకము (Prism) గుండా సూర్యకిరణములను ప్రసరింపజేసినచో ఆకిరణములు విభక్తమై ఇంద్రధనుస్సునందలి ఏడురంగులుగా కనబడుట వెలుతురు (Light)ను గురించి చదివినవారికి తెలిసిన విషయము. ఈరంగులు కెరటపునిడివి (Wavelength) నిబట్టి యుండును. అనగా ఇంద్రధనుస్సునందలి రంగులలో మొదటిదగు ఎరుపురంగుకిరణముల కెరటపునిడివి చాల హెచ్చుగను, కడపటిదగు ఊదారంగుకిరణముల కెరటపు నిడివి చాల తక్కువగను ఉండును. కెరటపునిడివి ఎక్కువగుకొలదిని కిరణములకు వేధకశక్తి (చొరుచుకొని పోగలశక్తి) తక్కువగును. ఎఱ్ఱకిరణముల కెరటపునిడివి చాలఎక్కువగనుకనే వానిని ఫోటోలను తయారుచేయు గదియందు ఉపయోగించినను ప్రమాదములేదు. కాని అంతకన్న తక్కువ కెరటపునిడివిగల శ్యామకిరణముల నో, లేక ఆకుపచ్చకిరణములనో ఉపయోగించినయెడల ఫోటో నెగటివు పాడగును.

సూర్యకిరణములతో పోల్చినయెడల ఎక్స్కిరణములు అత్యంతహ్రస్వమగు కెరటపునిడివికలవి. అందాజాగా సూర్యకిరణముల కెరటపునిడివిని ౧౦,౦౦౦ ల భాగములుచేసినయెడల వానిలో ఒక్కభాగము ఎక్స్ కిరణముల కెరటపునిడివి యని అనుకొనవచ్చును. కనుక సామాన్య కిరణములు చొరుటకు అశక్యమైన ఎక్కువసాంద్రత కల పదార్థములగుండా కూడ ఎక్స్ కిరణములు చొరుచుకొని పోగలవు. ఎక్స్కిరణముల యొక్కయు, మిగతకొన్ని కిరణముల యొక్కయు కెరటపునిడివి ఈక్రిందిపట్టికలో ఇవ్వబడినది. ఈకొలతలు అత్యంత సూక్ష్మమైనవిగనుక ఆంగ్స్ట్రాం (Angstrom -units) కొలతలలో తెలుపబడినవి. ఒక 'ఆంగ్స్ట్రాం' అనగా ఒక అంగుళములో ౩౯౩౭ / ౧,౦౦,౦౦౦,౦౦,౦౦,౦౦౦ వ భాగము. అనగా ఒక అంగుళమును ౨౫ కోట్లభాగములుగ చేసినచో వానిలో ఒకభాగముకంటె తక్కువగ నుండును.

| | |
|---|---|
| రేడియో కెరటములు (Radio Waves) | ౨ కోట్లకోట్లు (౫౦ వేలకోట్లు) |
| విద్యుత్ప్రవాహమునందలి హ్రస్వపుకెరటములు (Short Electric Waves) | ౩౫,౦౦,౦౦౦ |
| అతిఎఱ్ఱని కెరటములు (Infra Red Waves) | ౨౫,౦౦,౦౦౦ |

| | |
|---|---|
| కంటికికనబడు కెరటములు (Visible rays) | ౭,౮౦౦ |
| అతి ఊదాకిరణములు (Ultra voilet rays) | ౩,౮౦౦ |
| మృదువయినకిరణములు (Very soft rays) | ౧,౦౦౦ |
| అత్యంత ఊదాకిరణములు (Ultra voilet rays) | ౧౦ |
| ఎక్స్‌కిరణములు......... | ౧ |
| గామా కిరణములు ... | ౦.౦౫ |
| ... | ౦.౦౧ |

దీనినిబట్టి కలపయందును, ఇనుమునందును అణువులు చాలదగ్గరగ నుండి సూర్యకిరణములను చొరనీక పోయినను ఇంతకొంచెము కెరటపునిడివిగల ఎక్స్‌కిరణముల నవి అడ్డగించలేకపోవుచున్న వని తెలియగలదు. అణువులచేరిక యింకను ఎక్కువైనకొలదిని, అనగా ఒకపదార్థముయొక్క సాంద్రత ఎక్కువైన కొలదిని ఎక్స్‌కిరణములు ఆపదార్థమునుండి దూరిపోవుట కష్టసాధ్యమగును. ఇప్పటి యంత్రములతో తయారుచేయుటకు వీలగు ఎక్స్‌కిరణములు ౪ లేక ౫ అంగుళముల ఘందముగల ఇనుపముక్కగుండా దూరిపోగలవు. ఇంకను మంచియంత్రములను తయారుచేసినయెడల ఇంతకంటె ఎక్కువమందముగల ఇనుపపదార్థములను చొరుచుకొని పోవు శక్తిగల యెక్స్‌కిరణములను సైతము తయారు చేయవచ్చును.

ఎక్స్‌కిరణములు కంటికి కనబడవు. ఎక్కువ కెరటపునిడివి గల యెఱ్ఱనికిరణములే కంటికి బాగుగ కనబడును. కెరటపునిడివి తగ్గినకొలదిని కిరణములు బాగుగ కనబడవు. చీకటియందు ఊదా, నీలికిరణములు స్ఫుటముగ కనబడనందుకు ఇదియే కారణము. అటులున్నపుడు ఈ ఊదారంగుకిరణముల కెరటపునిడివి కన్న అత్యంతస్వల్పమైన కెరటపు నిడివి గల ఈ యెక్స్‌కిరణములు కంటికి కనబడునా? కాని ఈ కిరణములు ఫోటోఫిల్ముమీద సాధారణ కిరణములవలెనే ముద్రితము కాగలవు. ఇదియుగాక ఈ కిరణములు 'బేరియము ప్లాటినో సయనైడ్' (Barium Platino - cyanide) అను పదార్థముపై పడినయెడల నవి ఆ పదార్థమును నిగనిగ మెరయునట్లు చేయును. కనుక ఒక గాజుపలకపై ఈ పదార్థమును పూసి, దీనికిని ఎక్స్‌కిరణములకును మధ్య ఒకచేతినో, కాలినో, లేక ఒక మనుష్యునో నిలబెట్టినయెడల నిగనిగ మెరయు ఆ గాజుపలకపై మనుష్యుని యెముకలయొక్కయు, కండరములయొక్కయు నీడ కనబడును.

ఈ యెక్స్‌కిరణములకు ఇంకను కొన్ని స్వభావము లున్నవి. వాయువులగుండా విద్యుచ్ఛక్తి ప్రవహించదు. కాని అట్టి వాయువులమీద ఎక్స్‌కిరణములను ప్రసరింపజేసినచో వానిగుండ అప్పుడు విద్యుచ్ఛక్తి ప్రవహింపగలదు. అదియుకాక ఎక్స్‌కిరణములు ఏ పదార్థముపైన బడినను ఆపదార్థమునుండి ఎలెక్ట్రానులు (Electrons) అనబడు ఋణపరమాణువులను విమోచ



ఎక్స్‌కిరణములను గనిపెట్టిన రాంజను మహాశయుడు

నము చేయును. ఈ విషయమును గూర్చి ఇంకను ముందు తెల్పెదను. కాని ఈ స్వభావము సాధారణ కిరణములకు గూడ కొంతమట్టుకు కలదని ఇక్కడ గమనింపవచ్చును.

ఎక్స్‌కిరణము లేవిధముగ ఉత్పత్తియగునను విషయము కొంచెము పరిశీలింతము. ఈకిరణములను కనిపెట్టిన రాంజనుమహాశయుడు ఇందునిమిత్తమై ఉపయోగించిన సామగ్రి ఏమాత్రమును క్లిష్టముగాని ఒక ఎక్స్‌కిరణముల గొట్టముమాత్రమే. అది ఈక్రిందచూపిన బొమ్మవంటి గాజుపరికరము. దీనియందు విద్యుచ్ఛక్తి



రాంజన్ ఉపయోగించిన మొదటి యంత్రోపకరణములు

ప్రవహింపచేయుటకు విద్యుత్సంబంధమైన ఒక ధనాగ్రమును (Anode), ఒక ఋణాగ్రమును (Cathode) కలిగి గొట్టములో కొంతవాయువు (Gas) మాత్రము మిగిలియుండునట్లు చేయబడియుండెను. ధన, ఋణ (Positive and Negative) విద్యుచ్ఛక్తుల సమ్మేళనమువల్లనే విద్యుత్ప్రవాహము కలుగునని మనకందరికిని తెలియును. పైగొట్టములో విద్యుదృణాగ్రమనబడునది (Cathode) ఋణశక్తికి (Negative) సంబంధించినది. విద్యుద్ధనాగ్రము (Anode) ధనశక్తికి (Positive) సంబంధించినది. ఈ గొట్టమును విద్యుదాధారకమగు పదార్థసామగ్రితో సంబంధముకలుగజేసిన వెంటనే ఈగొట్టమునందలి వాయువు విద్యుద్వ్యాపకమై (Ionise) ధనరేణువులను (Positive ions) ఉత్పత్తి చేయును. ఈ ధనరేణువులు (Positive ions) విద్యుదృణాగ్రమునకు (Cathode) ఆకర్షింపబడి అచ్చటి ఋణరేణువులను (Negative ions) ఋణపరమాణువులను (Electrons) విమోచనము చేయును. ఈవిద్యుదృణపరమాణువులు (Electrons) గొట్టముకొనవరకు ప్రవహింపగనే అచ్చట వాటికి గాజు అడ్డము వచ్చును. వెంటనే యెక్స్‌కిరణములు ఉద్భవించును.

ఇందువల్ల తెలిసిన దేమన, వేగముగ ప్రవహించు విద్యుదృణపరమాణువులకు (Electrons) ఏదైన నొక పదార్థము అడ్డమువచ్చినచో ఎక్స్‌కిరణము లుత్పత్తియగు ననియే. మనము ఉపయోగించు విద్యుచ్ఛక్తియొక్క ఒత్తిడిప్రమాణము (Voltage) అధికమగుకొలదిని విద్యుదృణపరమాణువుల (Electrons) ప్రవాహవేగ మధికమై వానికి గలుగు నిరోధమువలన నుద్భూతమగు ఎక్స్‌కిరణముల తైక్ష్ణ్యము అధికమగుచుండును; అనగా అట్టిఎక్స్‌కిరణముల కెరటపునిడివి తక్కువగుచు వానివేధకశక్తి ఎక్కువగుచునుండును. రాంజనుమహాశయుడు ఉత్పాదించిన ఎక్స్‌కిరణముల వేధకశక్తి చాల ఎక్కువగ ఉండియుండదని ఊహింపవచ్చును. అతని ఎక్స్‌కిరణపుగొట్టమునందు విద్యుదృణ పరమాణువులను అడ్డగించు పదార్థము గాజు. గనుక చాల ఎక్కువ ఒత్తిడిప్రమాణము గల విద్యుచ్ఛక్తి నుపయోగించినచో ఋణపరమాణువుల (Electrons) వేగముచే గాజు పగిలి గొట్టము నాశనమయియుండును.

ఈసూత్రముపై నాధారపడి ఎన్నియోవిధములగు ఎక్స్‌కిరణముల గొట్టములు నిర్మితములైనవి. ఇప్పుడున్నవానిలో కెల్ల 'కూలిడ్జి' గొట్టము అనునదే ముఖ్యమైనది. ఒకలోహము చాల ఎక్కువగ కాగినయెడల విద్యుదృణ పరమాణువులను అత్యధికముగ ఆవిర్భవింపజేయు

నని ఫ్లెమింగు, రిచార్డ్సన్ అను మహాశయులు కను గొన్న సూత్రము నాధారముచేసికొని ఈ కూలిడ్జి గొట్టమును నిర్మించినారు. ఈ గొట్టమునందు ఏమాత్రమును వాయువు లేకుండునట్లు చేయుటకు సాధ్యమయినంత వరకు ప్రయత్నము జరిగినది. ఈగొట్టమునందలి విద్యుద్ధనాగ్రము టన్గ్స్టన్ (Tungsten) అను నొక లోహముతో చేసిన ఘట్టిముక్క. పొట్లతీగెకొనవలె చుట్లుతిరిగిన టన్గ్స్టన్‌తీగ గర్భమునగల చిన్న అంత ర్వర్తుల పాత్రమే (Cylinder) ఈ గొట్టమునందలి విద్యుదృణాగ్రము (Cathode). ఈగొట్టమును విద్యుదాధారకసామగ్రితో చేర్చినవెంటనే విద్యుదృణాగ్రమునందలి తీగ చాల ఎఱ్ఱగ కాలి విద్యుదృణ పరమాణువులను అత్యధికముగ ప్రవహింపజేయును. ఈ వర్తుల పాత్రము ఈవిద్యుదృణపరమాణువులు నానాదిక్కులకు చెదరిపోకుండునట్లు చేయుటయేగాక విద్యుద్ధనాగ్రము (Anode) టన్గ్స్టన్ ముక్కమీద వానిని కేంద్రీకరింపజేయును. టన్గ్స్టన్‌లోహము మిగత అన్ని లోహములవలెగాక ఎంతో అతి విపరీతముగ కాగినగాని ద్రవింపదు. అందుకే దీనిని ఈగొట్టములందు ఉపయోగింతురు. విద్యుదృణపరమాణువులన్నియు కేంద్రీకృతములయి విద్యుద్ధనాగ్రముమీద పడినవెంటనే అచట వాటికి నిరోధము కలిగి ఎక్స్‌కిరణములు ఉద్భవించును. మనము ఉపయోగించు విద్యుచ్ఛక్తి ఎక్కువయిన కొలదిని టన్గ్స్టన్(Tungsten)తీగ కాలుట ఎక్కువయి మరింత యధికముగ విద్యుదృణపరమాణువులు విమోచన మగుచుండును. ఈవిధముగ ఎక్స్‌కిరణముల తైక్ష్ణ్యమును హెచ్చించుటకుగాని, తగ్గించుటకుగాని సాధ్యముకాగలదు. ఇప్పుడు సాధారణముగ 3,౦౦,౦౦౦ ఒత్తిడిప్రమాణము (Voltage) గల కూలిడ్జిగొట్టములు దొరకగలవు. వీనినుండి పుట్టు ఎక్స్‌కిరణములు ౭ అంగుళముల ఘనముగల ఉక్కుతునకగుండా దూరిపోగలవు. వైద్యులు సాధారణముగా ౨,౦౦,౦౦౦ ఒత్తిడిప్రమాణముగల గొట్టముల నుపయోగింతురు. కాని ౯,౦౦,౦౦౦ ఒత్తిడిప్రమాణముగల గొట్టములుకూడ గలవు.

ఈఎక్స్‌కిరణముల నుపయోగించువారు ఎంత జాగ్రతగ నుండవలయునో వీని నుద్భవింపజేయుట కుపయోగించు విద్యుచ్ఛక్తియొక్క ఒత్తిడి ప్రమాణమునుబట్టియే చెప్పవచ్చును. ఏ మాత్రము అజాగ్రతగ నుండినను ప్రాణహాని సంభవింపవచ్చును. ఈ అపాయమునకన్న ఎన్నియోరెట్లు అధికమగు నపాయము ఎక్స్‌కిరణములవల్లనే సంభవించుచున్నది. ఈకిరణముల ఉపయోగమును గమనించునపుడు ఈ కిరణములకు జీవాణువుల(Cells) మీద యెంతశక్తి గలదో చూచితిమి. అధికముగను, అజాగ్రతగను ఎక్స్ కిరణములు మనదేహముమీద పడినచో ఎన్నియో అనర్థములు సంభవించును. సునిశితములు గాని ఎక్స్‌కిరణములు చర్మములోను, దేహమునందలి పైపై భాగములందును వ్యాపించి ఈ భాగములందలి జీవాణువులను కాల్చివేసి విషవ్రణము( Cancer )వంటి వ్రణమును కలుగజేయును. దీనిని బాగుచేయుటకు సాధ్యము కాదు. ఎక్స్‌కిరణములను కనిపెట్టిన కొత్తలో ఎందరో మహామహులైన శాస్త్రజ్ఞులు ఈ యపాయమునకు గురియై వికలాంగులైరి. కాని రానురాను ఉత్పత్తిచేయబడు ఎక్స్ కిరణముల తైక్ష్ణ్యము హెచ్చిన కొలదిని ఇంతకన్న ఎక్కువ అపాయము సంభవింపజొచ్చెను. ఈ తీక్ష్ణకిరణములు చర్మముతో ఆగక ఇంకను ఎక్కువలోతుగ ప్రవేశించి తీవ్రవ్యాధులను కలుగజేసి ఎందరో శాస్త్రజ్ఞులను అంతమొందించినవి. ఇట్టికిరణములవల్ల అపాయము సంభవించినదనికూడ అంత్యకాలము సమీపించువరకు తెలియరాదు.

శాస్త్రజిజ్ఞాసకై ఎందరో మహానుభావులు తమ జీవితములను ధారపోసి ఎన్నియో మహత్కార్యములను సాధించినపుడు వారినిగురించియు, వాటినిగురించియు ఇంచుకేనియు మనకు తెలియకుండుట నిందాస్పదము. డడ్లీ (Dudley) అను ఒకవైద్యుడు తనతలపైననే పరిశోధనలు గావించుకొనుటకు ఒప్పుకొని తన శిరోజములను గోల్పోయెను. లియోనార్డో (Leonardo), కాల్డ్వెల్ (Caldwell), డాడ్ (Dodd), కస్సబియన్ (Cassabian) అనుశాస్త్రవేత్తలు, డాక్టరులు అందరు

ఈ ఎక్స్‌కిరణములవల్లనే ప్రాణములను గోల్పోయిరి. క్లారెన్స్‌డాల్లీ (Clarence Dally) అను నతనికి ఎక్స్ కిరణముల పరిశోధనవల్ల వ్రణవ్యాధి ప్రారంభమాయెను. దానిని బాగుచేయుటకు ఎన్నియోమార్లు శస్త్రచికిత్స జరిగినను తుద కాతడు మరణించెను. పైనిచెప్పిన డాడ్ (Dodd) వ్యాధినివారణార్థము తనకు ఒక్కొకమారు శస్త్రచికిత్స జరిగినకొలదిని అతనికి ఎక్స్‌కిరణపరిశోధనమునందలి యభిమానమును, అభినివేశనమును హెచ్చుచువచ్చెను. తుదకు ఇట్లు జరిగిన ఏబదవతడవచికిత్సయందు అతడు ప్రాణములను గోల్పోయెను.

థామ్సన్ (Thomson) అనుదొర ఎక్స్‌కిరణములు ఏవిధముగ చెరుపుచేయునని పరిశోధించుటకై తన వ్రేలిమీదనే పరిశోధనలు గావించెను. శాస్త్రాభివృద్ధికై ఇతడు ఎన్నిబాధల కోర్చుకొనెనో మనకు తెలియదు. కాని అతడు తాను జరపిన పరిశోధనలకు ఫలముగ వ్రాసిన వ్యాసములవల్ల ప్రపంచమునకు కలిగిన మేలు చెప్ప నలవిగాదు.

ఎన్నియో క్రొత్తవిషయములను కనిపెట్టి రేడియము ఎక్స్‌కిరణములనుగూర్చి సుమారు ౨౫౦ గ్రంథములను రచించి ప్రపంచమునందంతటను రేడియము ఎక్స్‌కిరణచికిత్సయందు వియన్నానగరమునకు మించినది లేదను కీర్తితెప్పించిన హోల్ష్‌నిక్ట్ (Holshknecht)అను ఆస్ట్రియా దేశపు ఆచార్యుడు తన పరిశోధనలవల్ల సంభవించిన వ్యాధులవల్లనే కష్టపడి కష్టపడి తుదకు తన ౫౮-వ ఏట చనిపోయెను. మొట్టమొదట అతని యెడమ చేతి రెండువ్రేళ్లయందు ఈవ్యాధి ప్రారంభమైనపుడు శస్త్రచికిత్స చేసి ఆరెండువ్రేళ్లను కోసివేసిరి కాని రోగము కుదురలేదు. పిమ్మట రోగము ముదిరి మిగత వ్రేళ్ళన్నిటిని ఆక్రమించుటచే వానినన్నిటిని కోసివేయవలసివచ్చెను. కడకు తన కుడిచేతినే కోసివేయవలసివచ్చెను. ఇతడు సుమారు ౭౦ మార్లు శస్త్రచికిత్స చేయించుకొనియుండును. ఏమైన నేమి, చిన్నదనదగు వయసునందే ప్రాణములను గోల్పోయెను.

ఇక శాస్త్రవేత్తలకు ధననష్ట మెంత కలిగెనో చెప్ప నలవికాదు. ఈపరిశోధకులందరు తాము వైద్యముననో, లేక మరిఏవిధముననో సంపాదించిన డబ్బునంతయును ఎక్స్‌కిరణ పరిశోధనలపై వెచ్చపెట్టిరి.

ఇట్టి త్యాగమూర్తులు కష్టములకోర్చి తమజీవితములను ధారపోసిరి గనుకనే ప్రపంచమునకు శాశ్వతముగు మేలు చేకూరునట్లు చేయగలిగిరి. వీరిని పీడించిన వ్యాధులనుబట్టియే రేడియము ఈ ఎక్స్‌కిరణములనుండి కలుగుచెరుపు నేవిధముగ నివారింపనగునది మనకు తెలిసివచ్చినది. "ఎక్స్‌కిరణములు, రేడియమురక్షకసంఘము" అనెడి సంఘ మొకటి ఇంగ్లాండునం దున్నది. ఎక్స్ కిరణములను, రేడియమును ఉపయోగించువారు ఏయేవిధముల జాగ్రత్తపడవలెననునంశమునుగూర్చి వీరు కొన్ని నియమనిబంధనలనుతయారుజేసియున్నారు. స్టాక్‌హోల్మ్ (Stockholm) నందు జరగిన రెండవ అంతర్జాతీయరేడియము శాస్త్రజ్ఞమహాసభయందుకూడ ఈ విషయమును చర్చించి ఏఏవిధముగ ఈకష్టములను అపాయములను తొలగించుకొనవచ్చునో నిర్ధరించియున్నారు

కాని యెక్స్‌కిరణములను, రేడియమును అనుభవశాలికానివాడు ఉపయోగించినయెడల తప్పక కష్టము సంభవించును. ఎంతనేర్పరియైన వైద్యుడుగాని, యెంత గొప్పశస్త్రవైద్యుడుగాని రేడియము, ఎక్స్‌కిరణములందు అత్యధికమైన అనుభవమున్ననేకాని వానిజోలికి పోగూడదు. వట్టిశాస్త్రజ్ఞాన ముండి వైద్యభాగము తెలియకున్నను కష్టమే. వైద్యుడుగనుండి ఈశాస్త్రమును బాగుగ నభ్యసించి అనుభవము కలిగినగాని వీని నుపయోగించుటకు అర్హతలేదని నమ్మవలెను.

మదరాసు రాజధాని, తిరువాన్కూరు, మైసూరు, హైదరాబాదు కోస్తాల కంతటికిని ఎక్స్ కిరణములు, రేడియము సంబంధమైన చికిత్స చేయించుకొనుటకు ఏలాటిభయమునులేక పోదగిన స్థలములు రెండే. ఒకటి మదరాసు జనరల్ ఆస్పత్రి. ఇది గవర్నమెంటువారిచే స్థాపింపబడినది. ఇదివరకు దీనికి ఒక పాశ్చాత్యపండితుడు అధ్యక్షుడుగ నుండెను. వీరు వైద్యభాగమును పఠించకపోయినను అనుభవమువల్ల చాల మేధావులుగ పనిచేయుచుండిరి.

రెండవప్రదేశము "మదరాస్ రేడియము సంస్థ" (Madras Radiological Institute) అని మదరాసునందే పూనమల్లిహైరోడ్డు ౧౮-వ ఇంటియందు ఉన్నది. దీని అధ్యక్షులు డాక్టర్ పి. రామారావుగారు. వీరు చాలకాలము మదరాసునందే సుప్రసిద్ధ వైద్యులుగను, శస్త్రవైద్యులుగను బనిచేసి సుమారు ౧౦ సంవత్సరములనుండి ఈ ఎక్స్‌కిరణములు, రేడియమును గురించియే ప్రత్యేకకృషి చేయుచున్నారు. లక్షకు



పి. రామారావు

మించి ద్రవ్యమును వ్యయముచేసి అత్యుత్తమమగు యంత్రములను, ఇతరసామగ్రిని చేకూర్చియున్నారు. ఇదివరకే వివరించిన హోల్ష్‌నిక్ట్ (Holshknecht) మహామహునివద్ద వీరు ఈవిద్య నార్జించి మదరాసునందలి గొప్పగొప్ప డాక్టరులయొక్కయు, జనులయొక్కయు మన్ననల బడసినారు. ౧౯౩౭-వసంవత్సరమునవీరు సునిశితఎక్స్‌కిరణచికిత్సాలయమును ప్రారంభించినపుడు మదరాసు గవర్నమెంటు వైద్యశాఖాధికారియగు సర్జన్ జనరల్ దొరగారు వీరి ఉద్యమము నెంతయు ప్రశంసించిరి. ఇంతటితో తృప్తిచెందక ఇటీవల యూరోపుఖండము నందు ఈశాస్త్రవిషయమున ఏమేమిక్రొత్తవిషయములను కనుగొనినారో తెలిసికొనుటకై వీరు ఆఖండము నందలి వివిధదేశములకు వెళ్లి రెండునెలలక్రిందటనే తిరిగివచ్చిరి. వీరు విషవ్రణనిర్మూలనము చేయుటకై ప్రత్యేకముగ నొక ఆస్పత్రిని కట్టించుచున్నారని తెలియుచున్నది. ఇది నిజమేయగునెడల ఇట్టియాస్పత్రి హిందూదేశమున కంతటికిని ఇది యొక్కటే.

ఇదివరకు మనము ఎక్స్‌కిరణములవలని ప్రయోజనములను, అపాయములను, వానిసంబంధమయిన యంత్రములనుగూర్చి మాత్రమే యోచించితిమిగాని అవి ఎచ్చటనుండి ఉత్పత్తియగునను అంశమును గమనించమైతిమి. ఈవిషయము నర్థముచేసికొనవలయునన్న సర్వమునకును ఉత్పత్తిహేతువును, ఆధారభూతమును నైన అణువునుగూర్చి కొంతమట్టుకు తెలిసికొనవలసియున్నది. అణువును జూడ సాధ్యముగాకున్నను అది యేమో మన మందరము ఊహింపగలము. ఏవస్తువునందైనను ఇక నెంతమాత్రమును భేదింపవీలుగాని సూక్ష్మాతిసూక్ష్మమయిన పలుకునే అణువని మన మనుకొందుము. మొన్న మొన్నటివరకును శాస్త్రజ్ఞులుకూడ ఇట్లనే అభిప్రాయపడిరి.

కాని ౧౯-వ శతాబ్ద్యంతమున అణువు నిజముగ ఇంతసులభముగ అవగాహనచేసుకొన సాధ్యమగు వస్తువా యని అనుమానము ప్రారంభమాయెను. ఇట్టి అనుమానము ఎట్లు దృఢమయ్యెనో, అణువునుగూర్చి భౌతికశాస్త్రవిశారదులగు థామ్సన్ (J. S. Thomson), రూథర్‌ఫర్డ్ (Lord Rutherford), నీల్సుబోహరు (Niels-bohr) మున్నగువారు ఏయేపరిశోధనలు గావించిరో అవన్నియు ఈవ్యాసమున చెప్పసాధ్యముగాదు. కాని యిప్పటికి అణువు ద్రవ్యము (Matter) కాదని తేలినది.

అణువు విద్యుద్వికారము. దీని కేంద్రమున ఒక విద్యుద్ధనపరమాణువు ఉన్నది. దానినే ప్రోటాన్ (Proton) అందురు. దానిచుట్టును వలయాకారముగ ఋణశక్తులు సూర్యునిచుట్టు గ్రహములు తిరుగునట్లే తిరుగుచుండును. విద్యుద్ధనపరమాణువుచుట్టును తిరుగుచుండు విద్యుదృణపరమాణువుల (Electrons) సంఖ్యనుబట్టి అణువులను ౯౨ తరగతులుగ విభజించియున్నారు. విద్యుదృణపరమాణువులసంఖ్యనుబట్టి విద్యుద్ధనపరమాణువుయొక్క ప్రమాణము మారుచుండును. కాబట్టి అణువునందు ధన, ఋణపరమాణుప్రమా

ణము సమముగ నుండును. అన్నిటికన్న తేలికైన అణువు ఉదజని (Hydrogen) అణువు. దీని విద్యుద్ధనాగ్రము చుట్టును ఒక్క విద్యుదృణపరమాణువుమాత్రము వలయాకారముగ తిరుగుచుండును. అణువులలో విద్యుదృణపరమాణువు ఒక్కటే కలదుకావున ఇది ఒకటవ సంఖ్యకు చెందిన అణువు. దీనికంటె బరువైన హీలియము (Helium) అణువుసంఖ్య ౨. ఆక్సిజన్ (Oxygen) అను ప్రాణవాయువుయొక్క అణుసంఖ్య ౮; అనగా ౮ విద్యుదృణపరమాణువులు (Electrons) దీనివిద్యుద్ధనాగ్రము (Positive Nucleus) చుట్టును తిరుగుచున్నవనియు, దీని ధనపరమాణువు ఉదజని (Hydrogen) ధనపరమాణువుకంటెను ఎనిమిదింతలు అధికమనియు అర్థము. అత్యంతఘనమగు అణువు యురానియము (Uranium) అణువు. దీని అణుసంఖ్య ౯౨.

ఇంతవరకు ఋణపరమాణువుల సంఖ్యనుమాత్రమే తెలిసికొంటిమిగాని వాటి పరిమాణమును తెలిసికొనలేదు. ఒక్కొక్క ఋణపరమాణువుయొక్క పరిమాణమును అణువుకంటెను సుమారు రెండువేలింతలు తక్కువ. అణువులను మించి శోధించుట అశక్యమని ఒకప్పుడు భ్రమించిన భౌతికశాస్త్రజ్ఞులు ఇప్పుడెంత మట్టుకు జ్ఞానాభివృద్ధిచేయగలిగినారో పైసంగతులను బట్టియే విశదమగుచున్నది.

అణువు విద్యుచ్ఛక్తియొక్క రూపాంతరముగాన ద్రవ్య (Matter) మనబడున దంతయు శక్తి (Energy)యొక్క రూపాంతరమే యని సిద్ధాంతమగుచున్నది. సర్వమును శక్తియే. శక్తియననేమి? పనిచేయు సామర్థ్యమే శక్తి. పనిచేయువరకును శక్తి వ్యక్తీకృతము గాకపోవచ్చును. కాని గూఢముగ నున్నను, అనిగూఢముగనున్నను, వ్యక్తముగనున్నను, అవ్యక్తముగ నున్నను సమస్తమును శక్తియే యని ఇప్పుడు బోధయగుచున్నది. శక్తి వ్యక్తమైనపుడు వెలుతురుగనో, ఉష్ణముగనో, మరి ఇంకేవిధముగనో మనకు తెలియవచ్చును. ఒకకిరణసముదాయము, అనగా కాంతిరూపమైన శక్తి ఒక అణువుపైన పడినచో ఆ అణువునందలి విద్యుద్ధనపరమాణువుచుట్టును తిరుగుచుండు విద్యుదృణపరమాణువులలో నొకటి నియమితమార్గచ్యుత మగును. అణువునందలి శక్తి యధికమైనదని దీని యర్థము. తనకు నియతముగ నుండవలసిన శక్తికంటె ఎక్కువశక్తి అణువునందు ఉండజాలదు. ఎందుకనగా, అణువునందలి విద్యుచ్ఛక్తిభాగములు రెండును సమముగా నుండవలెను. కనుక వెంటనే ఖాళీస్థలమునందు ఒకక్రొత్త విద్యుదృణపరమాణువు చేరి, అధికముగ చేరిన ఆశక్తిని పోద్రోలును. దీనిని వికీరణము (Radiation) అని అందురు. ఇదికూడ కాంతిస్వరూపమైన భిన్నశక్తియే. అణువునందలి ఋణపరమాణువులు తమ నియతమార్గముల వదలి అంతర్మార్గవర్తినులైనపుడెల్ల వికీరణము (Radiation) సంభవించును. ఈవికీర్ణకాంతియొక్క కెరటపునిడివి అణువునందు సంభవించు మార్పునందలి న్యూనాధిక్యములనుబట్టి మారుచుండును. వర్తులమార్గమునందలి తొలుదొల్లటి కక్ష్యలో దిరుగు ఋణపరమాణువు దాని ప్రక్కనే యుండు కక్ష్యలోనికి దాటినచో సంభవించు వికీర్ణకాంతియొక్క కెరటపునిడివి చాలఎక్కువ. కావున దీనియొక్క వేధకశక్తి (Penetrability) చాల తక్కువ. అందువలన ఈకాంతికిరణము బహుశః కంటికి కనబడునేమో. ఈకిరణ మొకవేళ నిశితమైన ఊదాకిరణముల బోలియుండవచ్చును. కాని మనము ఎక్కువశక్తి ఉపయోగించి అణువునందలి ఉపరికక్ష్యలయందు దిరుగు ఋణపరమాణువులను అంతకన్న చాల లోపలి కక్ష్యలలో పడునట్లు చేసినయెడల అందువల్ల సంభవించు శక్తి చాల యధికమై తజ్జనితవికీర్ణకాంతి ఎక్స్‌కిరణములుగా నుండవచ్చును. అణువునందలి ఉపరికక్ష్యలందునగాక లోకక్ష్యలందు మార్పులు సంభవించుకొలది ఈకిరణముల తైక్ష్ణ్యముకూడ హెచ్చుగుచుండును.

ఎక్స్ కిరణములతోపాటు పైని రేడియముపదమునుగూడ వాడినాను. రేడియమును గురించికూడ తెలిసికొన్నగాని ఈవ్యాసము సమగ్రముకాదు. ఎక్స్ కిరణములవలెనే రేడియముకూడ మానవుని కత్యంతోపయోగకరముగ నున్నది. అందువలన రేడియమును గురించి రాబోవు సంచికయందు వ్రాసెదను.



# కలగూరగంప



## కీ. శే. బాలకవి కొత్త జగ్గయ్యచౌదరిగారు



క్రీ. శ. ౧౯౦౩ వీరి జన్మసంవత్సరము. కొంచెము నటుడు; ఇంకాకొంచెము కవి. అంతకన్న కొంచెము గాయకుడుకూడా. ఇదంతా పూర్ణప్రజ్ఞాచార్యులవారి ప్రజ్ఞావిశేషమంటారు కొందరు. కాదు, సహజమేనని మరికొందరు. మొత్తముమీద ఆయనచదివింది ఫోర్తు ఫారంవఱకు హూణవిద్య; ఐదవతరగతివఱకు తెలుగు. ఈస్వల్పవిషయంతో నంతప్రజ్ఞ సంపాదించాడాఅంటే ఏమో ననేసమాధాన మొస్తుంది. కలము చేతబట్టినాడంటే కదనుదొక్కిస్తూ కమ్మనిభావాల్తో మంచిమంచి ఆదర్శాలు చూపెట్టేవాడు.

ఇది భారతీపాఠకులకు విదితమే. 'పన్నా' అనే పద్యకావ్యాన్ని, 'మంథరతో కైక' అనే పద్యవ్యాసాన్ని భారతిలో ప్రచురించి భారతి పాఠకుల కితడు పరిచితు డైనాడు.

వేషంవేసినాడంటే చక్కగా వుండేదంటే చాలు. అప్పట్లో విబుధరంజనీనాట్యసమాజమంటూ తన యాజమాన్యమున నొక నాటకసమాజమును స్థాపించి యితరసమాజకులతో జేరి ద్రౌపదీమానసంరక్షణము, రామదాసు, చిత్రనళీయము మొదలైననాటకాలాడే వారు. అందులో వీరు దుర్యోధనుడు, శకుని, బాహుకుడు మొదలైనపాత్రలు ధరించి ప్రేక్షకుల నానందాంబుధితరంగముల నోలలాడించేవారు. భూతదయఅనేది యీయనకు వెన్నతోబెట్టినవిద్య. తనకున్న దానితో యితరుల సంతోషపెట్టేవారు. ఇటువంటి వానినిగాంచి మూలదైవ మోర్వలేకపోయింది. ఈ మహాత్ముని పవిత్రాత్మకు పరమేశ్వరుడు శాంతి చేకూర్చుగాత!

కొత్త సూర్యనారాయణ

---

## కీ. శే. వెంకటసుబ్బమ్మ




ఈమె శ్రీ పాణకా కనకమ్మగారి ఏకమాత్ర పుత్రిక. తన యల్పాయుష్యమును ప్రజాసేవయందు గడపిన ధన్యురాలు.

---




## శ్రీమద్వాల్మీకిరామాయణము

క్రౌను ౧/౮ సైజు. ౧ వాల్యూమున పు. ౨౦౮. ౨, ౩, ౪ వాల్యూములు కలిసి పు. ౬౩౯. మొత్తము ౮౩౮ పుటలలోను బాలకాండమున ౪౯ సర్గ లున్నవి. కాగితము, బైండు, అందముగను, గట్టిగను ఉన్నవి. ఒక్కొక్క సంపుటము వెల రు. ౧-౮-౦.

శ్రీగండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచియింపబడిన 'సుబోధిని' అను నాంధ్రటీక, తాత్పర్యము, విశేషార్థము ఇందుగలవు.

ప్రకాశకుడు : గోటేటి కృష్ణమూర్తిశర్మ, మాముడూరు, కృష్ణాజిల్లా.

---

## నవ్యభారతోదయము: వచనము

క్రౌను ౧/౮ సైజు. పు. ౨౩౦. వెల రు. ౧-౪-౦ అట్టబైండు, రు. ౧-౦-౦ రేపరుబైండు.

రచయిత: ప్రకాశకుడు: కామరాజు హనుమంత రావు, ప్రాక్ప్రతీచీగ్రంథాలయము, రాజమహేంద్రవరము.

---

## చిత్తసంస్కారము

(మూడాశ్వాసముల పద్యకావ్యము)

డిమ్మీ ౧/౮ సైజు. పు. ౧౧౬ వెల రు. ౧.

గ్రంథకర్త: సూరపనేని కాకులయ్య, చవటపల్లి, గుడివాడ తాలూకా.

---

## శ్రీరామబాల్యం: అయిదంకముల నాటకము

డిమ్మీ ౧/౮ సైజు. పు. ౬౬ వెల రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త: ఆదూరి వెంకటరంగస్వామిఅయ్యరు, శ్రీరామానుజభవనము, కోర్టువీథి, ఒంగోలు.

---

## శ్రీ దీక్షితుల చరిత్రము

(వచనము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౪౮. వెల రు. ౦-౬-౦

గ్రంథకర్త: వింజమూరి వరాహనరసింహాచార్యులు, కాకినాడ.

---

## భక్తిసారము

(వచనము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౮౦. వెల: గ్రంథాలయములకు, భక్తసమాజములకు రెండణాలతపాలుబిళ్లలు.

కర్త: పుప్పల శ్రీరామమూర్తి, అనకాపల్లి

---

## శ్రీ నిర్వచన మహాభక్తవిజయము ప్రథమ సంపుటము

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౮౨. వెల: చందాపద్ధతి: కనీసము నాలుగు రూపాయలు చెల్లించువారికి ఏడాది కిట్టి సంపుటములు మూడు పంపబడును.

గ్రంథకర్త: శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవి, దోమకొండ సంస్థానాస్థానకవి, పెద్దమందడి, మహబూబునగరంజిల్లా, వనపర్తిసంస్థానం పోస్టు (నైజాం).

---

## హెచ్చరిక పచ్చలు : పద్యములు

రచయిత : మారేపల్లి రామచంద్రశాస్త్రి

---

## ఖూనీ : నాలుగురంగముల నాటిక

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౦౦, వెల రూ. ౧.

గ్రంథకర్త: కవిరాజు, సూతాశ్రమము, తెనాలి.

---

స్మృతికాలపుస్త్రీలు : వచనము

క్రౌను ౧/౮ సైజు. పు. ౨౧౨ వెల రు. ౦-౧౦-౦

గ్రంథకర్త: జటావల్లభుల పురుషోత్తము, యం.ఏ.

ప్రకాశకులు : వల్లూరు సూర్యనారాయణరావు, బి. ఏ., బి. యల్., కొవ్వూరు.

---

జ్యోతిషఫలప్రదర్శని : వచనము

డిమ్మి ౧/౮ సైజు. పు. ౧౧౪ వెల రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త: మల్లాది అచ్యుతరామశాస్త్రి.

ప్రకాశకులు : కురుకూరి సుబ్బారావు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

---

కవిగారి మనుగడ : వచనము.

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౧౮. వెల ౦-౮-౦

గ్రంథకర్త : జయంతి సుబ్బారావు.

ప్రకాశకులు : కవితాసమితి, విశాఖపట్టణము.

---

కానుక : మిశ్రము

క్రౌను ౧/౮ సైజు. పు. ౩౪. అమూల్యము.

కర్తలు : బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారి యెడ భక్తిగల కవిమిత్రులు పలువురు.

ప్రకాశకులు : సబ్బవీసు సత్యకేశవరావు, విశాఖపట్టణము.

---

## సుందరమూర్తినాయనారు

లోకమున భక్తిజ్ఞానములను ప్రబోధించుటకొరకై దక్షిణదేశమున నవతరించిన నాయనారులను శివభక్తాగ్రేసరులలో నీయన యొక్కరు. దక్షిణదేశమునందలి రమాపుర మీయన జన్మస్థలము. మహర్షి యుపమన్యునికి పైతము ప్రతిపత్తిని రేకెత్తించిన యీమహాపునిచరిత్ర యత్యద్భుతమైనది. శివభక్తమాహాత్మ్యమను నొకగ్రంథమున నీయన జీవితచరిత్రలు వివరముగ తెలుపబడి యున్నవి. ఆగ్రంథములోని కొన్నిరంగములను పురస్కరించుకొని రచించిన తంజావూరుప్రాచీనచిత్రములను శ్రీకాశీనాథరావుగారు సేకరించి ప్రకటనకై మాకిచ్చిరి. ఆసేకరింపులో నీసంచికయందున్నది మొదటిది. శివభక్తమాహాత్మ్యములోని తృతీయాధ్యాయవస్తువే యీచిత్రమునకును వస్తువు. ఆ అధ్యాయ మిట్లున్నది: ఉమాశంకరులు ఒకరోజు కైలాసమున దిరుగుచుండ విశ్వకర్మ యొక్క మణిదర్పణమును దెచ్చి శంకరులకు జూపెను. అందు శంకరుల నిజరూపము గోచరముకాగా కోటి మారసమప్రభమగు నాబింబమునుజూచి సహజకౌతూహలమున నుమ యారూపమును సృజింపగోరెను. మారుమాటాడక ఉమానాథుడు సృజించి యామూర్తికి సుందరుడను నామకరణము కూడ చేసెను. సమస్తాధికారములతో గణాధిపత్యము కూడ అతనికి ప్రసాదింపబడెను. ఇట్లుండ సురలు క్షీరసాగరము నమృతమునకై మథించుచు నడుమబుట్టిన కాలకూటము ధాటికాగలేక శంకరుని శరణుజొచ్చిరి. వెంటనే యాయన యాకాలకూటమును గొనిరా సుందరమూర్తిని బంపెను. అతడును దానిని గొనివచ్చి యీశ్వరున కిచ్చెను. ఈశ్వరుడు గొంతుకలో దానిని భద్రపరచెను.

తరువాత నీసుందరమూర్తియే కైలాసమున సాంసారికసుఖముల కాసించి ప్రభునిశాపమునకు గురియై భూలోకమున నవతరించి యాయనయాదేశముప్రకారము భక్తిమార్గమును ప్రజల కెరుకపరచుచు కాలము గడపెను.

# అమృతాంజనము

వనమూలికలచే తయారైనవాడు, ఎట్టి బాధల నైనను తొలగజేయగలదు కంటి కందనగు డబ్బీలో నుండగలదు, వెలుపలికి వచ్చిన వెంటనే ఉపచరింపగలదు, అన్ని చోట్లను దొరకగలదు. చక్కని డబ్బీతో సహా సీసా 1-కి అ. 8.

# తామరతైలము

త్రివర్ణము గల "సూర్యోదయము" గుర్తు గల తామరతైలము, పూతినాశకములగు చాల మంచి మందులతో తయారుచేయబడి ప్రఖ్యాతిగాంచినది.

డబ్బీ 1-కి అణాలు 6.

# మోహినితైలము

స్త్రీ, పురుషులు వాడుటకు యోగ్యమైనది.

మెదడునకు, కంటికి చలువయిచ్చి సౌందర్యమును పెంపొందించి కురులను పెంచును. సువాసన గలిగించి మనోహరముగా నుండును. సుఖనిద్ర, విశ్రాంతుల నిచ్చును. సీసా 1-కి అణాలు 12.

# దంతచూర్ణము

పంటిపోటును బాపి, నోటి దుర్గంధమును బోగొట్టి పండ్లు తోముటకు బాగుండును. చిగుళ్లనుండి రక్తము కారకుండజేయును. డబ్బి 1-కి అణాలు 2

# గజ్జికితైలము

గజ్జి, చీడ శరీరమంతట వ్యాపించి ముఖ్యముగ చిన్న పిల్లలకు విశేషబాధను గలిగించుచున్నవి. ఈ తైలమును నాలుగుపూటలు రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగునవి నశించును. తప్పక పనిచేయును. డబ్బీ 1-కి వెల. అ. 4.

# తేలుమందు

కుట్టినచోట కొంచెము మందు పోసిన, బాధ మాయమగును. మందును గలిగియున్న, తాము బాధపడక ఇతరులకిచ్చి పుణ్యము గట్టుకొనవచ్చును. ప్రతి యింట నుండదగినది. సీసా 1-కి వెల అ. 8.

# అమృతాంజనం డిపో.,

బొంబాయి, మదరాసు, కలకత్తా, రంగూను.

